# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?



ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది

# విపుల చతుర

ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
చిలకరింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే గుబాళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది



అది పుట్టిన రోజయినా..
నూతన సంవత్సర సందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

డీడీ లేదా ఎంఓ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.
ఆన్‌లైన్ బుకింగ్‌కు (యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సైఫాబాద్, హైదరాబాద్ ఆన్‌లైన్ అకౌంట్ నెం. 370605010044015)

వివరాలకు : vipula.chatura@eenadu.net

సంపుటి -34, సంచిక - 9
405వ సంచిక, పేజీలు : 132
అక్టోబరు 2011

# చతుర

## విషయసూచిక


✦ **ప్రవేశిక విజేతలు** 85
✦ **మనసున ఉన్నదీ...** 91
✦ **ప్రవేశిక** 119
✦ జ్ఞానపీఠాలు - 33 124
✦ **హాహా.. అమెరికా-7** 126
✦ **చతురంగం-7** 130
✦ చతుర ప్రపంచం
సేకరణ : ఎం. కావ్య
✦ **గురజాడ చతురోక్తులు**
సేకరణ : కె.రఘు
✦ క్యాప్షన్ మీదే - 34 3వ కవరు
✦ ముఖచిత్రం : తాప్సి
పుస్తకాలంకరణ : రాజుయాట


**'మా**మ్! డాలర్ల వర్షం కురిపించే కంపెనీతో రేపు డీల్ కుదరబోతోంది' అన్నాడు అనంత్.
'అయితే నాకేమి ఇస్తున్నావు?' అంది రాణి హేమాంబరీ దేవి.
'మీరు ఏమడిగినా ఇస్తానమ్మా' అన్నాడు అనంత్.
'డైమండ్ నెక్లేస్‌లు బోలెడు ఉన్నాయి.. అలాంటివి వద్దు'
'సరే, మరేం కావాలో అడగండి మామ్!' రెట్టించాడు అనంత్!
'ముద్దుల తమ్ముడు నాండీకి పద్దెనిమిది నిండేలోపు.. అది పూర్తి అవ్వాలి?' అంది రాణి అర్థోక్తిగా.
' ఏం పూర్తవ్వాలో ఆదేశించమ్మా?' అన్నాడు అనంత్.
'ఇటీవలే ఓ రచయిత మంచి కథ కూడా చెప్పాడు..' అంటూ రాణి తన కోరిక వెలిబుచ్చింది.
తల్లి కోరిక విన్న అనంత్ ఉలిక్కి పడ్డాడు.
ఇంతకీ ఆమె కోరికేమిటి?
ఆద్యంతం ఆసక్తిగా ఆకట్టుకునే నవల
**డా. మంథా భానుమతి**
**మాయపండు**
పేజీ... 6
బొమ్మలు : పిన్నాడ రవి





# 2011లో ఇంప్రింట్‌వారి భారతదేశంలోని తీర్థయాత్రలు పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక,
ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6,
8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్,
తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేంద్రం.
7 రోజుల యాత్ర . రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6,
19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5,
24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్,
నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6,
19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7,
19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు
గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేంద్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7,
28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతి
ర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7,
23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సమస్యా పరిష్కార యాత్రలు

మీ జాతక రీత్యా ఎటువంటి సమస్యలకైనా పరిష్కారము పొందుటకు
చేయవలసిన యాత్రలు విద్యా, ఉద్యోగ, వివాహ, వ్యాపార, ఆర్థిక, కుటుంబ ,
కోర్టు వ్యవహారాలు , ఆరోగ్య సమస్యలు పరిష్కారానికి ప్రత్యేక యాత్రలు

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం,
గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది,
ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6,
22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి
జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం
కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 5,500/- (భోజనములు కాక)
రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## నర్మదా నది పుష్కర యాత్ర - ఓం కారేశ్వరానికి

(17-5-2012 నుండి 28-5-2012 వరకు)
మధ్యప్రదేశ్‌లో కంటక పర్వత ప్రాంతంలో జన్మించింది. ఈ నదిలో స్నానం చేసి,
తీర్థవిధులు నిర్వహిస్తే వందతరాల తమ పూర్వీకులు పవిత్రులు అవుతారు.
టికెట్లు బుకింగ్ మొదలైనది

## భారతదేశంలో 365 రకాల తీర్థ యాత్రలు - ప్యాకేజీలు

హిమాలయాల నుండి కన్యాకుమారి వరకు ఏక్షేత్రానికైనా యాత్రలు
మాచే నిర్వహించబడును ఆధ్యాత్మిక జ్ఞానం కలిగిన గైడ్స్
మిమ్మల్ని తీసుకుని వెళ్లుదురు

వివరాలకు :





**దంటు నాగార్జున శర్మ, వేద నిలయం. ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్**

ప్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్,
హైదరాబాద్ - 20, ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092

సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ సునీత ఎంతో ఇష్టపడి తోటి ఉద్యోగి శ్రీనాథ్‌ను పెళ్లాడింది. తనను అమితంగా ప్రేమించే భర్తతో సునీతకు ఎలాంటి పేచీలేదు. అయితే హఠాత్తుగా ఆమె జీవితంలో నిరాశనిస్పృహలు కమ్ముకున్నాయి.

పట్టుమని పద్దెనిమిదేళ్లయినా నిండని జమీందారి బిడ్డ నందగోపాల్‌కు చదువుకోవాలని ఆసక్తి. పైగా గణితంలో అతడు దిట్ట. కానీ అతడి జీవితం ఓ ముళ్లబాట.

సకల సద్గుణ సంపన్నుడు, శ్రీమంతుడైన అనంత్‌ను చూస్తే జర్నలిస్టు బిందూ పులకించిపోతుంది. అనంత్‌కు కూడా ఆమెపైన వల్లమాలిన ప్రేమ. బిందూ శంకించినట్లుగానే వారి ప్రేమకు ఓ ప్రతిబంధకం ఎదురైంది.

ఈ సమస్యలన్నిటికీ పరిష్కారాలను స్ఫురింపజేస్తూ విచిత్రంగా ఓ ఫలరాజం ఆదుకుంది. ఇంతకీ వారి సమస్యలకు కారణాలేమిటి? ఆ పండు చూపిన పరిష్కారాలేమిటి? ఆద్యంతం ఉత్కంఠభరితంగా సాగే డా. మంథా భానుమతి నవల మాయపండు అక్టోబరు చతుర కానుక!



**మం**చు తెరలను ఛేదించుకుని రాబోతున్న బాల భాస్కరుని కిర ణాలకు స్వాగతం పలుకుతూ, శీతల పవ నాల స్నేహ హస్తంతో ఆకు ఆకు కదిలేలా ఒడలు విరుచుకుంది గున్నమామిడి.

'నిద్ర లేచాం.. ఇంక మీరు పదండి' అంటూ మంచు బిందువుల్ని విదిలించి, లేతరెమ్మపై కనులు తెరవబోతున్న చిగు రాకు చుట్టూ కాపలాగా ఉన్న కొంచెం పెద్ద ఆకులు, నునువెచ్చని ఉషోదయ కాంతులు తమ చిన్నారి సహోదరిని స్పర్శించేలా విచ్చుకున్నాయి.

మలయమారుతం పలుకరిస్తుండగా, గోరువెచ్చని కిరణాలకి కరిగిన మంచునీ టిలో స్నానంచేసి, ఎర్రబడిన మొనతో గర్వంగా చూసింది చిరుచిగురాకు.

'మంచు పారిపోయిందిగా.. ఇంక నాకేం ఎదురు' అంటూ చిగురాకును ఆను కుని చిన్ని మొగ్గ బయటికి రాబోయింది. ఇప్పుడు ఆ మొగ్గని రక్షించుకునే ప్రయ త్నంలో పడిపోయాయి, కొమ్మలోని ఆకు లు, చిగురాకులు. పచ్చని మామిడిపండు కనువిందు చెయ్యడానికి నాంది పడింది.

'ఈ సాలుకి మంచి పూత, కాయ వచ్చే ట్టుంది. అప్పు కొంచెం తీరితే అబ్బాయికి కాస్త వెసులుబాటవుతుంది. అమ్మోరికి కో డ్ని బలిస్తా. సుడిగాలి, అకాలవానలు రాకుండేట్టు చెయ్యి తల్లే' అనుకున్నాడు అప్పుడే తోటలోకి వచ్చిన మాలి, తోటని తృప్తిగా చూస్తూ. గున్నమామిడి చుట్టూ తవ్వి, తోటలోనే ఒక మూలనున్న కంపోస్ట్ ఎరువు తవ్వి తెచ్చి వేశాడు.

ఆ తోటకి ఆ మాలే యజమాని కూడా. తాతలనాటి నాలుగెకరాల చెక్కలో మామిడి చెట్లు నాటి, ఆశగా ఎదురుచూ స్తున్న చిన్నకారు రైతు బాలయ్య. బీడు పడిపోయిన భూమిలో బోర్లు వేయించి, డ్రిప్ ఇరిగేషన్ ఎలా చేయాలో నేర్పించి, బ్యాంకులోంచి తక్కువ వడ్డీ వచ్చేట్లు చేశాడు, చేతికందొచ్చిన బాలయ్య కొడుకు.

'మంచి రోజులొచ్చినట్టున్నయ్యి..' కళ్ళు చెమ్మగిల్లగా అనుకున్నాడు బాలయ్య.

మామిడిపండు తయారు చెయ్యడానికి గున్నమామిడి ఆకులన్నీ, శక్తికొలదీ సాగ దీసి చూస్తూ, ఇంకా కాలుష్యం కమ్ముకోని సూర్యకాంతిలో ఆహారం తయారుచేసుకోవ డంలో నిమగ్నమై, బాలయ్య స్వగతాన్ని వినిపించుకోలేదు.

జంటనగరాల శివార్లలో ఉన్న చిన్న గ్రామం అది. పేరు కొత్తపల్లి. అందులో బాలయ్య కుటుంబం మూడు తరాల నించీ నివసిస్తున్నారు. చుట్టుపక్కల సంప న్నుల వసతి గృహాలూ, మామిడి తోటలూ ఉన్నాయి. బాలయ్య స్వంతబిడ్డలా చూసు కుంటూ ఉండడం, రోజూ ప్రతీ చెట్టునీ పలుకరిస్తూ ఉండడం వలన అతని తోట కళకళ్ళాడుతూ ఉంది. ప్రతి చెట్టుకీ పేరు కూడా పెట్టుకున్నాడతను. మన గున్నమా మడి చెట్టు పేరు మాలచ్మి.

మొక్కలకి కూడా స్పర్శజ్ఞానం ఉంటుం దనీ, పలకరిస్తే అవి పులకిస్తాయనీ, బోస్ మహాశయుడు ఎప్పుడో చెప్పాడు కదా!

★ ★ ★

శ్రీనాథ్ మనసంతా చికాగ్గా ఉంది. తలంతా దిమ్ముగా.. ఏ పనీ చెయ్యబుద్ధి అవట్లేదు. ఆఫీసులో పని అంతులేకుండా ఉంది. సరిగ్గా రెండువారాల్లో ఇచ్చిన ప్రాజెక్ట్ పూర్తి చెయ్యాలని బాస్ ఆదేశం. ఇంట్లో పరిస్థితి చూస్తే..

"శ్రీ.. మనం ఇంక ఎందుకూ పనికి రామా? అమ్మానాన్నలు చెప్పిన మాట వినకపోతే ఇలాగే ఉంటుందా? నాకేం తోచట్లేదు. ఏం చెయ్యమంటావో చెప్పు శ్రీ!" ఆఫీసుకి వస్తుండగా బేలగా అడుగు తున్న సునీత మొహం కనిపించి మరింత ఆందోళనకి గురయ్యాడు శ్రీనాథ్.

"శ్రీనాథ్! నా రూమ్‌కి ఒక్కసారి రా! అర్జెంట్" ఇంటర్‌కమ్‌లో టీమ్ మేనేజర్ పిలుపు. ఒంట్లో, మనసులో, ఇంట్లో.. బాగున్నా బాగోకపోయినా తప్పదు. ఆలోచనలోంచి బైటపడి లేచి పరుగెత్తాడు.

తలుపు తీసుకుని లోపలికి వెళ్తూనే వికాస్ మొహం చూసి కుంగిపోయాడు శ్రీనాథ్. 'లేచినవేళ బాగాలేదు అనుకున్నాడు' అలాంటి నమ్మకాలే లేని శ్రీనాథ్.

"ఏమయింది వికాస్? ఎందుకలా.."

"ఈ ప్రాజెక్ట్ అనుకున్న టైమ్‌లో పూర్తి చెయ్యకపోతే కంపెనీ మూసెయ్యాల్సి వస్తుందని బాస్ అరిచాడు. నువ్వు కూడా స్లోడౌన్ అయ్యావు శ్రీ! ఇలా అయితే మనం మళ్లీ రెజ్యూమేలు తయారు చేసుకోవడం మంచిది" టీమ్ మేనేజర్ వికాస్ దిగులుగా అన్నాడు.

శ్రీనాథ్ వాళ్ళ గ్రూపులో మొత్తం ఐదుగురుంటారు. అటువంటి గ్రూపులు పది ఉన్నాయి వాళ్ళ బిగ్‌బాస్‌కి. ఒక గ్రూప్ మూసేస్తే అతనికేం పెద్దనష్టం ఉండదు.. పని చేసేవాళ్ళకే నష్టం.

అందరూ చాకుల్లాంటి కుర్రాళ్ళు. ఒక్కొక్కళ్ళని ఒక్కొక్క ప్రాజెక్ట్‌కి టీమ్ మేనేజర్ చేస్తుంటాడు వాళ్ళ బిగ్‌బాస్.. అతనే ఆ సాఫ్ట్‌వేర్ కంపెనీ యజమాని అనంత్. ఇంచుమించు అందరూ యజమానితో సహా ఒకటి రెండేళ్ళు తేడాగా ఒకే ఈడువాళ్ళు. అందుకే ఒకరు బాస్.. ఇంకొకరు వారికింద పనిచేసేవారు అనే అభిప్రాయం కలుగదెప్పుడూ.. ఎవరికీ!

కానీ ఉనికికే ప్రమాదమొస్తే? అసలే ఏం లొసుగులు కనిపెడదామా? ప్రాజెక్టుల్ని గద్దల్లా తన్నుకు పోదామా? అని కాచుక్కూర్చున్న కొత్తకంపెనీలు కోకొల్లలు.

"శ్రీ.. ఇంటి సమస్యల్ని ఆఫీస్‌కీ, ఆఫీసువి ఇంటికీ తీసుకెళ్ళకూడదని అనుకున్నాం కదా! మరి నువ్వు ఒక నెలరోజుల్నుంచీ.." సగంలోనే ఆపేశాడు వికాస్.

"సారీ విక్కీ! ఈ క్షణం నుంచీ చూడు" ఇంకొక్కమాట మాట్లాడితే మరోక్షణం వేస్ట్ అవుతుందన్నట్లు మూడే అంగల్లో తన క్యూబికల్‌కి వచ్చి కంప్యూటర్ లాగిన్ అయి, సింగపూర్ ఆఫీసు నంబరు నొక్కాడు శ్రీనాథ్ సెల్‌ఫోన్‌లో..

★ ★ ★

"ఇలా అయితే అస్సలు లాభం లేదు నాండీ! బైసెప్స్, ట్రైసెప్స్ పెరగాలంటే ఇంకా తినాలి. వెయిట్స్ కూడా పెంచాలి. ఇంకా ఇరవై కిలోల్లోనే ఉన్నావా? కనీసం ముప్పై.. ఒక్కొక్క చేత్తో, రెండూ కలిపి కాదు. షేమ్, షేమ్. కాళ్ళ మాటేమిటి.. లెగ్ పుషప్స్ ఎన్ని చేస్తున్నావు? టమ్మీ చూడు.. ఇంకా ఎంత లోపలికుందో! రిబ్స్ కనిపిస్తున్నాయి.. ఈ లెక్కని ఇంకో పదేళ్ళయినా నీకు నాలుగు ప్యాక్‌లు కూడా రావు" జిమ్‌లో కోచ్ క్లాసు పీకుతుంటే తల దించుకున్నాడు నాండీ.

నాండీ పూర్తి పేరు నందగోపాల్. ఈ స్పీడు యుగంలో అంత పెద్దపేరు పిలవడానికి ఎవరికీ తీరికా, ఓపికా ఉండవు కదా! అలా కత్తిరించేశారు.. ఎవరో కాదు.. కన్నవారే, పేరు పెట్టిన కొద్దినిముషాల్లోనే! సాంప్రదాయం ప్రకారం తాతగారి పేరు పెట్టాలి.. తప్పదు. లేకపోతే తాతకైతే ఫరవాలేదు.. తండ్రి క్కూడా కోపం వస్తుంది. వచ్చిందంటే.. బోలెడు ఆస్తి..

"నాండీ ఏమిట్రా? 'నంది' అని పిలవండి ఇంకా బాగుంటుంది. నిక్షేపంలాంటి పేరు, వేషాలు కాకపోతే.." అరగంట సాగిన తాతగారి సణుగుడు ఎద్దుమీద వాన కురిసినట్టే అయింది.

నాండీకీ టెన్షన్ పెరిగిపోతోంది, ఇంట్లో అమ్మానాన్నల్ని తలుచుకుంటే. పద్నాలుగేళ్ళ నాండీకి ఒళ్ళంతా వేడిసెగలు వస్తున్నట్లుగా ఉంది. ఆ వయసు పిల్లలకి

మామూలుగా ఉండే పరీక్షల ప్రెషర్ కాదు. నాండీ తల్లిదండ్రులకి ఆ బాధ లేదు. బోలెడు ఆస్తి కోట్లలో వ్యాపారాలు. సగం ప్రభుత్వ యంత్రాంగం వీరి చేతుల్లోనే ఉందని కిట్టనివాళ్ళు అంటుంటారు. ఎంత డబ్బయినా పెట్టి చదువుని కొనగలరు. చదువుకోనక్కర్లేదు. నాండీ వాళ్ళ మమ్మీకి వాడు పెద్ద సినిమా హీరో అవ్వాలని ఆశ.. జీవితాశయం. అసలు ఆవిడకే హీరోయిన్ అవాలని ఉండేది.. తమ కుటుంబాల్లో ఉండే ఆచారాలూ, సాంప్రదాయాలూ అడ్డువచ్చాయి. లేకపోతే ఆవిడ అప్పట్లో జయప్రదకి దీటుగా ఉండేదని అందరూ అనేవారు.. ఇప్పుడైతే టీవీ సీరియల్స్‌లో పారిశ్రామికవేత్త అయిన అత్తగారిలా తయారయింది కానీ!

కాకపోతే ఒక్కటే చిక్కు వచ్చింది. అన్నీ ఇచ్చిన భగవంతుడు పక్షపాతం చూపించాడు. ఆజానుబాహువుల కుటుంబంలో.. నాండీ, బలంగా పెరుగుతున్న తోటలోని చెట్లలో ఎండ సోకని మొక్కలా పుట్టాడు. తాత రావుగోపాల్రావులా, తండ్రి యస్వీరంగారావులా ఉంటారు. వాళ్ళ మమ్మా మాటల్లో వీడికి మాత్రం పాతసినిమాల్లో రమణారెడ్డి పర్సనాలిటీ వచ్చిందని ఆవిడ విచారించని క్షణం లేదు.

అసలు నాండీని బాలనటుడిగా వేయిద్దామని, పదమూడేళ్ళు వచ్చేవరకూ మమ్మా ఎంతో పయత్నం చేసింది. అదీ హీరో చిన్నప్పటి పాత్ర. ఎంతో డబ్బు పెట్టుబడి పెడ్తామన్నా.. నిర్మాత కొంచెం మెత్తబడ్డా.. దర్శకుడు మొండిఘటం. ససేమిరా ఒప్పుకోలేదు. అందులో చిరంజీవి చిన్నప్పటి రోలు. అతని వెడల్పు మొహం, విశాల నేత్రాలూ, హి మేన్ బాడీ... కొంతైనా కనిపించాలి కదా! మరీ కోట్లకి బేరం పెంచేద్దామంటే, రాజకీయాల్లోకి ప్రవేశిద్దామనుకుంటున్న నాండీపప్పా ఒప్పుకోలేదు.

"బాలనటుడిగా వేసిన చాలామంది నిలదొక్కుకోలేదు. ఇరవయ్యేళ్ళు రానీ.. ఈలోగా బాగా కండ పెంచేట్లు చెయ్యి. కావల్సిన డాన్సులూ, ఫైట్లూ నేర్పించు. అప్పుడు మనమే సినిమా తీసేద్దాం" పప్పా చిరునవ్వుతో చెప్తుంటే నాండీ అమ్మయ్యా అనుకున్నాడు. వాడి బాధ వాడిది.. మమ్మా సినిమా సీడీలు చూపించి సీమ సినిమాల్లో బాలవిలన్‌లాగ నవ్వమంటుంది.. నవ్వి నవ్వీ, నవ్వలేక నాండీ నోరు, కడుపు నొప్పెడుతున్నాయి.

"మీకు ఎప్పుడూ నేను ఏది చెప్తే అది నో అనడమే తెలుసు.. అసలు మనమే ఒక బాలల పిక్చర్ తియ్యొచ్చు వెరైటీగా. అందులో మన బుజ్జా నాండీ ముద్దు మొహంతో, కళ్ళని తిప్పుతూ యాక్ట్ చేస్తుంటే.." పరవశంగా అంటున్న మమ్మా కేసి భయంగా చూశాడు నాండీ.

"బాలల చిత్రోత్సవంలో తప్ప ఇంకెక్కడా ఆడదు. ఒక పతకం, ప్రశంసాపత్రం వస్తాయి. మనం ఏపని చేసినా మన వంశానికి పేరు తెచ్చేట్లుండాలి రాణీ! నా మాట విను. ఇకేం మాట్లాడకు. మన చిన్ని నాండీకి ఇప్పట్నుంచీ నీ ఆశయం నెరవేరేట్లు ట్రైనింగ్ ఇప్పించు. మరీ అంత డల్‌గా చూడకోయ్!" రాణీగారి బుగ్గమీద చిటికేసి వెళ్ళిపోయారు రాజావారు.

రాజావారి ముత్తాతగారు ఆంధ్రదేశంలో ఉన్న అనేక ఊళ్ళలో ఒక ఊరికి జమీందారు. అందుకని ఇంటి యజమాన్ని రాజా అనీ, ఇల్లాలిని రాణీ అనీ పిలవడం వారి వంశాచారం.

మమ్మా, పప్పాల(అలా పిలవమని మమ్మా ఆదేశం.. ఐరోపా దేశాల్లో అల్లాగే అంటార్ట) వాగ్వివాదం వింటూ అలాగే నిద్రలోకి జారుకున్నాడు పద్నాలుగేళ్ళ నాండీ. టెంత్ క్లాస్ పరీక్షలకి చదువుకో

వాలి. వ్యాయామాల్లో అలసిపోయిన శరీరం కొంచెం కూడా కదలనంటోంది.

ఏమాట కామాటే.. నాండీకి చదువంటే చాలా ఇష్టం. అబ్దుల్ కలామ్‌లా పెద్ద సైంటిస్ట్ అయిపోవాలని ఆశ.. ప్చ్.. చదువుకోడానికి పెట్టి పుట్టాలి..

అప్పట్నుంచీ, ఇప్పుడు జిమ్‌లో కోచ్ చేత చీవాట్లు తినే సమయం వరకూ నాండీకి జీవితం అసిధారావ్రతమే అయింది. పదమూడేళ్ళు వచ్చేసరికి డాన్స్ చెయ్యడం బాగా వచ్చేసింది. త్రైక్వాండూ కూడా ఫరవాలేదు... యాక్టింగ్ వరకూ ఒకే. మరీ నిజం ఫైట్స్ చెయ్యమంటే భయంవేసి బాత్రూంకి పరుగెట్టాలి కానీ!

"ఏం చెయ్యమంటారు సార్! డయటీషియన్ చెప్పినవన్నీ తింటూనే ఉన్నాను. కాకపోతే అంతంత తినలేకపోతున్నా. నాలుగు ఎగ్స్ ఆమ్లెట్ అంటే కష్టం కానీ, రెండు గుడ్లు తిన గలుగుతున్నా. జగ్గుడు బాదంపాలు తాగాలంటే కక్కొచ్చినంత పనవుతోంది. ఒకేసారి కాకుండా రోజు మొత్తంమీద తాగగలుగుతున్నా. ఇంక మంచినీళ్ళ బదులు బత్తాయి రసం.. చికెన్ తింటే కండలు రావంటే, నాకెంత ఇష్టమైనా మానేశాను. రోజూ బాగా బలిసిన గొర్రె మాంసమే! అంతకంటే ఏం చెయ్యాలి చెప్పండి? "

"నిజంగానా! నీ బాధ నా కర్థమవుతోంది నాండీ! నీ శరీరతత్వం అంతేననుకుంటా. కొంతమందికి తిన్న తిండంతా శక్తికింద బయటకి పోతుంది, శరీరంలో కణవిభజన జరక్కుండా. దానికి ఎంజైమ్స్ కారణం అవుతాయి. నేను మీ డయటీషియన్‌తో మాట్లాడుతా. మీ అమ్మగారు అంత శ్రద్ధ చూపిస్తున్నప్పుడు, మేము రిజల్ట్ చూపించాలి కదా? ముందు రేపు కనీసం ఒకకిలో అయినా బరువు పెంచి, పుష్అప్స్ చెయ్యి. రేపట్నుంచీ నేను రోజూ

పూర్తిగా నీ దగ్గిరే ఉంటా" గలగలా అనేసి కోచ్ గబగబా వెళ్ళిపోయాడు. అతనికి ప్రతీ నిముషం వేల విలువయింది.

నాండీ గుండె గుభేలుమంది. ఇంకో కిలోనా.. పైగా రోజూ ఇప్పటికే పడుకున్న గంటవరకూ చేతులు లాగేస్తున్నాయి.. కాళ్ళు సలిపేస్తున్నాయి.

"నాండీ కన్నా, నాండీ కన్నా.." జేబులో సెల్‌లోంచి మమ్మా పిలుస్తోంది.

"హాయ్ మమ్మా!"

"త్వరగా రా రాజా. డాన్స్ మాస్టర్ వచ్చాడు. తర్వాత మ్యాసేజర్ వస్తాడు" కాళ్లీడ్చుకుంటూ కోటలాంటి ఇంట్లో ఉన్న జిమ్‌లోంచి బయటికి వచ్చి, తన గది వైపుగా నడిచాడు నందగోపాల్..రాబోయే కాలంలో కాబోయే హీరో.

★ ★ ★

అనుకున్న సమయంకంటే ముందే, పది రోజుల్లో ప్రాజెక్ట్ ముగించి, కంప్యూటర్ ముందు నుంచి లేచి ఒళ్ళు విరుచుకున్నాడు శ్రీనాథ్. కాళ్ళు తిమ్మిరెక్కి మొద్దుబారినట్లు అయిపోయాయి. కళ్ళు కారం పెట్టినట్లు భగభగా మండుతున్నాయి. మెడ పట్టేసింది. భుజాలు పైకీ కిందికీ కదిపి, మెడ గుండ్రంగా పదిసార్లు తిప్పాడు శ్రీనాథ్. చేతులు అడ్డంగా చాపుతూ ముడుస్తూ పదిహేనుసార్లు చేశాడు. కుర్చీలో కూర్చుని కాళ్లు జాడించాడు. అప్పుడు శరీరం కొంచెం స్వాధీనంలోకి వచ్చినట్లు అనిపించింది.

చేసిన పనంతా చిటికినవేలంతున్న పెన్‌డ్రైవ్‌లోకి పంపించి, దాన్ని జేబులోకి తోశాడు. ఇంకా సరిపోదని హార్డ్ డ్రైవ్‌లోకి కూడా కాపీ చేశాడు. హుషారుగా కాఫీమెషీన్ దగ్గరికి నడిచి వేడివేడి కాఫీ కాగితం కప్పులోకి వంపుకుని వికాస్ గది లోకి నడిచాడు.

"కంగ్రాట్స్ శ్రీ! మొత్తానికి సాధించావు" కుర్చీలోంచి లేచి రెండు చేతుల్తో శ్రీనాథ్ చేతుల్ని తట్టాడు వికాస్.

"ఇదిగో వికాస్, మన ప్రాజెక్ట్. నాకు నాలుగువారాలు సెలవు కావాలి. సునీత ఎలా ఉందో, ఏం చేస్తోందో.. ఈ పదిరోజులూ ఇంట్లో రోజుకి నాలుగైదు గంటల కంటే ఎక్కువ లేను" పెన్‌డ్రైవ్ చేతికి ఇస్తూ అన్న శ్రీనాథ్ మాటలకి వికాస్ కళ్ళలోంచి నీళ్ళు చిప్పిల్లాయి. స్నేహితుడి సమస్య కొంతవరకూ తెలుసు అతనికి. తను ఇంకొక ప్రాజెక్ట్ కూడా సూపర్వైజ్ చెయ్యల్సి వచ్చింది. లేకపోతే శ్రీనాథ్‌ని ఇదివరకే సెలవులో పంపించేవాడు.

"తప్పకుండా.. ష్యూర్. రేపట్నుంచే నీకు వెకేషన్. ఆరు వారాలు. నువ్వూ సునీతా ఎక్కడికైనా వెళ్ళండి. హాయిగా అన్నీ మర్చిపోయి గడపండి. ఆల్ ద బెస్ట్" బిగ్ బాస్‌తో అంతకు ముందే మాట్లాడి పెట్టాడు కనుక మాట ఇచ్చేశాడు వికాస్.

"థౌజండ్ థాంక్స్ దూడ్!" గాల్లో ఎగురుతున్నట్లుగా వెళ్ళాడు శ్రీనాథ్. తన బ్యాంక్ అకౌంట్ చెక్ చేసుకుందామని కార్లో కూర్చొని లాప్‌టాప్ తీసి చూసిన శ్రీనాథ్ కళ్ళు వెడల్పయ్యాయి. రెండునెల్ల జీతం బోనస్.. లక్ష రూపాయల పైనే. ట్రావెల్ ఏజెంట్‌కి ఫోన్‌చేసి, కేరళకి ఫ్లైట్ టికెట్లు, అక్కడ వసతి ఉందేమో కనుక్కోమని చెప్పి, 'ఎంత హాయి ఈ రేయి' పాట కూనిరాగం తీస్తూ కిటికీలోంచి బైటకి చూడసాగాడు. శ్రీనాథ్ పని చేసే కంపెనీ రాకపోకలకి కారు సదుపాయం చేసింది.

"నీతా డియర్!" కాలింగ్ బెల్ మోగిస్తూ ఆగలేనట్లు పిలిచాడు శ్రీనాథ్.

"కమాన్.. మంచి న్యూస్ చెప్తాను త్వరగా తలుపు తియ్యి" మూసి ఉన్న తలుపులోంచి సరిగ్గా వినిపించదని తెలిసి కూడా అరిచాడు. రెండు నిముషాల

తర్వాత నెమ్మదిగా తలుపు తెరుచుకుంది.

తలుపు తీసిన వెంటనే వెనుతిరిగి లోప లికి వెళ్ళిపోయింది సునీత. రోజూ తన మొహమైనా చూడకుండా లోపలికి వెళ్ళి పోయే జీవన సహచరుడ్ని మాట్లాడించి ఇబ్బంది పెట్టడమెందుకని అనుకుందేమో!

"నీతా! అలా వెళ్ళిపోతావేంటి? ఇటు చూడు" హుషారుగా పిలిచాడు.

"ఏమిటి శ్రీ! కాఫీ కావాలా.." యాంత్రి కంగా, నిర్లిప్తంగా అడిగిన భార్యని చూసి హృదయం కదిలిపోయింది శ్రీనాథ్‌కి.

"కాఫీ వద్దురా! నువ్వే కావాలి. ఈ పది రోజులూ నిన్ను పట్టించుకోలేదని నా మీద కోపంగా ఉందికదూ! ఏం చెయ్యను చెప్పు. నీకు తెలియనిది కాదు కదా! ఈ పదిరో జులూ ప్రసవవేదన పడుతున్నంత బాధ అనుభవించాననుకో. ఇప్పుడు ప్రసవం అయిపోయి పండంటి పాపాయిని చూస్తు న్నంత ఆనందంగా ఉంది"

"ప్రసవాలూ, వేదనలూ నాకెలా తెలు స్తాయి శ్రీ!" వెక్కి వెక్కి ఏడుస్తూ అతని వక్షం మీదికి వాలిపోయింది సునీత.

ఒక్కసారి షాక్ తిన్నట్లు అదిరిపడ్డాడు శ్రీనాథ్. ఇప్పుడు తనేం అన్నాడనీ... జస్ట్ జోక్ చేశాడంతే.. పిల్లలు పుట్టరనుకోడా నికి తమకేమైనా వయసు మీరిపోయిందా!

భార్య వీపు నిమురుతూ సోఫా దగ్గరికి నడిపించి తీసుకెళ్ళి, కూర్చోపెట్టాడు. చల్లటి నీళ్ళు తీసుకొచ్చి, పల్చటి తువ్వాలు తడిపి నెమ్మదిగా, అపురూపంగా సునీత మొహం తుడిచాడు. మొహం పైకెత్తి పట్టుకుని నుదుటిమీద, కళ్ళమీద చుంబించాడు.

కొద్దిగా వెనక్కి జరిగి, పెన్నిధిని చూస్తు న్నట్లుగా చూస్తూ, సునీతని ఆపాదమ స్తకం పరికించాడు. గుండె కదలి చేతిలోకి వచ్చినట్లు అనిపించింది.

మొహం అంతా మొటిమలతో నిండిపో యింది. కళ్ళకింద నల్లటి చారలు.. కాదు కాదు.. మూడు వేళ్ళ వెడల్పున నలుపు రంగు కాటుక పులిమినట్లుంది. మెడ పొడుగ్గా సాగిపోయి, లెక్కపెట్ట కలిగే ట్లుగా నరాలు ఉబ్బి బైటికి వచ్చాయి.

చేతులు పుల్లల్లా వేళ్ళాడుతున్నాయి. నడుం పిడికిలిలో పట్టేట్లు ఉంది. నిండు యవ్వనంలో నిగనిగ లాడుతూ ఉండవల సిన సునీత ఎండిపోయిన తోటకూర కాడలా తయారయింది.

ఎంతో ఆరోగ్యంగా, ప్రపంచం అంతా తనదేనన్నట్లుగా.. తను ఎక్కడుంటే అక్కడ సుమధుర వాక్ప్రవాహాన్ని ప్రవ హింపచేసే సునీత ఇలా ఎందుకయిపో యింది. ఇందులో తన అపరాధమెంత?

శ్రీనాథ్ పశ్చాత్తాపంతో తల దించుకు న్నాడు. కళ్లలోంచి చుక్కలు చుక్కలుగా నీళ్ళు.. అప్పుడు చూసింది సునీత.

"అయ్యో శ్రీ! అనవసరంగా బాధ పెట్టాను. సారీ! ఉండు.. మంచి కాఫీ తెస్తా. తాగుతూ మనకిష్టమైన వరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుందాం. నేను నవ్వుతున్నా చూడు. తలెత్తు.. ప్లీజ్.."

శ్రీనాథ్ తలెత్తి సునీతని చూశాడు. పెదవులు వణుకుతుండగా ఏదో అనబో యాడు. చూపుడువేలితో ఆపింది.

"ష్ మాటలు తరవాత. ముందు కాఫీ" నీళ్ళు నిండిన కళ్ళతో రోషం వచ్చిన పసి పిల్లలా నవ్వుతూ వంటింట్లోంకి నడిచింది.

శ్రీనాథ్, వెనుకే వెళ్ళి వెనుకనుంచి నడుం చుట్టూ చెయ్యివేసి, సునీత తల మీద గడ్డం ఆనించి కళ్ళు మూసుకు న్నాడు. ఉసిరి, కుంకుడుకాయ, మంచి గంధం కలిసిన వాసన. స్వచ్ఛమైన ప్రకృ తిలో వచ్చే వాసన. శ్రీనాథ్‌కి ఎంతో ఇష్ట మైన వాసన. సునీత షాంపూలు వాడదు.

అలా ఉండిపోయారు ఇద్దరూ. ఇప్పుడు కాలగమనం ఆగిపోతే ఎంత బాగుండును. ఇద్దరికీ అనిపించింది.

"జయకృష్ణా ముకుందా మురారీ.." శ్రీనాథ్ జేబులోని సెల్ పాడింది. సునీ తని వదిలి, ఫోన్ తీసి స్పీకర్ నొక్కి 'హలో' అన్నాడు.

"హాపీ యానివెర్సరీ శ్రీ! సునీతా, నువ్వూ మా ఇంటికొచ్చేయండి. మీకేం ప్లాన్ లేకపోతే" వికాస్ ఉత్సాహంగా శుభా కాంక్షలు చెప్పాడు. విన్న సునీత మౌనంగా తలూపింది.

"ఒకే విక్కీ. ఏడింటికి అక్కడుంటాం."

అపరాధం చేసినవాడిలా సునీతని దగ్గ రికి తీసుకుని కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు శ్రీనాథ్, "అస్సలు గుర్తు లేదురా.. సారీ! ఏం చేసి నా తప్పు.."

"నీకే కాదు. నాక్కూడా గుర్తులేదు శ్రీ! ఇంతాచేసి ఐదేళ్ళయింది మన పెళ్ళయి. ఎలా మర్చిపోయాం? ఇంత యాంత్రి కంగా ఎలా బ్రతుకుతున్నాం.. ఎందుకిలా అయింది.. ఏమిటి కారణం?"

తెలియాలంటే ఎనిమిదేళ్ళు వెనక్కి వెళ్ళాలి.




శ్రీనాథ్, సునీతలు ఒకేసారి అనంత్ సాఫ్ట్‌వేర్ కంపెనీలో చేరారు. ఇద్దరివీ వేర్వేరు కుటుంబ పరిస్థితులు. సునీతది ఎగువ మధ్య తరగతి కుటుంబం. అక్క, తను- ఇద్దరే సంతానం. తండ్రి బ్యాంకు మేనేజరు. తల్లి అప్పట్లో డిగ్రీ పాసయినా ఉద్యోగం చెయ్యకుండా ఇంటినీ, పిల్లల్నీ చూసుకుంటూ.. సంసారం నడపడంలో భర్తకి చేయూతనిచ్చింది. ఇప్పటి భాషలో చెప్పాలంటే పర్ఫెక్ట్ హోమ్ మేకర్.

సునీత అడిగిందల్లా ఇవ్వకపోయినా ఏ లోటూ లేకుండా పెంచారు. ఎంసీఏలో ఫస్ట్ క్లాస్.. క్యాంపస్ ఇంటర్వ్యూలో సెలెక్ట్ అయింది. ఉద్యోగంలో చేరేనాటికి ఇరవ ఒక్కేళ్ళు. కౌమారం వీడని అమాయక త్వంతో, అప్పుడే లోకాన్ని తెలుసుకుం టున్న ఉత్సాహంతో.. నవ్వుతూ, తుళ్ళుతూ ఉండేది. ఏదో సాధించాలని కాక అంది నది ఆస్వాదిద్దామనే మనస్తత్వం.

ఇంట్లో పబ్బులకీ, లేట్ నైట్ పార్టీలకీ అనుమతించకపోయినా హద్దులు దాటని స్వేచ్ఛ ఇచ్చే వాతావరణం.. స్నేహితులతో సినిమాలూ, చిన్న చిన్న పిక్నిక్‌లూ వద్ద నని పెద్దలు.. ఆడ అయినా మగ అయినా ఫ్రెండ్స్‌ని ఇంట్లో వాళ్ళకి పరి చయం చేసి, చెప్పి వెళ్ళాలన్న నిబంధన ఎవరూ చెప్పకుండానే అమలవుతుంది.

సునీత అక్క సుజాత డాక్టరు. సునీత కన్నా నాలుగేళ్ళు పెద్దది. గాంధీ హాస్పిట ల్‌లో ఎండీ చేస్తోంది. ఆడుతూ, పాడుతూ గడిచిన బాల్యం.. చీకు చింతా లేని జీవితం సునీతది. అదంతా ఆమె లావణ్యంలో, స్వచ్ఛమైన నవ్వులో ప్రతిబిం బిస్తూ ఉండేది.

శ్రీనాథ్ పూర్తిగా వ్యతిరేక వాతావర ణంలో నుంచి వచ్చాడు.

కాయకష్టం చేసిన శరీరం గట్టిగా, దృఢంగా ఉంటుంది. స్వభావసిద్ధంగా కాక పోయినా ఎండలో తిరిగి నలుపువన్నెకి దిగిన శరీరఛాయ. ఏ జిమ్‌కి వెళ్లకపో యినా, కండలు తిరిగిన శరీర సౌష్ఠవంతో తీరైన కనుముక్కు తీరుతో.. చెదరని చిరు నవ్వుతో అందర్నీ ఆకర్షిస్తాడు.

బిటెక్ కంప్యూటర్స్ చేసి, పేరుపొందిన

మల్టీ నేషనల్ కంపెనీలో ఐదేళ్ళు పని చేసి.. ఇంక ఎదగడానికి అవకాశం లేక, మానేసి అప్పుడప్పుడే పైకి వస్తున్న అనంత్ ఫర్మ్‌లో చేరాడు శ్రీనాథ్. అతని గ్రూపులోనే వేశారు సునీతని, జూనియర్ ఎగ్జిక్యూటివ్‌గా.

శ్రీ అనీ, నీతా అనీ పిలిచుకునే చనువు వచ్చేసరికి రెండేళ్ళు పట్టింది.

విడిగా వెళ్ళకపోయినా, గ్రూపులో అందరూ కలిసి విహారాలకి వెళ్ళినప్పుడు ఎక్కువగా తామిద్దరూ ఒక దగ్గిర చేరడం తెలియకుండానే జరిగిపోతుండేది.

శ్రీ స్థిరమైన మనస్థత్వం సునీతని ప్రభావితం చేస్తే.. సునీతలోని పసితనపు అమాయకత్వం, ఎప్పుడూ ఆనందంగా ఉండే స్వభావం శ్రీని ఆకర్షించింది.

సుజాత ఎండీ అవుతూనే, కొలీగ్‌ని పెళ్ళి చేసుకుంది, కన్నవారి అనుమతితోనే.

ఒకరోజు.. సునీతే బైటపడింది.

"శ్రీ! మనం ఎప్పటికీ కలిసి ఉండలేమా? " ముందర అడగవలసింది మగవాడే అనే కోడ్ కూడా తెలియని ముగ్ధ.

శ్రీనాథ్‌కి గుండె ఆగినట్లయిపోయింది. తన బ్యాక్‌గ్రౌండ్ తెలిసే అడుగుతోందా! అతను అడగలేకపోవటానికి అదే కారణం. తమ కుటుంబంతో కలిసిపోగలదా?

"నీతూ! మీ ఇంట్లో ఒప్పుకుంటారా? అందుకే ధైర్యం చెయ్యలేకపోయాను. నువ్వులేందే బతకలేను అంటూ డైలాగులు చెప్పలేను కానీ.. నీతో జీవితం సంతోషంగా గడపగలనని చెప్పగలను. దేన్నికైనా పాజిటివ్, నెగిటివ్ రెండు ఆన్సర్లూ ఉంటాయని తెలిసిన వాళ్లంకదా! ఒకవేళ కుదరకపోతే..."

"కుదరకపోతే... ఏమవుతుంది శ్రీ! ఇద్దరం మంచి స్నేహితుల్లా ఉంటాం. కానీ మన ప్రయత్నం చెయ్యాలికదా! మనిద్దరికీ ఒకరిమీద ఒకరికి మంచి అభిప్రాయం ఉంది. ఇష్టం ఉంది. అదే ప్రేమ ఏమో నాకు తెలియదు. ఎవరు రెండురోజులు చెప్పకుండా ఆఫీసుకి రాకపోయినా ఏమయిందో అని గిలగిల్లాడుతాం.." సునీత సిగ్గుతో ఆపేసింది, శ్రీనాథ్ మొహంలో నవ్వు చూసి. ఇద్దరికీ ఒకేసారి గుర్తుకొచ్చింది...

ఏడాది క్రితం శ్రీనాథ్ పుట్టినరోజున..

"శ్రీ!" అని పిలుస్తూ అతని బల్ల దగ్గరికి వచ్చింది సునీత ఓ బొకేతో. అదీ తను స్వయంగా చేసింది. వాళ్ళది చుట్టూ స్థలం ఉన్న చిన్నఇల్లు. అందులో రంగు రంగుల పూలచెట్లు ఇంటికొచ్చిన వాళ్ళకి స్వాగతం పలుకుతూ ఉంటాయి.

ఇంట్లో వాళ్లందరికీ, ముఖ్యంగా సునీతా వాళ్ళమ్మకి తోటమీద అమితమైన శ్రద్ధ. పిల్లలకి జ్వరం వస్తే కంగారు పడదు కానీ, ఏ మొక్కయినా వాడిపోతే ఆ మొక్క దగ్గిరే ఉంటుందావిడ. చీడ పడితే తప్ప సాధారణంగా అటువంటి స్థితి రాదు.

సరదాగా సెలవుల్లో ఫ్లవర్ అరేంజ్‌మెంట్ క్లాసులకి వెళ్ళి, అందంగా పూలని అలంకరించడం నేర్చుకుంది సునీత.

ఆ నైపుణ్యం అంతా ఉపయోగించి చక్కని బొకే చేసి తీసుకొచ్చి శ్రీని సర్ప్రైజ్ చేద్దామనుకుంది. చిల్లు పడిన బుడగలా వేళ్ళాడిపోయింది శ్రీనాథ్ కుర్చీ ఖాళీగా ఉండడం చూసి.

"విక్కీ! ఏమయింది.. శ్రీ రాలేదేం? " ఆదుర్దాగా వికాస్ దగ్గరికి వెళ్ళింది.

"వాళ్ల పేరెంట్స్‌ని చూట్టానికి వెళ్ళాడు. రేపు వస్తాడు" కంప్యూటర్ స్క్రీన్ మీంచి తల తిప్పకుండా అన్నాడతను.

"అదేంటి, ఈ రోజు అతని బర్త్‌డే కదా! చెప్పకుండా వెళ్లాడేంటి? " కంఠం పూడుకుపోయి మాట పూర్తి చెయ్యలేకపోయింది.

"అందుకే వెళ్ళాడు, నాకు చెప్పి.." వింతగా చూస్తూ వెనుతిరిగాడు వికాస్.

అదే తొలిసారి, శ్రీ అంటే తనకి ప్రత్యేక అభిమానం ఉందని సునీత బైటపడటం.

"అబ్బే! బొకే తెచ్చా, విష్ చేద్దామని" అంటూ పారిపోయింది అక్కడ్నుంచి.

మర్నాడు వాడినపూలు దీనంగా చూస్తుండగా సునీత నిష్ఠూరాల్ని చిరునవ్వుతో భరించాడు శ్రీనాథ్.

"శ్రీ! ఇక్కడున్నారా మీరు.. బిగ్‌బాస్ పిలుస్తున్నాడు.. మీ ఇద్దర్నీ!" కాంటీన్‌లో చల్లారిపోయిన కాఫీ కప్పులు ఎదురుగా పెట్టుకుని మాట్లాడకుండా కూర్చున్న శ్రీనాథ్, సునీతలని పక్కనున్న కుర్చీ కుదిపి పలుకరించాడు వికాస్.

ఉలిక్కిపడి లేచారు ఇద్దరూ.

"రేపు మాట్లాడదాం" సునీతకి చెప్పి శ్రీనాథ్, అనంత్ ఛాంబర్‌కేసి నడిచాడు. ఎర్రబడిన బుగ్గలతో అనుసరించింది సునీత.. వికాస్ పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని సాలోచనగా చూస్తుండగా.

★ ★ ★

"బాగా ఆలోచించుకున్నారా ఇద్దరూ. ఎటువంటి పరిమాణాలు ఎదుర్కోవాలో.. శ్రీ వాళ్ళింట్లో పెద్ద అభ్యంతరాలు ఉండక పోవచ్చు. కులం, సాంఘిక అసమానత చాలా ప్రధానం.. స్నేహానికి అడ్డురావు కానీ పెళ్ళి అంటే రెండు వేర్వేరు బంధువర్గాల కలయిక. అప్పుడప్పుడు అయినా కలుస్తుండాలి. అబ్బాయి తల్లిదండ్రులుగా శ్రీ పేరెంట్స్‌కి కొన్ని ఆశలుంటాయి. వాటిని కాదనలేరు కదా!" వికాస్ అరగంట నుంచీ చర్చిస్తున్నాడు.

శ్రీనాథ్, సునీతా మూడోమనిషి సలహా, సహకారం కావాలని ఇద్దరికీ సన్నిహితుడైన వికాస్‌ని పిలిచారు.

ఆదివారం పొద్దున్నే ఎనిమిదింటికి చట్నీస్‌లో వేడి వేడి ఇడ్లీ, దోశ తిని బిర్లా మందిర్‌లో బాలాజీని దర్శించుకుని, అక్కడే ఒక గుట్టమీద ఉన్న పార్కులో కూర్చున్నారు ముగ్గురూ.

శ్రీనాథ్, సునీతని చూశాడు. సునీత తల దించుకుని, చున్నీకొనని ముడివేస్తూ విప్పుతోంది.

"అదే చెప్తున్నాను సునీతా.. రేపు సంసారంలో రాబోయే చిక్కుముడులని విప్పగలవా అని. మామూలుగా అందరికీ వచ్చే ముడులే కాదు.. ఎన్నో పీటముడులు వస్తాయి. అవన్నీ ఓపిగ్గా విప్పగలవా? అడుగు ముందుకి వేసేటప్పుడు ఆలోచించుకోవాలి. ఆ తరువాత వెనక్కి తీసుకోవడం కష్టం" వికాస్ రెట్టించాడు.

సునీత నెమ్మదిగా తల ఎత్తి శ్రీనాథ్ కళ్ళలోకి చూసింది. ఆ కళ్ళలో తనంటే ఇష్టాన్ని, నీకు నేనున్నాను అన్న భరోసాని చూసింది. గడ్డిలో కాళ్ళు చాపుకుని, మోచేతుల మీద వెనక్కివాలి కూర్చున్న శ్రీ మొహం, ఆకుల సందుల్లోంచి పడుతున్న ఉదయారుణ కాంతుల్లో వింత వెలుగుతో మెరుస్తోంది. ఇతని మొహంలో పెదవులు విప్పకపోయినా ఎప్పుడూ చిరునవ్వు కనిపిస్తుంటుందా! తనకి అండగా ఆ చేతులు ఉండగా.. తల విదిలించింది సునీత.

"ఆలోచించాను వికాస్. బాగా ఆలోచించాను. ఏడాదిపాటు ఆలోచించాను. ఎటువంటి ఒత్తిడినైనా తట్టుకోగలను. మా ఇంట్లో తప్పకుండా అభ్యంతర పెడ్తారు.

## కొత్తగాలి...

**బద్దలైన అద్దంలో**
**బహిర్గతమైంది**
**బహుముఖీన**
**దుఃఖం**

– ఎలనాగ,
హైదరాబాద్

అనుమానం లేదు. ముందు శ్రీ వాళ్ళింట్లో చెప్పి వాళ్ళ అనుమతి తీసుకుందాం. అప్పుడు ఒక ఫ్యామిలీ సపోర్ట్ అయినా ఉంటుంది కదా! ఏమంటావు శ్రీ? "

"తప్పకుండా వచ్చే ఆదివారం మా ఇంటికి వెళ్దాం. నేను ఇక్కడ ఇంకొక అబ్బాయితో కలిసి గది తీసుకున్నాను. మన టైమింగ్స్‌కీ, మావాళ్ళ లైఫ్‌స్టైల్‌కీ పడదని. కానీ నువ్వు మనసులో ఏమను కున్నా బైటికి ఆనందంగా కనిపిస్తానని అంటేనే.."

"అదేంటి శ్రీ! నా సంగతి తెలీదా నీకు. మీ చెల్లెళ్ళ గురించి చెప్తుంటావు కదా.. వాళ్ళ ఫొటోలు కూడా చూశాను"

శ్రీనాథ్ చెల్లెళ్ళు ఇద్దరూ కవలలు. సిటీ లోనే గవర్నమెంట్ కాలేజీలో బీకామ్ చదువుతున్నారు.

"ఫొటోలు చూడ్డం వేరు.. వాళ్ళ ఇల్లు, పరిసరాలు.. ముఖ్యంగా వాళ్ళ అమ్మానా న్నలు... ఆచారాలు అన్నింట్లో తేడాలుం టాయి సునీతా! నేనేదో భయపెడ్తున్నాన ని అనుకోవద్దు. ముందే నిన్ను తయారు చేస్తే మంచిది కదా అని"

"లేదు వికాస్! నిన్ను తీసుకొచ్చిందే మా మనసులో సందేహాలని, వాటి మంచీ చె డులు ముగ్గురం కలిసి చర్చిద్దామని. వచ్చే వారందాకా ఎందుకు శ్రీ? ఇవాళ నాకేం పనిలేదు. అమ్మతో మేము కలవడానికి వస్తున్నానని చెప్పు. విషయం చెప్పలేద నుకో! ఆవిడ ఏదో ఆఫీసుపని అనుకో వచ్చు. మీ ఇద్దరి బైక్‌లూ శ్రీ ఇంటి దగ్గిర పెట్టి, నా కార్‌లో వెళ్దాం"

సునీత కాలేజ్ ఫస్ట్ వచ్చిందని తెలియ గానే మారుతికారు ప్రెజెంట్ చేశారు వాళ్ళ నాన్నగారు. 'శని ఆదివారాలు ఇది అంద రికీ' అని నవ్వుతూ చెప్పి.

సునీత ఉద్యోగంలో చేరాక శని ఆదివా రాలు మాత్రమే వాడుతోంది కారు. ఆఫీ సుకి పిక్‌అప్ క్యాబ్ ఉంది.

"ఇప్పుడా.." శ్రీనాథ్ నమ్మలేనట్లు చూశాడు. ఇంట్లో ఎవరికీ చెప్పకుండా.. తను వస్తాడని వాళ్ళు ఎదురు చూస్తుం టారు కానీ! ఒకే క్షణం కనుబొమ్మలు ముడిచి చూశాడు. ఏమవుతుంది.. సహజ వాతావరణంలో తన వాళ్ళని చూస్తుంది. అంతే కదా!

"ఏం.. ఫుల్లుగా తినేశాం. కాసేపు కూర్చుని వచ్చేద్దాం. వాళ్ళు అనవసర హైరాన పడరు. నువ్వు వచ్చేవారం వెళ్ళి వాళ్ళేమన్నారో కనుక్కో. మా అమ్మమ్మ అంటుండేది, ఎప్పుడు తల్చుకుంటే అప్పుడే మంచి ఘడియ అని" సునీత ఉత్సాహాన్ని చూసి నవ్వుకుంటూ లేచాడు శ్రీనాథ్.

"నేను కూడానా..? " వికాస్ అడిగాడు సందేహంగా.

"భలేవాడివే.. పెళ్ళిపెద్ద లేకుండానా!"

నవ్వుకుంటూ అందరూ మెట్లు దిగారు.

"ఒక్క నిముషం.." శ్రీనాథ్ బాత్రూం లోకి వెళ్ళి ఇంటికి ఫోన్‌చేసి చెప్పాడు, భోజనానికి ముగ్గురం వస్తున్నామని.. శాకాహారమే చెయ్యాలని.

"సునీత వస్తోందా.." పెద్దచెల్లి అడి గింది, చల్లగా!

★ ★ ★

మొయినాబాద్ నుంచి శంషాబాద్ వెళ్ళే దారిలో ఉంది శ్రీనాథ్ వాళ్ళ ఊరు. కొత్త పల్లి, అంటే.. రెండే వీధులు. సిమెంట్ రోడ్లవడంతో కారు దూసుకుపోయింది.

"నెమ్మదిగా.. ఆ కనిపించేదే. కుడివైపున ఆపు" శ్రీనాథ్ పొట్టి గోడలున్న కాంపౌండ్ దగ్గర కారు ఆపించాడు.

సునీత కారు ఆపి, అటూ ఇటూ చూసింది. తన కారు అక్కడ పార్క్ చేస్తే, ఆటో కూడా వెళ్ళదు పక్కనుంచి.

"కారు సంగతి నేను చూస్తాలే. ముందు నువ్వు ఇంట్లోకి పద" శ్రీనాథ్ గేటు




## భారతీయ పద్ధతిలో అమెరికన్ జంట

అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రంలో నివసించే కెమిల్లా బ్లెఫర్ ఓసారి రాజస్థాన్‌లోని జైపూర్ వచ్చింది. భారతీయ సంస్కృతి ఆమెనెంతో ఆకట్టుకుంది. తర్వాత అమెరికాలోని బోస్టన్ నగరవాసి హెర్బర్ట్ మల్లార్డ్ అనే వ్యాపారితో



ఆమె ప్రేమలో పడింది. తమ వివాహాన్ని జైపూర్‌లో జరుపుకోవాలని ఆమె పెట్టిన షరతుకు అతను అంగీకరించాడు.

జైపూర్‌లోని 'సిసోడియా రాణీమహల్'లో వైదిక మంత్రాల మధ్య వారి వివాహం హిందూ సాంప్రదాయం ప్రకారం జరిగింది. జైపూర్‌కి చెందిన కల్నల్ గోవింద్ సింగ్, ఆయన భార్యా కన్యాదానం చేసారు. ప్రపంచం నలుమూలల నుంచి టీవీ ఛానల్స్ దీన్ని కవర్ చేసాయి. మహారాణి గాయత్రీ దేవి, ఇటాలియన్ కౌంటెస్ బియాంకా లోవాటెల్లీ మొదలైనవారు ఈ వివాహానికి హాజరయ్యారు. వివాహానంతరం ఇండియన్, కాంటినెంటల్, చైనీస్ భోజనం, కథక్ నృత్యంలాంటి సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. వారిద్దరూ హనీమూన్‌కి టిబెట్ వెళ్ళారు. మన దేశంలో , జరిగిన తొలి అమెరికన్ జంట వివాహం ఇదేనట. ఆ తర్వాత చాలా మంది అమెరికా, ఫ్రాన్స్ తదితర దేశాలవాళ్లు మన దేశానికి వచ్చి మన సాంప్రదాయం ప్రకారం పెళ్ళిళ్ళు చేసుకుని వెళ్తున్నారు.

---

తీశాడు. ఎర్రరంగు వేసిన చెక్కగేటు. చెక్కలన్నీ బల్లేల్లాగా చెక్కారు.

"జంతువులు లోపలికి రాకుండా.." సునీత చూడ్డం గమనించి అన్నాడు శ్రీనాథ్. అప్పుడు చూసింది సునీత, గోడలమీద కూడా ఇనుప ఊచలు గుచ్చి ఉన్నాయి. కాంపౌండ్ అంతా గచ్చుచేసి ఉంది. అదే నచ్చలేదు సునీతకి. చక్కగా మొక్కలు వేసుకోవచ్చు కదా! ఒక మూలగా ఉన్న చెంబేలి పొద తప్ప ఇంకేమీ లేవు. కానీ గచ్చు అంతా రంగు రంగుల ముగ్గులు వేసి ఉన్నాయి.

"రండి.. రండి" శ్రీనాథ్ చెల్లెళ్ళు ఇద్దరూ వచ్చి, సునీతని రెండు చేతులూ పట్టుకుని తీసుకెళ్ళారు. కొద్దితేడాతో ఒకే పోలికలో ఉన్న అమ్మాయిల్ని వింతగా చూస్తుండిపోయింది సునీత.

"ఈ పంజాబీ డ్రస్ రామలక్ష్మి. ఈ లంగా ఓణీ జయలక్ష్మి. బీకామ్ సెకండ్ ఇయర్ చదువుతున్నారు" శ్రీనాథ్ ఇద్దర్నీ పరిచయం చేశాడు.

నవ్వుతూ లోపలికి తీసుకెళ్ళి, హాల్ లాంటి గదిలో కుర్చీలో కూర్చోపెట్టారు. 'ఇద్దరికీ శ్రీ నవ్వు వచ్చింది' అనుకుంది సునీత.

"నేను కూడా వచ్చాను అమ్మాయిలూ.. కొత్తవాళ్ళు వచ్చారని నన్ను పట్టించుకోవట్లేదు" గుమ్మం అవతలే నుంచుని అలిగినట్లుగా అన్నాడు వికాస్.

"నిన్ను మేం లోపలికి రమ్మని పిలవాలా అన్నా! ఇది నీ ఇల్లు కాదా? " జయలక్ష్మి వికాస్ వెనక్కి వెళ్ళి చేత్తో భుజంమీద కొడ్తూ, లోపలికి నెట్టింది. వికాస్ నెలకి రెండు సార్లయినా వస్తుంటాడు.

శ్రీ కారు తాళాలు తీసుకుని, ఇంటి పక్క స్థలంలో పార్క్‌చేసి వస్తానని వెళ్ళాడు.

"పెద్దమ్మ, పెదనాయన లేరా? " వికాస్ చెప్పులు విడిచి, లోపలికి వస్తూ అడిగాడు.

సునీత నొచ్చుకుంటూ వెళ్ళి, తన చెప్పులు కూడా బైట వదిలి వచ్చింది.

"ఫరవాలేదులే.. గాలీ, వానా నీకు ఏదీ తోచనియ్యలేదేమో" శ్రీ ఇంట్లోకి వస్తూ అన్నాడు, కారు తాళాల్ని సునీతకి ఇచ్చి.

"మమ్మల్ని గాలీ, వానా అంటావా.. నువ్వు తుపానువి కాదా మరీ? ఇవిగో మంచి నీళ్ళు. మీకు కాఫీ కావాలా, ఇంట్లో చేసిన లస్సీనా? " రామలక్ష్మి అన్నతో వాదిస్తూనే సునీతని అడిగింది.

## కొత్తగాలి...

**భవిష్యత్తుకు**
**పెట్టుబడి**
**స్కూల్ ఫీజు**

– ఇంద్రగంటి నరసింహమూర్తి,
కాకినాడ

"ఏదీ వద్దు. కొంచెం సేపయ్యాక.. మీ అమ్మగారూ, నాన్నగారూ.." మంచినీళ్ళు అందుకుంటూ అడిగింది.

"మమ్మీ, డాడీ తోటకి వెళ్ళారు. కొద్ది సేపు ఆగి మనం కూడా పోదాం"

ఇంత పల్లెలోనూ మమ్మీ, డాడీలా? సిటీ కల్చర్ అనుకుంది సునీత.

"ఇంకో రెండు ఆవులు వచ్చినట్లు న్నాయ్యే.." వికాస్ ఇంటివెనుక అంతా చూసి వస్తూ అన్నాడు.

"చెప్తే నేను కూడా వచ్చేదాన్ని కదా వికాస్? " కినుకగా అంది సునీత.

"ముందు నేను చూసి.. చూడబుల్‌గా ఉంటే నీకు చూపిద్దామని"

"అదిగో అన్నా! నువ్వు కూడనా.. మా ఇల్లు ఎప్పటికీ మంచిగా ఉంటుంది" బుంగమూతి పెట్టింది రామలక్ష్మి.

"లేదే పిల్లా.. ఆగలేక చూసొచ్చా సునీతకి నెమ్మదిగా టూర్ చేపిద్దాం. కష్టపడి డ్రైవ్ చేసింది. కొంచెం రిలాక్స్ అవనీ.." వికాస్ ఒక కుర్చీలో సెటిల్ అయి, అక్కడున్న పేపర్ చేతిలోకి తీసుకున్నాడు.

శ్రీనాథ్ రెండు గాజుగ్లాసుల్లో లస్సీ తీసుకొచ్చాడు.

"చూడ్డానికే చాలా బాగుంది శ్రీ!" గ్లాసు అందుకుంది సునీత. గ్లాసులో అంగుళం మందాన నురుగు.. తెల్లటి శుభ్రమైన గ్లాసులు. చేతికి చల్లగా తగిలింది గ్లాసు.

"వావ్! ఎంత కమ్మగాఉందో! ఇందులో వేసింది ఉప్పు ఒక్కటేనా? " నమ్మలేనట్లు అడిగింది సునీత. తమ ఇంట్లో కరివేపాకు, జీలకర్ర వేసిన మజ్జిగ రుచి వేరుగా ఉంటుంది. దేని రుచి దానిదే.

"లక్ష్ములు ఇద్దరూ పత్తా లేరేంటి? ఇదే మిటి, మెత్తగా పువ్వులతో ఉంది.." మజ్జిగ తాగి, శ్రీనాథ్ అందించిన నాప్కిన్‌తో మూతి తుడుచుకుంటూ అడిగింది.

"వస్తారు. ఒక్క పదినిముషాలు.. అందరం కలిసి మా తోటకి వెళ్దాం. అంత వరకూ మా ఇల్లు చూపిస్తాను. ఏదీ నాప్కిన్ సంగతా.. బట్టల కొట్లో, లాస్ట్ పీసెస్ తీసుకొచ్చి అలా తయారుచేస్తుంది రాము. మొయినాబాద్‌లో తెలిసిన కొట్టు ఉందిలే" శ్రీనాథ్ వీధిలోకి నడిచాడు.

వచ్చేటప్పుడు గమనించలేదు కానీ.. గచ్చు చేసిన వీధి వాకిలికి ఒక పక్కగా చిన్న గేటు, అందులోంచి వెళ్తే విశాలమైన పాక ఉన్నాయి. పాక అంతా సాంబ్రాణి వాసన వేస్తోంది. శుభ్రంగా అలికి ఉంది. ఒకపక్క కుడితి గోలెం.. ఇంకో పక్కగడ్డి. పాకలో కూడా ముగ్గులు.

సునీత ఆశ్చర్యంగా చూస్తుంటే అన్నాడు శ్రీ, "మా పాలేరు, భార్య పొద్దున్నే వచ్చి అంతా చేస్తారు. ఇప్పుడు బర్రెల్ని, ఆవుల్నీ బైటికి తీసుకెళ్ళారు. దూడలు ఆడుకుంటా యని, వాకిట్లో మొక్కలు వెయ్యలేదు"

తన మనసులో మాట గ్రహించినట్లు అంటుంటే శ్రీనాథ్‌ని సిగ్గు పడుతున్నట్లు చూసింది.

పాక వెనక్కి వెళ్ళారు. అక్కడున్న మొక్కల్ని చూసి మాట రాలేదు సునీతకి. జామ, సపోటా, మామిడి, దానిమ్మ, అరటి.. కొన్ని చెట్లకి రకరకాల సైజుల్లో కాయలు వేళ్ళాడుతున్నాయి. సపోటా అయితే, ఆకు ఆకుకీ కాయ ఉంది.

"ఈ జామకాయ అందట్లేదురా శ్రీ.. కొంచెం హెల్ప్ చెయ్యవా? " ఎగిరెగిరి కాయ అందుకోబోతున్న వికాస్‌ని చూసి నవ్వింది సునీత.

"కష్టపడి అందుకోడంలోనే ఉంటుంది మజా.. ప్రయత్నం చెయ్యాలి కదా దేని కైనా.. తమాషాకి అన్నాలే. లోపల బోలెడు కాయలుంటాయి. లంచ్ అయ్యాక కోసుకుని తిందాం" శ్రీనాథ్ మాట వినిపించుకోకుండా, కాయని అందుకోవడంలో మునిగిపోయాడు వికాస్.

"మేం రైతులం కద నీతా? అందుకని అన్నీ తినడానికి పనికొచ్చే మొక్కల్నీ, చెట్లనీ పెట్టాము. ముందు కడుపుకి కావాలంటారు మా వాళ్ళు" పాలకూర, తోటకూర, మెంతికూర మడులని చూపిస్తూ అన్నాడు శ్రీనాథ్.

"మా అమ్మా, నాన్న ఇద్దరూ పాలేరు పని చేసేవారు, మా చిన్నప్పుడు. ఇప్పుడున్న మా తోట అప్పుడు బీడుపడిపోయి ఉండేది నీళ్ళు లేక, బోరు తవ్వడానికి పైసలు లేక. నేను స్కాలర్‌షిప్పులతో, కొంతమంది సహృదయుల సహాయంతో చదువుకున్నాను. చిన్న చిన్న పార్ట్‌టైమ్ జాబులూ, సెలవుల్లో మా నాన్నతో కూలికి వెళ్ళడం.. ప్రతీపైసా దాచి ఖర్చుపెట్టే వాళ్ళం. అప్పుడు మేం పనిచేసే దొర ఇంట్లోనే పాకలో ఉండేవాళ్ళం. నేను జాబ్‌లో చేరాక ఈ స్థలం కొని ఇల్లు కట్టించాను. ఇది కట్టడంలో కూడా ఇద్దరు కూలీల బదులు, మా పేరెంట్స్.. వద్దంటే వినలేదు. అందరికీ చేసి.. మన ఇంటికి మనం చేసుకుంటే తప్పేముందిరా అబ్బాయ్ అనేవారు" ఏమాత్రం చిన్నతనం అనుకోకుండా వివరిస్తున్న శ్రీనాథ్‌ని ఆరాధనగా చూసింది సునీత.

"సక్సెస్. చూడు.. కోసేశా..." గర్వంగా చెప్తున్న వికాస్‌నీ, వెనుక కత్తి కట్టిన కర్రతో నిల్చున్న రామలక్ష్మినీ చూసి నవ్వారు ఇద్దరూ.

> **కొత్తగాలి...**
>
> **ఏసీలో నిదురించినా**
> **నా పచ్చని కల!**
> **పొలాల మధ్య ఊయలలో నేను!**
>
> – సురేష్‌కుమార్,
> హైదరాబాద్

పెరడంతా చూసి, వెనుక నుంచి ఇంట్లోకి వచ్చారు అందరూ.

"మేం తయార్. తోటకి వెళ్ళొచ్చి భోజనం చేద్దామా.. తిని వెళ్దామా" జయలక్ష్మి ఇంకో పువ్వుల నాప్కిన్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చింది. దాని డిజైన్ ఇంకా బాగుంది.

"చట్నీస్‌కి తోడు, గ్లాసుడు చిక్కని మజ్జిగ.. అమ్మో! ఇప్పుడేం తినలేను. ఔనూ ఇంతసేపు ఏంచేశారు. మీరిద్దరూ? "

"మొదటిసారి ఇంటికి వచ్చిన అపురూప

అతిథికి మా చేత్తో స్పెషల్స్ చేశాము. ఎట్లున్నయ్యో మీరే చెప్పాలి? "

"జయ చాలా బాగా చేస్తుంది వంట. కాకుంటే మీ ఇంట్లోలాగా ఉండకపోవచ్చు. వెళ్దామా అయితే.." శ్రీనాథ్ బయటికి దారితీశాడు.

శ్రీనాథ్‌కి కారు తాళాలిచ్చింది సునీత.

"మేం బండిమీద వస్తాం. మీరు కార్లో రండి. వచ్చేటప్పుడు అమ్మానాయన వస్తారు కార్లో" గేటు పక్కనున్న స్కూటీని వీధిలోకి తీసి స్టార్ట్ చేసింది రామలక్ష్మి.

తోటలోకి వెళ్తూనే ఆగి, ఎంత బాగుందో అనుకుంటూ నిల్చుంది సునీత.

"ఏందిరా అబ్బాయి, ఇక్కడకొచ్చేసినవ్. మేం ఇంటికొచ్చిటోళ్లం కదా? ఈ పోరి నీ దోస్తా? వికాస్! మంచిగున్నవా? " గంజి లేక వేళ్లాడిపోతున్న ఎర్రటి ఇమిటేషన్ గద్వాల్ చీర మోకాళ్ళకిందికి కట్టి, కొప్పులో బంతిపువ్వు పెట్టుకుని, మట్టి చేతుల్ని బోర్ దగ్గిర కడుక్కుని, పాన్ నములుతూ వచ్చిన శ్రీనాథ్ తల్లిని చూసి షాక్ తిన్నట్లు నిలబడిపోయింది సునీత.

"సునీతా.. సునీతా! అలా నిలబడిపోయావు.. హలో.." కళ్ళముందు చేయి తిప్పుతూ పిలిచాడు శ్రీనాథ్.

"మీ తోటని చూస్తుంటే నాకు మాట రావట్లేదు శ్రీ!" తేరుకుని అంది సునీత.

'శ్రీ చెప్పిందాన్ని బట్టి, వాళ్ళ అమ్మానాన్నల్ని కొంతవరకూ ఊహించుకుంది.. కానీ మరీ ఇంత ఇదిగా ఉంటారనుకోలేదు' అప్పుడే దూరాన్నుంచి వస్తున్న బాలయ్యని, దగ్గరగా వచ్చిన శ్రీ తల్లిని చూస్తూ అనుకుంది సునీత మనసులోనే.

"మా అమ్మ రేణుక. నాన్న బాలయ్య" సునీతకి పరిచయం చేశాడు శ్రీకాంత్.

అక్కడే ఉన్న గున్నమామిడి మాలచ్మి సంతోషంగా తలలు ఊగించింది. పది మామిడి కాయలు కిందికి రాలాయి.

"ఇప్పుడేం గాలిలేదు. ఎందుకూగినట్లు? చూడెన్ని కాయలు రాల్నయ్యో!" కూతుర్ని కోప్పడినట్లు చెట్టుని అడుగుతున్న బాలయ్యని వింతగా చూసింది సునీత.

"అదా! మానాన్న ఈ చెట్లన్నింటినీ తన పిల్లల్లా చూసుకుంటాడు. అవి కూడా నాయనతో అట్లనే ఉంటాయని మా అనుమానం. ఎప్పుడన్నా ఆయన రెండు రోజులు రాకపోతే వేళ్ళాడిపోతాయి.. అదే నీళ్ళు పెడ్తున్నా కూడా"

"నమస్తే అంకుల్. నమస్తే ఆంటీ!" తేరుకున్న సునీత చేతులు జోడించింది.

"దామ్మా బాగున్నవా? మా శ్రీనాథు ఆఫీసుల మంచిగుంటడా? అవునే ఇంతసేపెంజేస్తున్నరే అన్నతో రాలే.." ఒకేసారి సునీతతో, లక్ష్ములతో మాట్లాడింది రేణుక.

మోకాళ్ళ మీదికి ఎగకట్టిన పంచెతో వంగుని, బాలయ్య చెట్టుకింద పడిన కాయల్ని ఏరుకొచ్చి, కాగితం పొట్లంలో కట్టి సునీతకి ఇచ్చాడు.

"దారిలో తాటి ముంజెలాడు కనిపించిండు.. కొన్ని కొనుక్కొచ్చినం, మేం మా బండిమీదొచ్చినంలే మమ్మీ.." రామలక్ష్మి స్కూటీకున్న సంచీ తెస్తూ అంది.

మామిడితోట వెనుక ఒకచిన్న స్థలంలో రెల్లుగడ్డి కప్పిన రేకుల షెడ్డు ఉంది. దాని ముందు లాన్. లాన్లో పది ప్లాస్టిక్ కుర్చీలు ఉన్నాయి. అందర్నీ అక్కడికి తీసుకెళ్ళాడు శ్రీనాథ్.

చెట్లనీడ, చల్లని గాలి, నీళ్ళతో తడిసిన నేల నుంచి వచ్చే మట్టి వాసన.. అందరూ కుర్చీల్లో కూర్చుని, లేత ముంజెలు తింటుంటే ఎంతో ఆహ్లాదంగా ఉంది.

సునీతకి కాయల్లోంచి ముంజెలు తీసుకుని తినడం రాలేదు. పాకలోంచి చెంచా తీసుకొచ్చి దాంతో తినడం నేర్పించాడు శ్రీనాథ్. సిటీలో దొరికే ముంజెల్లా గట్టిగా కాకుండా, జెల్లీలా జారిపోతున్న ముంజెల్ని



సరదా పడుతూ తింది సునీత.

తోటంతా తిప్పి చూపించారు జయా, రామలక్ష్మిలు. కొన్ని చెట్లకి కాయలు లేవు. కొన్ని విరగకాసాయి. సునీత చెట్ల దగ్గరికి వెళ్ళి అయోమయంగా చూస్తుంటే అంది జయ, "అవి రెండో క్రాప్ ఇస్తాయి.. అంటే ఆగస్టులో కాస్తాయన్నమాట. సంవత్సరం అంతా కాయలుంటాయి. అట్లా వేస్తారు తోట"

"చాలా బాగుంది మీతోట. ఈసారి మా

పేరెంట్స్‌ని తీసుకొస్తాను"

సునీత తోటలో గంటపైగా తిరిగింది.

"అమ్మాయ్! ఆకలవట్లే.. చానా సేప యింది కదా.. ఇంటికి పోదాం పదండి. అవునే జయలక్ష్మీ.. వంట చేశావా.. అదే అందరికీ.." కారు దగ్గరికి నడుస్తూ అంది రేణుక సందేహంగా.

"లేదు మమ్మీ.. ఇప్పుడింటికి పోయి వండి పెడ్దువు" అని స్కూటీ ఎక్కుతున్న బిడ్డని మురిపెంగా చూసింది రేణుక.

ఎప్పుడు మార్చుకున్నారో, బాలయ్య, రేణుక వేరే బట్టలు వేసుకోనున్నారు. సునీత కారులో రేణుక పక్కన కూర్చుని ఆశ్చర్యంగా చూసింది.

## కొత్తగాలి...

**జ్ఞానేంద్రియాలను**
**మేల్కొలిపిన సినిమాలే**
**జననేంద్రియాలను**
**రెచ్చగొట్టేలా మారాయి**

– నేమాన సుభాష్‌చంద్రబోస్,
శ్రీకాకుళం

"అమ్మా వాళ్లకి ఇక్కడ ఇంకో చిన్నిల్లు ఉంది. చిన్న సిలిండర్ గాస్ స్టౌతో సహా వంట సామాన్లు కూడా ఉంటయ్యిక్కడ" శ్రీనాథ్ వివరించాడు.

రేణుక మొహం కడుక్కుని, తల దువ్వి జడ వేసింది. పెద్ద జడ.. నల్లగా నిగనిగా లాడుతూ జుట్టు. రంగేసినట్లు కాక సహ జంగా ఉంది. లేత నీలం హేండ్లూం చీర, మామూలుగా కాళ్ళు కప్పుతూ కట్టుకుంది. బాలయ్య తెల్లని పైజామా లాల్చీ వేసుకుని జుట్టు వెనక్కి దువ్వి, నుదుటిమీద నామం పెట్టాడు. అంతకుముందు చూసిన వాళ్ళకీ వీళ్ళకీ పోలికే లేదు.

'హమ్మయ్య!' అనుకుంటూ సునీత నిట్టూర్చింది. తను శ్రీ కోసం వాళ్ళు ఎలా ఉన్నా భరించగలదు. అమ్మావాళ్ళు ఇందాకటి అవతారంలో వీళ్ళని చూస్తే.. ఇంక ఆపైన ఊహించలేదు సునీత.

కారులో సునీత చెయ్యి పట్టుకుని కుశల ప్రశ్నలు వేసింది రేణుక.

"మీఅక్క డాక్టరా! బావయ్య కూడానా.. అమ్మో.." కళ్ళు పెద్దవి చేసి మరీ ఆశ్చర్య పోతుంటే, సునీత మొహమాటంగా తల ఊపింది.

★ ★ ★

"ఏందే.. ఆదివారంనాడు అన్నీ కాయ గూరలు చేశావు? వికాస్‌బాబు కూడా వచ్చిండు కద.." వంటింట్లో గిన్నెలమీది మూతలు తీసి చూస్తూ అడిగింది రేణుక.

"సునీతవాళ్ళు నాన్‌వెజ్జి తినరు మమ్మీ. అన్న ఫోన్‌చేసి చెప్పిండు. అందుకనే ఇట్ల చేసిన"

"అట్లనా.. అయితే సరే. అరిటాకులు కోసి హాల్లో వెయ్యి. అందరికీ వడ్డిస్తాను"

"అదేం కుదరదు. నువ్వు కూడా కూర్చో, మేము వడ్డిస్తాం" రామలక్ష్మి రేణుకని నెట్టుకుంటూ హాల్లోకి తీసుకొచ్చింది.

"అమ్మా! ఎట్లున్నయ్యి మా వంటలు. మీరంతా నాజూకు వంటలు చేసుకుంటా రేమో. మామిడికాయ పప్పులో జొన్నరొట్టె ముంచుకుని తింటూ అన్నాడు బాలయ్య.

జొన్నరొట్టెలతోపాటు వరి అన్నం, ఆలుఫ్రై, బగారా బైగెన్, సెనగపప్పు, సొర కాయ కూర, అప్పడాలు.. బిరియానీ, దహి చట్నీ.. అన్నింట్లో అల్లం వెల్లుల్లి వేసినా చాలా బాగున్నాయి వంటలు.

సునీత జొన్నరొట్టె కూడా రుచి చూసింది.

సాయంత్రం నాలుగింటివరకూ సర దాగా గడిపి ఇళ్ళకి బయల్దేరారు, వెళ్ళలేక వెళ్ళలేక.

సునీతకి బొట్టుపెట్టి పోచంపల్లి చీర పెట్టింది రేణుక.

"ఇదెందుకాంటీ..? మీరు ఆశీర్వదిస్తే చాలు!" అనుకోకుండా కాళ్ళకి దణ్ణం పెట్టింది సునీత.

"అన్యాయం ఆంటీ.. అన్ని ఆడపిల్లల కేనా? మాకేం లేవా!" వికాస్ తెచ్చిపెట్టు కున్న కోపంతో అన్నాడు.

"పెండ్లి చేసుకో బేటా బహుమానం ఇస్తాం" బాలయ్య నవ్వుతూ అన్నాడు.

"ఎవరన్నారు.. ఆడవాళ్లని సరిగ్గా చూడ రని! మన ఇళ్ళకి వచ్చివెళ్ళే ఆడపిల్లల్ని చూస్తే తెలుస్తుంది. స్త్రీ జాతికి జై" వికాస్ స్లోగన్ లాగ అంటుంటే, నవ్వుతూ సాగ నంపారు ఇంటిల్లిపాదీ.

★ ★ ★

"ఎలాగుంది నీతా! మా ఇల్లూ, వాతావ రణం.. మనుష్యులూ? ఏం మొహ మాటం వద్దు. నువ్వు ఎలా నిర్ణయించినా నేను తేలిగ్గా తీసుకుంటాను. ముందు ముందు ఎక్కువ భాగం వీళ్ళతో గడపవ లసి ఉంటుంది. నేను అనుబంధాల్ని వదు లుకోలేను. అమ్మానాన్నల్ని నీకు కావల్సి నట్లు మార్చుకోగలనని అనుకుంటావేమో.. అదేం జరగని పని. ఒక రకం జీవనశైలికి అలవాటు పడ్డవాళ్ళు మారరు. పల్లెటూరి పద్ధతిలో చాదస్తంగా, మోటుగా అట్లాగే ఉంటారు. మనం- యాజ్ దె ఆర్.. యాక్సెప్ట్ చెయ్యాలి. చాలా కల్చరల్ డిఫ రెన్స్ ఉంటుంది.

ముఖ్యంగా ఆహారపు అలవాట్లు, ఆది వారం వచ్చిందంటే మాంసాహారం ఉండా ల్సిందే. ఈ రోజు చెయ్యలేదు కదా అని మానేస్తారని అనుకోవద్దు.

కానీ ఒక్కటి మాత్రం చెప్పగలను. ప్రేమగా చూసుకుంటారు.. ప్రాణం ఇవ్వ గలిగిన ఆప్యాయతని కురిపిస్తారు. నా మీద ఇద్దరు చెల్లెళ్ళ బాధ్యత ఉంది. వాళ్ళ పెళ్ళిళ్ళు నేనే చెయ్యాలి. మాలో కట్నాలు ఎక్కువే. అంటే.. నేను ఆశిస్తున్నానని అనుకోవద్దు. వాళ్ళ గురించి చెప్తున్నా, నాతో నా బాధ్యతల్ని కూడా భరించాలి. ఇదంతా నువ్వు యస్ అనుకునే ముందు ఆలోచించుకోవల్సిన విషయాలు.

ఇంకా మీవాళ్ళు ఒప్పుకుంటారా అనేది అనుమానమే. వాళ్ళని ఒప్పించడం అంత సులభం కాదని నా అభిప్రాయం" శ్రీనాథ్ మాటలు విని ఏమీ మాట్లాడలేదు సునీత.

శ్రీనాథ్ ఉంటున్న ఇంటికి వచ్చేవరకూ ఎవరూ మాట్లాడలేదు.

సరదాగా నవ్వించే వికాస్ కూడా మౌనంగా కునికిపాట్లు పడ్డాడు.

"ఓకే శ్రీ! రేపు కలుద్దాం" సునీత కారు లోంచి చెయ్యి ఊపుతుంటే చూస్తూ నుంచున్నాడు శ్రీనాథ్, చేతులు కట్టుకుని.

★ ★ ★

తల్లిదండ్రుల్ని ఒప్పించడానికి సునీత చాలా శ్రమ పడవలసి వచ్చింది.

శ్రీనాథ్ ఇంటినుంచి వచ్చాక వారం రోజులు ఆలోచించింది. అమ్మానాన్న ఇంతకంటే మంచి సంబంధం తేగల రేమో.. కానీ ఒకసారి శ్రీని మనసులో నిలుపుకున్నాక ఇంకొకరితో ఇంపాసిబుల్.

తనకి శ్రీనాథ్ చెల్లెళ్ళలాంటి స్నేహి తులు ఎంతమంది లేరు.. వాళ్లందరి ఇళ్ళల్లో సరదాగానే ఉండేది కదా! వాళ్ళు నాన్‌వెజ్ తింటే తింటారు.. తనను తిన మనరు కదా! వేరే వండుకుంటే సరి.

శ్రీ నవ్వు మొహం ఎంత మరిచిపోదా మన్నా తనవల్ల కావట్లేదు. ఆఫీసులో, ఇంట్లో కూడా స్తబ్దుగా ఉంటోంది. శ్రీనాథ్ కూడా కొంత సమయం ఇవ్వాలనుకున్నా డేమో.. మళ్ళీ ఆ విషయం ఎత్తలేదు.

ఒకరోజు సుజాత వచ్చి చెల్లెలి విషయం కనిపెట్టింది. మనసులోని మ థనం బైటపెట్టింది సునీత. ఆ వారం

రోజుల్లో రెండు సంబంధాలు తెచ్చాడు సునీత తండ్రి. ఒకటయితే పెళ్ళిచూపుల వరకూ వచ్చి ఎందుకో వెనక్కి పోయింది.

"అక్కా! నువ్వే ఈ సమస్య పరిష్కరించాలి. నాకు అమ్మదే బాధ. ఎలా తీసుకుంటుందో, చుట్టాలందరిలో చులకనంటుందేమో. నేను శ్రీని మర్చిపోలేను"

"సరే నీతూ! నేను చూస్తాను" సుజాత ఆ వారం అంతా అక్కడే ఉండి, అమ్మా, నాన్నలతో వాదించి చివరికి ఒప్పించింది.

★ ★ ★

"శ్రీ! ఈ శనివారం మేము మీ ఇంటికి వస్తున్నాం. వేరే ఏం ప్రోగ్రాం లేదుకదా!"

సంభ్రమంగా చూశాడు శ్రీనాథ్. ఇన్ని రోజులు మౌనంగా ఉంటే మర్చిపోయిందేమో అనుకున్నాడు. తను కూడా ఆలోచనలు మళ్ళించడానికి ప్రయత్నం చేశాడు.

"నిజమా? మీవాళ్ళు ఒప్పుకున్నారా?"

"నేనూ అక్కా కలిసి ఒప్పించాం. నువ్వు చెప్పిన విషయాలన్నీ ఆలోచించాను. నీతో ఉంటే అవన్నీ అసలు పట్టించుకోవల్సినవే కాదనిపించింది. నువ్వు మీ వాళ్ళకి చెప్పి వాళ్ళని సిద్ధం చెయ్యి. అంటే మానసికంగా తయారుగా ఉండాలని.."

"ఓకే"

"సాయంత్రం ఐదు దాటాక, అప్పుడు మంచిదిట"

శ్రీనాథ్ వాళ్ళింటికి సునీత, అక్కా బావలు సుజాతా వినోద్.. అమ్మానాన్నలు శాంత, సురేష్.. ఐదుగురూ సుజాతా వాళ్ల పెద్ద కారులో వెళ్ళారు.

ఇంటిముందు కారు ఆగగానే, శ్రీనాథ్, జయలక్ష్మి గేటు తీసుకుని బైటికి వచ్చారు. జయ మొహం వెలిగిపోతోంది.

"రండి ఆంటీ.. అంకుల్ ప్లీజ్. డాక్టర్ గారూ వెల్‌కమ్.." సాదరంగా లోపలికి తీసుకెళ్ళాడు శ్రీనాథ్. డార్క్ బ్రౌన్ ప్యాంట్ మీద, లేత నీలం షర్ట్ టక్ చేసి హుందాగా ఉన్నాడు. అతని శరీర ఛాయకి ఆ డ్రస్ బాగా నప్పింది.

"నిన్ను చూడగానే మా వదిన అవుతే బాగుండునని అనుకున్నా వదినా!" జయ, చెవిలో అంది. సునీత బుగ్గలు ఎర్రబడ్డాయి. చిరునవ్వుతో కళ్ళు ఎగరేసింది.

బాలయ్య తెల్ల పైజామా, లాల్చీ నుదుట నామంతో వచ్చి, సురేష్ చెయ్యి పట్టుకుని హాల్లోకి తీసుకెళ్ళాడు. వంటింట్లోంచి రేణుక, రామలక్ష్మి కూడా వచ్చారు.

"చల్లగా విశాలంగా ఉంటుందని, వెనుక వాకిట్లో అరేంజ్ చేశాను. అక్కడికి వెళ్దామా?" శ్రీనాథ్ అడిగాడు.

"ఓకే.. మీరెలా చెప్తే అలాగే" వినోద్ దారి తీశాడు, శ్రీనాథ్ వెనుకే.

అబ్బా! ఎంతబాగుందో అనుకుంది శాంత, పెరడు చూడగానే. నీరెండలో చెట్ల కాయలన్నీ వింతకాంతితో మెరుస్తున్నాయి. ఆకుల్లోంచి వస్తున్న ఎండలో చెట్లనీడలు పొడవుగా పెరడంతా పరుచుకున్నాయి. నీళ్ళు చల్లి, ముగ్గు వేశారు. ఎర్రని తెల్లని పేము కుర్చీలు వేశారు. మధ్యలో పెద్ద టీపాయ్. టీపాయ్ మీద పరిచిన బట్ట రామలక్ష్మి నైపుణ్యాన్ని చూపిస్తోంది. మధ్యలో ఫ్లవర్‌వాజ్.. అందులో తాజా పువ్వులు.. సునీత నేర్చుకున్న ఫ్లవర్ అరేంజ్‌మెంట్ లాగ పెట్టి ఉన్నాయి.

చెట్లమీది నుంచి వచ్చే చల్లనిగాలి అందరికీ హాయిని కలిగిస్తోంది. ఆహ్లాదమైన ఆ వాతావరణంలో అందరూ కుర్చీల్లో వెనక్కివాలి విశ్రాంతిగా కూర్చున్నారు. ప్రయాణ బడలిక అంతా ఎవరో చేత్తో తీసేసినట్లు పోయింది. జయలక్ష్మి, రామలక్ష్మి రంగులు వేరైన ఒకేరకం పట్టులంగా, ఓణీలు వేసుకున్నారు. ఒకే రకం ముత్యాల సెట్లు, ఇద్దరూ కడిగిన ముత్యాల్లా మెరిసిపోతున్నారు.

అందరిలోని అమాయకత్వం, బేషజం

లేకపోవడం చాలా నచ్చాయి సురేష్‌కి. శాంత అప్పుడే రేణుకతో కబుర్లు చెప్తోంది. అంత మరీ ఎక్కువ యాస లేదు. సునీత వచ్చినప్పటికీ, ఇప్పటికీ చాలా తేడా కనిపించింది.

జయా, రాములతో తను కూడా వంటింట్లోకి వెళ్లింది సునీత.

"ఇప్పట్నుంచీ అత్తగారింట్లో పనులు చెయ్యక్కర్లేదు వదినా! మీరు కూర్చోండి. అన్న చెప్పాడు. అల్లం వెల్లుల్లి లేకుండా చేశామన్నీ. టేస్ట్ చేస్తారా?" జయ అడిగింది.

"మీరు బాగా చేస్తారు కానీ.. ఆంటీ అంకుల్ లు.. ఆ కట్టూ, మాటా ఇంత త్వరగా ఎలా మారింది? అంటే అపార్థం చేసుకోవద్దు.. నా ఉద్దేశం.."

"బాగా అర్థమయింది వదినా! మేం ఏమీ అనుకోం. మీ వంటివాళ్ళు వచ్చినప్పుడు మమ్మీడాడీ ఇట్లనే ఉంటారు. దొరగారింట్లో ఉన్నప్పుడు అలవాటే కద? పైగా టీవీలు చూసీ, అన్న ఫ్రెండ్స్‌ని చూసీ వాళ్ళే నేర్చుకున్నారు. పెండ్లిలో.. సారీ.. పెళ్ళిలో మీకు మాట రాకుండా చూసే పూచీ మాదీ! చాలావరకూ భాషా, మాటా కూడా మీ లెక్కనే.. కాదు.. మీ లాగనే ఉంటాయి" జయ చెప్తుంటే తప్పు చేసిందాన్లా తల దించుకుంది సునీత.

'అనవసరంగా అడిగి బాధ పెట్టానా.. శ్రీని అడిగి ఉండాల్సింది. ఏమిటో వీళ్ళని చూస్తే శ్రీని చూసినట్లే ఉంటుంది. అందుకే చనువు తీసుకున్నానేమో!' అనుకుంటూ పెదవులు కొరుక్కుంది.

"అయ్యయ్యో! అంత చిన్న మొహం చేసుకున్నావేంటొదినా. నేను నిష్ఠూరంగా అనలే. నిజం చెప్పాను. నిన్ను బాధ పెట్టానా.. సారీ!" గడ్డం కింద చెయ్యిపెట్టి బతిమాలింది జయ.

తల ఎత్తి నిష్కల్మషంగా నవ్వింది సునీత.. నీళ్ళు నిండిన కళ్ళతో కనుపాపలు మిలమిలా మెరుస్తుండగా.

"అన్న బాగా సంపాదించాడు వదినా. మా పెళ్ళిళ్ళకి బాగనే దాచాడు. మాకు సిటీలో ఉన్నవాళ్ళలాగ ఖర్చులుండవు కదా! నీకు మన ఇంటి విషయాలు తెలియాలని చెప్తున్నా. మేము నీకు ఎప్పటికీ ట్రబులియ్యం. నిన్ను మా కనుపాపలెక్క చూసుకుంటం. ఏంటో.. చనువెక్కువైతే మా యాసే వచ్చేస్తుంది. అంటే నిన్ను మా ఇంట్లో కలిపేసుకున్నం, ఎరికేనా!" జయ చిలిపి మాటలకి మనసారా నవ్వుకుంటూ, తనూ ఒక కూల్‌డ్రింక్ ట్రేని పట్టుకుని పెరట్లోకి నడిచింది సునీత.

రాము, జయలాగ మాట్లాడదు. అవసరమైనంత వరకే మాట్లాడుతుంది.

శ్రీనాథ్ సుజాతావాళ్లతో.. సురేష్ శాం

## గురజాడ చతురోక్తులు



మహాకవి గురజాడ అప్పారావులో హాస్య చతురత నిరంతరం తొంగి చూస్తుండేది. ఆయన వివిధ సందర్భాల్లో పేల్చిన చతురోక్తులు కొన్ని..

### రాసింది అంతుపట్టి ఉండదేమో!

అప్పారావు బీఏ పరీక్షలో ఫెయిల్ అయ్యాడు. ఆయన స్నేహితుడొకరు 'అప్పారావు! నువ్వు మా అందరికన్నా చురుకైనవాడివి కదా, మరి పరీక్షలో ఎందుకు పాసు కాలేదు?' అని నిలదీశాడు. పరిశీలనా దృక్పథంతో పుస్తకాల్ని ఆమూలాగ్రం పఠించి, తన అభిప్రాయాలను విమర్శనాత్మకంగా ప్రకటించే అలవాటున్న అప్పారావు ఏమాత్రం కోపగించుకోకుండా, 'మనలో చురుకుదనం పాలు చాలా హెచ్చయిందోయ్! ఎంత హెచ్చు అంటే పరీక్షలకు కావాల్సిన దానికంటే అది చాలా మితిమీరిపోయిందోయ్! మనం రాసింది ఒక సిద్ధాంతం లాగ వారికి అంతుబట్టి ఉండదు!' అని చమత్కారంగా జవాబిచ్చారు.

తలు బాలయ్య దంపతులతో మాట్లాడుతున్నారు.

సంధ్య చీకట్లు అలుముకుంటుంటే శ్రీనాథ్ లేచి లైట్లు వేశాడు. అక్కడక్కడ చెట్లలో కూడా పెట్టారు లైట్లు. దోమలకి మస్కిటో కాయిల్స్ వెలిగించి కుర్చీల చుట్టూ పెట్టారు.

ప్రతి చిన్నదాంట్లోను వాళ్ళు చూపించే శ్రద్ధకి ముచ్చటేసింది వియ్యంకులవారికి.

"ఏదయితేనేం.. కూతురు ఇష్టపడింది. అమ్మ చెప్పినట్లు అల్లుడెవరైనా అతను గోవర్ధనోద్ధారకుడే.." శాంత అనుకుంది.

"మాకు ఇల్లు కంటే దొడ్లు పెద్దగా ఉంటాయి. ఎక్కువ టైమ్ దొడ్లలోనే గడుపుతాం మరి. తోటలు అంటే ప్రాణం. ఆ మొక్కల్తోనే ఊసులాడుకుంటూ ఉంటాం. టీవీ ఎక్కువ చూడం.. టైమ్ వేస్ట్ అనిపిస్తుంది" రేణుక మాట్లాడుతుంటే పక్కనే కూర్చుని సంభ్రమంగా చూస్తోంది సునీత.

'గమనిస్తే అమ్మకంటే ఈవిడే ఇంగ్లీష్ మాటలు ఎక్కువ వాడుతున్నట్లుందే' మనసులోనే నవ్వుకుంది సునీత.

"ఇంక అసలు విషయానికి వద్దాం. అదే.. మేం వచ్చిన పని. బావగారూ! అబ్బాయి చెప్పే ఉంటాడు. పిల్లలు ఇష్టపడ్డాక ఆశీర్వదించడమే మనపని అనుకుంటాను. సాంప్రదాయం ప్రకారం అడుగుతున్నాను. మా అమ్మాయి సునీతని మీ అబ్బాయి శ్రీనాథ్‌కి ఇవ్వాలని అనుకుంటున్నాం. మీకు అభ్యంతరం లేకపోతే మిగిలినవి మాట్లాడుకుందాం" కూల్‌డ్రింకులు తాగాక సురేష్ మొదలుపెట్టాడు.

శ్రీనాథ్, సునీతల మొహాలు ఎర్రబడ్డాయి. ఆ సమయం వస్తే ఎంత చదువుకున్నా సహజసిద్ధమైన బిడియం పోదు.

"మీ అంతటివారు వచ్చి లక్ష్మీదేవిని ఇస్తానంటే వద్దంటామా.. అట్లాగే కానియ్యండి బావగారూ! మీరేం చెప్తే అదే" బాలయ్య ఆనందంగా అనేశాడు.

రేణుక మొహమాటంగా చూస్తోంది. 'కట్నం ఎట్టాగా లేదు.. కనీసం లాంఛనాలైనా.. ఉన్నది ఒక్కడే కొడుకు. ఆడపిల్లలకి ఆశ ఉండదా! కానీ శ్రీనాథ్ ముందే చెప్పేశాడు.. మీకేం కావాలన్నా నేనిస్తా. వాళ్ళనేం అడగవద్దు' అని.

"వదినగారూ! మీరేం చెప్పట్లేదు"

శాంత కేసి తిరిగి అమాయకంగా నవ్వింది రేణుక. పెద్దింటివారు.. మాట తూలితే ఇంకేమైనా ఉందా! "ఏం వద్దు వదినమ్మా. మా కోడలే మాకు అన్నీ.."

"మీరు అలా అనడం మీ సంస్కారం. కానీ మాకున్నది ఇద్దరే అమ్మాయిలు. వాళ్ళ పెళ్ళికని మేము కొంత తయారుగా ఉంటాంకదా! నా శక్తి చెప్తా వినండి.." సురేష్ మాట పూర్తిచెయ్యకుండానే శ్రీనాథ్ అందుకున్నాడు..

"మామయ్యగారూ! ప్లీజ్.."

"నువ్వూరుకో బాబూ!" సురేష్ శ్రీనాథ్‌ని చేత్తో ఆగమని సైగచేసి అన్నాడు.

"ఆడపిల్లలకీ అత్తగారికి.. ఒక్కొక్కళ్ళకీ యాభైవేలు, పెళ్ళికొడుక్కీ వియ్యంకుడికీ కలిపి బట్టలకి యాభైవేలు ఇవ్వగలను. పెళ్ళి బాగానే చేస్తాను. మీ వాళ్ళు ఎంత మంది వస్తారో చెప్తే.. దాన్నిబట్టి.."

రేణుక మొహం ఆనందంతో వెలిగిపో

---

**కొత్తగాలి...**

**'వంట' మనుషులే కాదు**
**భూమాతా చేస్తుంది చూడండి!**
**భూగర్భంలో 'మంట'**
**పొంగుతోంది లావా!**

– బిక్కునూరి రాజేశ్వర్,
పాన్కల్

యింది. సురేష్ తృప్తిగా నిట్టూర్చాడు.

శాంత తన దగ్గరున్న సంచీలోంచి పళ్ళూ, తమలపాకులూ, వక్కలూ.. పూలు తీసింది. సురేష్ లేచి తాంబూలం, పళ్ళు, బాలయ్యకి ఇచ్చాడు.

సుజాత సహాయం చేస్తుండగా శాంత రేణుకకి బొట్టు పెట్టి పూలు, పళ్ళూ, తాంబూలం ఇచ్చింది.

"మా వాళ్ళు నలభైయాభైమంది కంటే ఉండరండీ. పెళ్ళి సింపుల్‌గా చెయ్యండి" శ్రీనాథ్ అంటుంటే తలూపాడు బాలయ్య.

"నిశ్చితార్థానికి, పెళ్ళికీ ముహూర్తాలు పెట్టించి మీకు కబురు చేస్తాం" సురేష్ కుర్చీ లోంచి లేస్తూ అన్నాడు.

"అరే! రావడం పోవడం మీ ఇష్టమే.. ఫలహారాలు చేసి.. అమ్మాయ్!" బాలయ్య హుషారుగా అరిచాడు.

"కతికితే అతకదు అని మీకేమైనా.." మళ్ళీ సందేహంగా అడిగాడు.

"అదేంలేదండి.. అతికేసింది కదా.. ఇంక కతకచ్చు. కాని మీకు శ్రమా.."

"భలేవారే.. లక్ష్మీనారాయణులు ఇంటికి వస్తే శ్రమ అనుకుంటామా? జయా.. రాముా!"

ఉప్మా, పులిహోర, బొబ్బట్లు పళ్ళాల్లో తెచ్చింది రాము. జయ వేడి వేడిగా ఉల్లి పాయ పకోడీలు వేసింది. శ్రీనాథ్ కూడా అన్నీ అందించడంలో సహాయం చేశాడు.

రేణుకనీ, బాలయ్యని కదలనియ్యలేదు పిల్లలు. సునీత లేవబోతుంటే చెయ్యి పట్టుకుని ఆపేసింది రేణుక.

మూడు గంపలనిండా సపోటాలు, జామకాయలు, మామిడి కాయల్తో కారు ఎక్కి టాటా చెప్పారు సురేష్ కుటుంబం.

కోడలికి చక్కని గద్వాల్ చీర పెట్టింది రేణుక. శ్రీనాథ్ స్వయంగా సెలెక్ట్ చేశాడు.

కొద్దిమంది అతిథులే అయినా శాస్త్రోక్తంగా, సరదాగా అయింది సునీతా, శ్రీనాథ్‌ల వివాహం. పెళ్ళవగానే వాళ్ళ ఆఫీసుకి దగ్గర్లో టూబెడ్రూం ఫ్లాట్ అద్దెకి తీసుకున్నాడు శ్రీనాథ్.

"ఇక్కడ్నుంచి ఆఫీసుకి వెళ్తే పిల్లలు ప్రాణాలు కళ్ళలోకి వచ్చెయ్యవూ.. అక్కడ్నే ఉండాలి. వస్తూ పోతూ ఉంటారు" రేణుక సమాధానమిచ్చింది, ఎందుకని అడిగిన చుట్టానికి. రేణుక అన్నట్లే ప్రతీవారం వెళ్తున్నారు శ్రీనాథ్, సునీత. మధ్యలో సురేష్, శాంతల్ని చూసొస్తున్నారు. రోజులు గడిచిపోతున్నాయి. శ్రీనాథ్ భయపడినట్లు, ఎటువంటి విభేదాలూ రాలేదు ఎప్పుడూ.

శ్రీనాథ్ పెళ్ళైన రెండేళ్ళకి జయ, రాముాలవి కూడ పెళ్ళిళ్ళయ్యాయి. అల్లుళ్ళు ఇద్దరూ ఇంజనీర్లే.. బెంగుళూర్లో ఉద్యోగాలు.

అంతా బాగానే ఉండగా.. మరి సునీతా, శ్రీనాథ్‌ల కలతకి కారణమేమిటి?




**"అ**మ్మా ఎక్కడ? ఒక గుడ్ న్యూస్ చెప్పాలి. త్వరగా కింది హాల్లోకి రండి. నాన్న ఏరి?" అనంత్ కారు దగ్గర్నుంచీ జాగింగ్ చేసుకుంటూ ఇంట్లోకి వచ్చి, హాల్లో ఉన్న ఇంటర్‌కమ్‌లో పిలిచాడు.

నిశ్శబ్దం.. మళ్ళీ పిలిచాడు. 'ఇంట్లో లేదా! ఆవిడ కారు ఉందే!' అనుకుంటుంటే

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. నుదుటిమీద అరచేత్తో కొట్టుకుని మళ్ళీ పిలిచాడు.

"మామ్! ఎక్కడ ఉన్నారూ? గుడ్ న్యూస్ మీతో షేర్ చెయ్యాలి. ప్లీజ్.. ఆన్సర్ చెయ్యండి"

"అనంత్! జిమ్‌లో ఉన్నా. నువ్వే వచ్చేయ్. నేను మధ్యలో ఆపలేను" రాణీ గారు కీచు గొంతుతో అరిచారు. మామూలుగా ఆవిడ కంఠస్వరం బొంగురుగా ఉంటుంది. సినిమాల్లో పాటలు, హీరోయిన్లకి డబ్బింగ్ చెప్పే వాళ్ళ గొంతులు వినీ వినీ వాయిస్ మార్చేసి సుప్రనో (ఫాల్స్) గొంతుతో మాట్లాడ్డం నేర్చుకుంది.

"ఒకే మామ్! వస్తున్నా" మళ్ళీ జాగింగ్ చేస్తూ, స్విమ్మింగ్ పూల్ దాటి జిమ్‌కి వెళ్ళాడు అనంత్. విశాలమైన ఏసీ హాలు. ట్రెడ్‌మిల్స్ రెండు, స్టేషనరీ సైకిల్ ఒకటి, యాబ్స్‌కీ, చేతులకీ, కాళ్ళకీ.. శరీరంలో అణువణువునీ పెంచీ, తగ్గించీ.. మార్చి పడేసే పరికరాలున్నాయి అక్కడ.

రోజూ ఐదింటికి లేచి అనంత్ కూడా ఒక గంట గడుపుతాడు అక్కడ. నిర్ణీత సమయంలో వ్యాయామం ఎవరికయినా మంచిదే.

ఇన్‌క్లైన్‌డ్ బల్లమీద స్ట్రాప్స్ బిగించి, కాళ్ళు పైకి పెట్టి తల్లక్రిందులుగా నిలబడి ఉంది రాణీగారు.

మోకాళ్ళమీద కూర్చుని ఆవిడ మొహంలోకి వంగి చూస్తూ అన్నాడు అనంత్, "మామ్! మాకొత్త ప్రాజెక్ట్ యాక్సెప్ట్ అయింది. గ్రాండ్ సక్సెస్. ఫైవ్ మిలియన్ డాలర్లకి సింగపూర్ కంపెనీతో అగ్రిమెంట్ కుదుర్చుకుందామని అనుకుంటున్నాం. వాళ్ళ రిప్రెజెంటేటివ్ రేపు వస్తామని అన్నారు. అయామ్ వెరీ హాపీ.. రెండేళ్ళు కష్టపడ్డాం మామ్.. ఈ లోపు ఇంకెవరైనా కొట్టేస్తారేమోనని టెన్షన్.. వావ్! హాప్పీ.. హాప్పీ.. నీకేం కావాలో చెప్పు. డైమండ్ నెక్లేస్.." బల్లని మామూలుగా తిప్పి, నుంచుని బల్లతోసహా ఆవిడ్ని కౌగలించుకోబోయాడు.

"అరే ఉండు అనంత్.. ఇంకా ఫైవ్ మినిట్స్ ఉంది.."

"అదేం కుదరదు.. నా ఫీల్ షేర్ చెయ్యాల్సిందే.." ఆవిడ కుయ్యో, మొర్రో అంటున్నా వినిపించుకోకుండా గబగబా స్ట్రాప్స్ విప్పి బైటికి లాగి, స్పీకర్లో వస్తున్న మ్యూజిక్కి డాన్స్ మొదలుపెట్టాడు.

కొంచెం సేపయ్యాక ఒగరుస్తూ కార్పెట్ మీద అడ్డంగా వాలిపోయాడు.

"నిజంగా నాక్కావల్సింది కొనిపెడ్తావా? " పక్కనే వెయిట్ లిఫ్టింగ్ మెషీన్ సీటు మీద కూర్చుని అనంత్ డాన్స్ చూస్తూ, తనూ స్టెప్స్ వేస్తూ అడిగింది రాణీ.

"ష్యూర్ మామ్!"

"నాకు డైమండ్ నెక్లేస్ వద్దు. నా దగ్గర చాలా ఉన్నాయి. తమ్ముడ్ని హీరోగా పెట్టి ఒక సినిమా తీద్దాం. మంచి టీనేజెస్ స్టోరీ చెప్పాడు ఒక ఫేమస్ రైటర్"

అనంత్ గుండెలో రాయి పడింది. తల్లి సంగతి తెలిసి తెలిసీ.. అనవసరంగా పాముల పుట్టలో చెయ్యి పెట్టాడు.

"అంత ఎక్కడుంది మామ్.. సారీ! మేబి ఇంకో పది ప్రాజెక్ట్స్.."

"సరే.. కంగ్రాట్స్" నీరసంగా అని సీటు మీద నుంచి పైకి లేచింది రాణీ.

అనంత్‌నే చూస్తూ అనుకుంది రాణి. 'అసలు అనంత్ అయితే బాగుంటాడు హీరోగా. గన్‌షాట్ సక్సెస్ అవుతుంది పిక్చర్. స్టబ్బర్న్ ఫెల్లో. అంతా వాళ్ళ తాత పెంపకం, బుద్ధులూ.. ఏంచేస్తాం!'

★ ★ ★

"అన్నా!" వచ్చి మీద పడ్డాడు నాండీ.

"హే మేన్! ఎలా ఉన్నావు? " తమ్ముడ్ని నడుం పట్టి లేపి, గాల్లోకి ఎగరేశాడు.

"అన్నా! ఎన్ని రోజులైందో తెలుసా





# సముద్రగర్భంలో సాహసికులు!




సముద్రాల అట్టడుగున ఉండే వస్తువులను వెలికితెచ్చే వారిని 'డైవర్స్' అంటారు. సముద్ర గర్భంలోని గనులని అన్వేషించడం, నౌకా ప్రమాదాలప్పుడు శిథిలాలను, మృతదేహాలను పైకి తీసుకురావడం, సముద్రంలో పారేసిన ఆయుధాల్ని పసిగట్టడం, ఓడలు నీటిలో ఉండగానే చిన్న చిన్న మరమ్మతులు చేయడం వీరి విధులు.



డైవర్స్ ఉద్యోగానికి అభ్యర్థులు సాహసోపేతమైన పరీక్షలను ఎదుర్కోవాలి. ముందుగా శరీర దారుఢ్య పరీక్షలో నెగ్గాలి. తర్వాత ఉక్కుతో తయారైన సిలిండర్ ఆకారంలోని గదిలో గాలి నింపి, అందులోకి అభ్యర్థులను పంపుతారు. ఆ గదిలోని పీడనశక్తి నీటిలో యాభైఐదు మీటర్ల లోతు పీడనంతో సమానం. అభ్యర్థులు దీన్ని తట్టుకోగలిగితే తర్వాత పదివారాలు సముద్రగర్భంలో శిక్షణ ఇస్తారు.

రెండో ప్రపంచ యుద్ధానంతరం ఇంగ్లిష్ ఛానెల్‌లో జర్మనీ సైనికులు అమర్చిన 2.4 లక్షల పేలుడు పదార్థాలను డైవర్స్ వెలికితీశారు.

ప్రతిదేశ నావికా విభాగంలో డైవర్స్ తప్పనిసరిగా ఉంటారు. కొందరు పౌరులు కూడా డైవింగ్‌లో శిక్షణ పొంది ప్రకృతి వైపరీత్యాలు, ప్రమాదాలు సంభవించినప్పుడు సేవలను అందిస్తారు. ప్రతిఫలంగా వీరు కొంత పైకం తీసుకుంటారు.

---

నిన్ను చూసి.." అనంత్ మాటలు వినిపించుకోకుండా బుంగమూతి పెట్టి అన్నాడు.

"అవునురా కన్నా! రెండు నెల్లనించీ ఊపిరి సలపట్లేదు. పని..పని. మొత్తానికి మనం అనుకున్నట్లు అయింది. నాకు ఎంత సంతోషంగా ఉందో తెలుసా! నీకు ఏంకావాలో చెప్పు. ఏదయినా సరే.. మంచి రెస్టారెంట్‌కి వెళ్దామా? " తమ్ముడ్ని ముద్దుగా చూస్తూ అడిగాడు.

"అన్నా నేనడిగింది నిజంగా ఇస్తావా? " నాండీ ఆశగా చూస్తూ అడిగాడు.

ఒక్క క్షణం ఆలోచించాడు అనంత్. 'అమ్మలాగా సినిమా కానీ తియ్యమనడు కదా.. అసలే ఆవిడ ట్రైనింగ్..'

"తప్పకుండా..."

అనంత్ కంఠంలో తగ్గిన ఉత్సాహాన్ని గమనించకుండా అన్నాడు నాండీ, "మనిద్దరం కలిసి ఈ ఆదివారం క్రికెట్ ఆడదాం. వన్‌డే మాచ్.. సికింద్రాబాద్ క్లబ్‌లో! క్రికెట్ క్లబ్‌వాళ్ళు పిలిచారు"

అనంత్ గుండె తరుక్కుపోయినట్లయింది. తమ్ముడికి ఉన్న కోరికలు చాలా చిన్నవి, మామూలుగా అందరి దృష్టిలో. కానీ తమ ఇంట్లో!

కళ్ళు గట్టిగా మూసుకుని తెరిచి అన్నాడు "తప్పకుండా. తొమ్మిది గంటలకి తయారుగా ఉండు. బట్టలున్నాయా? డ్రస్ కోడ్ ఉంటుంది"

"ఓ! కావల్సినన్ని" ఎగురుకుంటూ వెళ్ళిపోయాడు నాండీ.

తాతగారికి వాగ్దానం చేసినట్లుగా అన్నదమ్ములిద్దరూ సాధ్యమైనంత వరకూ తెలుగులోనే మాట్లాడుకుంటారు.. తెలుగు పదాలే వాడుతూ.

అనంత్‌కి తాతగారు గుర్తువచ్చారు. ఎంత బాగుండేది చిన్నప్పుడు? ఆ ఆప్యా యతలేవీ ఇప్పుడు? తన గదిలోకి వెళ్ళి గోడకున్న తాతగారి ఫోటోని చూస్తూ కూర్చున్నాడు. పక్కనే నాన్నగారిది, ఆ పక్క తన ఫోటో. తరువాత నాండీది. ఆ వయసులో తాతగారు తనలాగే ఉండే వారేమో!

★ ★ ★

రాజా నందగోపాలవర్మ చాలా ఉత్సా హంగా ఉన్నారు. నలభై సంవత్సరాల వయసులో మంత్రి అవడం అంటే మాటలా! జమీ పోయినా, తెలివిగా బెంగళూరులోనూ, బొంబాయిలోనూ పెట్టు బళ్ళు పెట్టడంతో వారి ఆస్తికి ఢోకా లేదు.

రాజావారి ఉత్సాహానికి అది కాదు అసలు కారణం. వారి ఏకైక కుమారుడు తండ్రి కాబోతున్నాడు. తను తాత.. తలు చుకుంటేనే ఛాతీ పెరుగుతోంది. మీసాలు మెలేస్తూ పడక్కుర్చీలో కూర్చున్నారు.

"చిన్న రాణీగార్ని పిలుచుకు రండ్రా.." ఆయన గంభీర కంఠస్వరం వినగానే ఇద్దరు అంతఃపురంలోకి పరుగెత్తారు.

పసితనం పూర్తిగా పోని, పదహారేళ్ళ చిన్నరాణి నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చి, మామగారి కాళ్ళకి నమస్కారం పెట్టి, తల దించుకుని నిలుచుంది.

"తల్లీ! ఆరోగ్యం బాగుందా? లేడీ డాక్టర్ రోజూ వచ్చి చూస్తోందా? " మృదువుగా అడిగారు రాజావారు.

"బాగుందండి. చూస్తున్నారండి"

"మంచిదమ్మా. ఏది కావల్సినా గుమస్తా తో కబురు చెయ్యి. రేపు మన పెద్దకారు తీసుకుని బజారుకెళ్ళి, నీక్కావల్సినవి కొనుక్కో. జవహరీ కావల్సినా చెప్పు"

తలూపి, నిశ్శబ్దంగా నిష్క్రమించింది చిన్నరాణి. ఆ అమ్మాయినే చూస్తూ, చిన్నగా నవ్వుకున్నారు రాజావారు.

★ ★ ★

బారసాల పీటలమీదున్న చిన్నరాణీ మొహం వెలిగిపోతోంది. పసుపు రాసి నలుగు పెట్టిన శరీరం బంగారు కాంతితో మెరుస్తోంది. కోటేరేసినట్లున్న ముక్కు, చిన్న నోరు.. తీరైన పలువరుస.. రవి వర్మ రాణీగార్ని ఊహించుకుని చిత్రాలు గీశారేమో అన్నట్లుంది.

రాణిగారి పక్కనే కలకత్తాలో ఇంజినీ రింగ్ చదువుతున్న చిన్నరాజావారు హుందాగా కూర్చున్నారు. మధ్య మధ్యలో గర్వంగా రాణీని, ఆవిడ ఒళ్లో ఉన్న బుల్లి రాజావారిని చూస్తున్నారు.

"పేరు ఏం రాయమంటారండీ? " పురో హితుడు మంత్రాలు ఆపి అడిగారు.

"మా ఇలవేలుపు అనంత పద్మనాభ స్వామి పేరు మొదటి మనవడికి పెట్టాలి. మా యువరాజు పేరు, రాజా అనంత వర్మ" పెద్ద రాజావారు ప్రకటించారు.

పెద్ద వెండి పళ్ళెంలో పరచిన బియ్యం మీద పేరురాసి, రాణీని చూసి, చిరున వ్వుతో అడిగారు చిన్నరాజా.. "ఎలా ఉంది పేరు? "

రాణీ సిగ్గుగా నవ్వింది. అసలు తన అభిప్రాయం అడగడమే గొప్ప, అదీ పెద్ద రాజా వారి ఎదురుగా.

చిన్నారి అనంత్ పాకడం వచ్చేవరకే

## కొత్తగాలి...

**ఉగ్రవాదం**
**రెండు తలలపాము**
**అవినీతి**
**వేయి తలలపాము**

– వి. సుబ్బారావు,
అనకాపల్లి

అమ్మ ఒడిలో ఉన్నాడు. తర్వాత తాతగారి నీడ అయిపోయాడు.

★ ★ ★

చిన్నరాణిగారు కలకత్తా వెళ్లడానికి అన్ని ఏర్పాట్లూ అయ్యాయి. చిన్నరాజా చదువు ఇంకా రెండేళ్ళు ఉంది. అందుకని అక్కడే ఒక బంగ్లా తీసుకుని సకల సదుపాయాలూ చేశారు పెద్ద రాజావారు.

"తల్లీ! బుల్లిరాజావారు ఎక్కడికి?" కారు ఎక్కడానికి సిద్ధంగా ఉన్న చిన్నరాణీ తల ఎత్తి చూసింది. చంకలో ఉన్న బుల్లిరాజా తాతగారిని చూసి బోసినోటితో నవ్వాడు.

తల ఎత్తి అయోమయంగా చూసింది, ముసుగులో నుంచి రాణీ.

"బుల్లిరాజా ఇక్కడే ఉంటారు. వారిని వదిలి ఉండగలనా అదీ ఇరవైనాలుగు నెలలు.. వారి సామాన్లు దించేయండి"

పరివారం చకచకా కదిలి బుల్లిరాజా సరంజామా అంతా దించింది.

చిన్నరాణీగారు కారు కిటికీలో నుంచి కనిపించినంత వరకూ చూస్తూనే ఉంది.

అలా తాతగారి దగ్గరే ఉండిపోయాడు అనంత్. జమీందారీ సౌఖ్యాలతో పాటుగా, కఠినమైన క్రమశిక్షణ, వ్యాయామం, చదువు.. అన్నింటిలో శిక్షణ పొందాడు.

అనుక్షణం తాతగారి నోట అనంత్ అనే పిలుపే. పెద్ద రాణీగారు పోయిన పదేళ్లకి అనంత్ రాక, ఆ దివాణంలో సందడి తీసుకొచ్చింది.

ముఖ్యంగా క్రికెట్ అంటే రాజాగారికి చాలా ఇష్టం. ప్రతీ శని, ఆదివారాలూ కలకత్తా నుంచి కోచ్ వచ్చి నేర్పిస్తాడు.

కలకత్తాలో చదువయ్యాక చిన్నరాజాని హైదరాబాద్ రమ్మన్నారు రాజా నందగోపాల్ వర్మ. వారెలాగా అక్కడే ఉంటారు. ప్రభుత్వం పెద్ద బంగ్లా ఇచ్చింది.

నెమ్మదిగా తమ ఆస్తులన్నీ హైదరాబాద్‌కి మార్చేశారు. చిన్నరాజా సివిల్ కాంట్రాక్టులు చేపట్టారు. అప్పుడప్పుడే వృద్ధి చెందుతున్న రాజధానిలో వారికి ఎదురు లేకపోయింది. నగరంలోని పేరు పొందిన వ్యాపారులలో ఒకరయ్యారు.

సివిల్ పనుల నుంచి, రియల్ ఎస్టేట్.. శివార్లలో వందల ఎకరాల్లో ద్రాక్షతోటలు, కోళ్ళఫారాలు మొదలెట్టారు.

అనంత్ అన్నిహంగులున్న మంచి స్కూల్లో చేరాడు. అక్కడ చదువుతో సమానంగా క్రికెట్ నేర్పిస్తారు. తాతగారు ఖాళీ ఉన్నప్పుడు అనంత్‌తోనే గడుపుతున్నారు.

తరాలు మారి పెత్తనం చిన్న రాజావారి చేతికి వచ్చింది. వృద్ధులైన పెద్దరాజావారు పక్షవాతంతో కదల్లేని స్థితికొచ్చారు. అనంత్ ఒక్కడే రోజూ ఆయన వద్ద గడిపేది. చిన్నరాజా ఇంగ్లీష్‌లో తప్ప తెలుగులో మాట్లాడడు. అందుకే అనంత్ దగ్గర మాట తీసుకున్నారు రాజాగారు.. తెలుగుని మర్చిపోనని.

అనంత్ పుట్టిన పదేళ్లకి నాండీ పుట్టాడు. ఆ పదేళ్లలో చిన్నరాణీ కాలేజ్‌లో చేరి డిగ్రీ పాసయింది. హైసొసైటీ అలవాట్లు.. క్లబ్బులు, కార్డ్స్.. రేసులు.. అన్నీ ఒంటబట్టించుకుంది.

కానీ ఏదయినా కొంత హద్దువరకే. మరీ పూర్తి స్వేచ్ఛ ఇవ్వలేదు చిన్నరాజా. వంశ ప్రతిష్ఠ దెబ్బతినకుండా ఏం చేసినా ఫరవాలేదు. డబ్బు కూడా ఆవిడ అకౌంట్‌లో ఎంత ఉంటే అంత వరకే. ప్రతీ నెలా రాజావారే వేస్తుంటారు.

ఎన్ని ఉన్నా ఆవిడ ఆశయం మాత్రం నెరవేరట్లేదు. అనంత్ అసలు అందిరాడు. నాండీ మీదనే ఆశలన్నీ.

★ ★ ★

అనంత్ ఆలోచనల్లో నుంచి బైటపడి, తన ఫొటో పక్కనే ఉన్న నాండీ ఫొటో చూశాడు. ఎంత ముద్దుగా ఉన్నాడు.. వాడికి కావలసినట్టు వాడు ఉండగలిగితే,



పెద్ద సైంటిస్ట్ అవగలిగే తెలివీ, పట్టుదలా ఉండీ ఏమీ చెయ్యలేకపోతున్నాడు.

తల్లితో ఎన్నోసార్లు మాట్లాడుదామని చూశాడు అనంత్.

"నువ్వు కూడా నా ఆశల్ని తుంచి వేయాలని చూడకు. నిన్నేమయినా హీరో అవమని అడిగానా? వాడిని పుట్టినప్పట్నుంచీ మౌల్డ్ చేసుకుంటూ వస్తున్నాను. ఈ విషయంలో ఎవరు కల్పించుకున్నా ఒప్పను. వంశప్రతిష్ట అంటారు కదా.. 'రాణిగారి ఆత్మహత్య.. కారణాలు?' అంటూ పేపర్లో వస్తుంది జాగ్రత్త"

వీరావేశంతో ఊగిపోతున్న తల్లిని చూసి తల దించుకుని వెళ్ళిపోయాడు అనంత్.

నాండీకి అభిరుచి, సినీ ఫీల్డ్‌కి కావల్సిన పర్సనాలిటీ ఉంటే అది వేరే సంగతి. ప్రయత్నించినా ఫలితం ఉంటుంది.

గోడమీద తనని చూసి నవ్వుతున్నట్లున్న నాండీ ఫొటో చూసి గట్టిగా నిట్టూర్చాడు అనంత్.

పచ్చని పసిమి.. కానీ ఫొటోలో తేలిపోతున్నట్లు, పాలిపోయి ఉంటుంది శరీర ఛాయ. లెన్స్‌కి సరిపోదు.

కళ్ళు.. నవ్వుతున్నట్టు ఉంటాయి మెరుస్తూ. కానీ చిన్నవి. నవ్వినప్పుడు మొహంమీద గీతలున్నట్లు ఉంటుంది. మామూలుగా చూస్తే ఏమీ అనిపించదు. ఉన్న లక్షణాలని ఎక్కువ చేసి చూపిస్తుంది కెమెరా.. పెద్ద కళ్ళని ఇంకా పెద్దవిగా, చిన్న కళ్ళని.. మరీ చిన్నవిగా. కళ్ళలో పలకాల్సిన భావాలు కనిపించవు.

ముక్కు కొద్దిగా బండగా ఉంటుంది. ఫొటోలో అదే కనిపిస్తుంటుంది ముందు. ఒక్క పలువరుస చాలా బాగుంటుంది. నవ్వితే ముత్యాల వరసలా మెరుస్తుంది. అదే నవ్వు, ఇతర ఫీచర్స్‌ని.. కప్పేస్తుంది.. ఎదురుగా ఉన్నప్పుడు.

ఇంక శరీర సౌష్ఠవం. ఎంత తిన్నా.. కండలు రావట్లేదు. వ్యాయామంతో రెసిస్టెన్స్ వస్తోంది. ఎముకలు గట్టి పడుతున్నాయి కానీ మసిల్స్ రావడానికి మొరాయిస్తున్నాయి. పైగా ఒళ్ళు నొప్పులు.

రోజూ రాత్రిళ్ళు వాడు నిద్రలో ఏడవడం, పక్కగదిలో ఉన్న అనంత్‌కి వినిపిస్తూనే ఉంటుంది. తను కూడా ఏడవడం తప్ప ఏమీ చెయ్యలేడు.

నాండీకి తాతగారి పోలిక వచ్చింది. ఆయన పాత ఆల్బమ్స్‌లో అచ్చు ఇలాగే ఉన్నారు. పాతికేళ్ళు దాటాక, శరీర తత్వం మారి సౌష్టవం ఏర్పడుతుంది. అప్పుడు పనికొస్తాడేమో హీరో సిద్ధార్థ లాగ లేట్ కెరియర్.. అబ్బే అసలు ఫీచర్సే.. సినీ ఫీల్డ్‌కి పనికొచ్చేవిగా ఉండవు.

ఇవన్నీ తల్లికి ఎలా చెప్పడం? అసలు ఆ మాట వస్తేనే హిస్టీరిక్‌గా అయిపోతుంది. అనంత్‌కి తల పగిలిపోతున్నట్లుంది. కాఫీ తెప్పించుకుంటే.. ఇంటర్‌కమ్ దగ్గరకి వెళ్లబోయి ఆగి, కిందికి హాల్లోకి వెళ్లాడు. అక్కడే ఉన్న బట్లర్‌కి కాఫీ తెమ్మని చెప్పి, పేపర్ తీశాడు. పేపర్ చూసి ఎన్ని రోజులైందో!

కాఫీ తాగుతుండగా మోగింది సెల్. నొక్కి చెవి కానించాడు.

"అనంత్! నేను వికాస్. సాయంత్రం పార్టీ ఉందా?" ప్రాజెక్ట్ పూర్తి అయినందుకు పార్టీ ఇస్తున్నాడు అనంత్.

"హాయ్ విక్కీ! అఫ్‌కోర్స్.. ఎందుకుండదు.. ఏదయినా ప్రాబ్లం?"

"శ్రీ రాలేనని ఫోన్ చేశాడు. సునీతకి బాగా లేదుట. హాస్పిటల్‌లో చేర్చాడుట. నువ్వన్నట్లే ఆరు వారాలు సెలవు ఇచ్చి ఊరికెళ్లమని చెప్పాను. ట్రావెల్ ఏజెంట్‌తో మాట్లాడినట్లున్నాడు కూడా. మరేమయిందో? నేను హాస్పిటల్‌కి వెళ్తున్నా"

"అయ్యో! శ్రీ లేకుండా పార్టీ ఏంటి?

అసలు తనే కద హీరో! ఏ హాస్పిటల్? నేను కూడా వస్తా"

"కేర్.. బంజారాహిల్స్"

అనంత్ అట్నుంచి అలాగే పోర్టికోలోకి వెళుతూ 'రాగానే బట్టలు మార్చుకోకపోవడం మంచిదే అయింది' అనుకున్నాడు. ఎదురుగా తండ్రి డ్రైవర్ కనిపించాడు. "పద.." అంటూ కార్లోకి ఒక్క గెంతులో పడ్డాడు. రాజావారు సింగపూర్ వెళ్లారు వ్యాపారం మీద.

ఈ హడావుడిలో నాండీ సంగతి మర్చిపోయాడు. పెద్ద గీత ముందు చిన్నగీత.. అంతేకదా మరి.

కారులో వెనక్కి వాలి ఒక్కసారి శ్రీనాథ్‌తో తన మొదటి పరిచయం గుర్తుకు తెచ్చుకున్నాడు అనంత్.

శ్రీనాథ్ మైక్రోసాఫ్ట్‌లో పనిచేసేటప్పుడు, తన యాడ్ నెట్‌లో చూసి రెజ్యూమే పంపాడు. తను వెంటనే అది చూసి, ఇంప్రెస్ అయి, ఊరికే ఫార్మల్‌గా ఇంటర్వ్యూ చేసి తీసేసుకున్నాడు.

అప్పట్నుంచి ఎంతో దీక్షగా పనిచేస్తున్నాడు. సునీత కూడా అదే సమయంలో చేరింది. ఇద్దరూ ఈడూ జోడూగా ఉంటారు... వాళ్ళ పెళ్ళికి కూడా వెళ్లాడు తను. ఇంచుమించు తన వయసే ఉంటుంది. హౌస్ వైఫ్‌గా ఉంటానని జాబ్ మానేసింది. శ్రీ శాలరీ బాగానే ఉంది కదా... మరి ఏం ప్రాబ్లమో.

శ్రీని తల్చుకుంటేనే మనసంతా హాయిగా ఉంటుంది. కామ్‌గా, ప్లెజంట్‌గా ఉంటాడు. కృషి, పట్టుదలతో పైకి ఎదిగాడు. అసలు వికాస్, శ్రీలతో కలిసి కొత్త కంపెనీ మొదలుపెడదామని కూడా అనుకుంటున్నాడు తను. బుర్రలో ఆ ఆలోచన పెరుగుతూనే ఉంది... అంతలో ఇది.

"సాబ్!" డ్రైవర్ పిలుపుతో లేచి, పార్క్ చేసుకోమని చెప్పి, హాస్పిటల్‌లోకి వెళ్లాడు.

లాంజ్‌లోనే ఎదురయ్యాడు వికాస్.

"ఫరవాలేదు అనంత్. చాలా నీరసంగా ఉందిట. ఫ్లూయిడ్స్ ఎక్కిస్తున్నారు. రేపు ఇంటికి తీసుకెళ్ళవచ్చుట"

"ఏమయింది"

"చాలా రోజుల్నుంచీ డిప్రెషన్‌లో ఉంది. సరిగ్గా తినకపోవడం... ఏదో మనసులో పెట్టుకుని స్తబ్దుగా కూర్చోడం... దానికితోడు శ్రీ వర్క్ ప్రెషర్... అంతా కలిపి, ఈవేళ శ్రీ తీరుబడిగా తన దగ్గిర కూర్చుని ఒక నెల అలా తిరిగొద్దామనేసరికి తట్టుకోలేక, పడిపోయిందిట. రక్తం చాలా తక్కువగా ఉందిట. ఎక్కించనక్కర్లేదు కానీ, జాగ్రత్తగా టైమ్‌కి మందులివ్వడం, తినిపించడం, కేర్ తీసుకోవడం చేస్తే, తగ్గిపోతుందని చెప్పారు"

**కొత్తగాలి...**

**ప్రాజెక్టులకు జలకళ**
**రైతన్నల మలమల**
**పంటలు...**
**సెలవుదినాల్లో వెలవెల**

– తల్లాప్రగడ నాగేష్,
కాకినాడ

పెద్ద అంగలేసుకుంటూ వస్తున్న శ్రీని చూసి ఆపేశాడు వికాస్.

"సారీ శ్రీ!" అనంత్ ఎదురెళ్ళాడు.

"అనంత్" సంభ్రమంగా చూశాడు శ్రీ.

"బిల్స్ అన్నీ నాకు చార్జ్ చెయ్యి. కొంచెం నయమవగానే మీరు ఒక నెల కేరళ వెళ్ళిరండి. కొట్టక్కల్ వెళ్ళండి. అక్కడ ఆర్య వైద్యశాల వాళ్ళు ప్రకృతి వైద్యం చేస్తారు. అన్ని అరేంజ్‌మెంట్స్ చేస్తాను. మామూలుగా ఆర్నెల్ల వరకూ ఉంటుంది క్యూ. అది నేను మానేజ్

చేస్తాను. మీ పర్సనల్ ప్రాబ్లమ్స్ కూడా అక్కడే సాల్వ్ చేసుకోవచ్చు"

అనంత్ మాటలకి కొండంత ధైర్యం వచ్చినట్లయింది శ్రీనాథ్‌కి.

"థ్యాంక్యూ వెరీమచ్ అనంత్. మిమ్మల్ని చూస్తుంటే నాకు ఎంత ధైర్యంగా ఉందో మాటల్లో చెప్పలేను. రేపు ఇంటికి తీసుకుని వెళ్లచ్చునన్నారు"

"వచ్చేవారం ట్రిచీకి ట్రైన్ టికెట్ బుక్ చేస్తాను. అక్కడ్నుంచి టాక్సీలో వెళ్ళాలి"

కొంచెంసేపు ఉండి డాక్టర్‌తో మాట్లాడి వెళ్లిపోయాడు అనంత్.

అతను వెళ్తుంటే హడావుడిగా వస్తూ ఎదురయ్యారు, బాలయ్య, రేణుక, సురేష్, శాంతలు. అందర్నీ పలకరించి ఇంకోసారి ధైర్యం చెప్పి వెళ్తున్న అనంత్‌ని చూసి అనుకున్నాడు సురేష్.. 'అన్నీ ఉన్న విస్తరి అణిగి మణిగి ఉంటుంది'

★ ★ ★

"ఏమీ భయం లేదమ్మా! నీరసం అంతే. రేపు ఇంటికెళ్ళిపోవచ్చు"

అదుర్దాగా అడుగుతున్న పెద్దవాళ్ళందరికీ ఒకటే జవాబు ఇచ్చాడు శ్రీనాథ్.

"దవాఖానా వరకూ ఎందుకొచ్చావురా నీరసం అయితే.. సంవత్సరం నుండీ చూస్తున్నా కదా.. బిడ్డ కళ్ళల్లో ఉంటున్నయి ప్రాణాలు. ఏదీ సరిగ్గా చెప్పరు" రేణుక గొడవ చేసింది.

శాంత కళ్లలో కూడా అదే భావం.

"నువ్వు కొన్నాళ్ళు ఉద్యోగం మానెయ్యి. ఇంటి పట్టున ఉండండి. పెరుగు, నెయ్యి, ఆకుకూరలు, పళ్ళు మంచిగా తింటే చాలు. నేను చూస్కుంట"

"అవును బేటా.. అమ్మ చెప్పినట్లు చెయ్యండి" బాలయ్య వత్తాసు పలికాడు.

చెమ్మగిల్లిన కళ్ళతో వారిని చూస్తున్నాడు సురేష్. వాళ్ళు ఇచ్చిన ధైర్యం తను ఇవ్వలేకపోతున్నాడు. కీళ్లవాతంతో శాంత ఆరోగ్యమే అంతంత మాత్రం. ఇంటి పనంతా తనే చేస్తున్నాడు. ఇంక జబ్బు పడిన కూతుర్ని ఎలా తీసుకెళ్ళగలడు?

శ్రీనాథ్ ఏమీ మాట్లాడకుండా అమ్మని దగ్గరికి తీసుకున్నాడు. నిజం చెప్పాలంటే ఆవిడ అన్నదే సునీతకి సరైన వైద్యం. ముందు మునుపటి సునీతని చేసుకోవాలి.

"కేరళ వెళ్ళి ఆయుర్వేద వైద్యశాలలో ట్రీట్‌మెంట్ తీసుకోమన్నాడమ్మా మా బాస్. అక్కడ్నుంచి వచ్చాక ఇంటి దగ్గరే ఉంటాం, తప్పకుండా.. నీ చేతివంట తింటూ, నీ సంరక్షణలోనే. సరేనా!"

కళ్ళలో నీళ్ళు కారుతుండగా కొడుకు భుజంమీద ఆనుకుంది రేణుక.

సురేష్‌వాళ్లూ చూస్తూండిపోయారు.

అందర్నీ సునీత ఉన్న గదిలోకి తీసుకెళ్లాడు శ్రీనాథ్. మంచానికి బల్లిలా అతుక్కుపోయి ఉన్న కూతుర్ని చూసి దుఃఖం ఆపుకోలేక, బైటికి వచ్చేసింది శాంత.




ఆకాశం అంతా మేఘాలు కమ్మేశాయి. సుడిగాలి మొదలవబోతున్న సూచనలు కనిపిస్తున్నాయి. బాలయ్య ఇంట్లోంచి బైటికి వచ్చి చెప్పులు వేసుకుని గబగబా వెళ్లబోతున్నాడు.

పశువుల పాకలో ఉన్న రేణుక పరుగున వచ్చింది గేటు దగ్గరికి.

"ఎక్కడికయ్యా.. తోటకేనా? "

"అవునే.. చెట్లన్నీ గిలగిల్లాడిపోతయ్యి. చూడు తుపాను వచ్చేట్లుంది"

"అయితే నువ్వెళ్ళి చేసేదేవుంది? తుపాను ఆపగలవా? మళ్ళీ ఎట్లొస్తవు? అక్కడున్న రేకుల షెడ్డు ఈ గాలికి ఆగుతుందా? " రేణుక నిలదీసింది.

అదీ నిజమే. వెళ్ళి చేసేదేం లేదు. బాలయ్య ఇంట్లోకి వచ్చి చెప్పులు విడిచి, వరండాలో కుర్చీ వేసుకుని కూర్చున్నాడు.

అక్కడున్నాడన్న మాటేకానీ అతని మనసంతా తోటమీదే ఉంది. తోట కాపు మొదలుపెట్టి ఎనిమిది ఏళ్లవుతుంది, రేపు వానాకాలంకి. సరిగ్గా శ్రీనాధు చేతికి అందొచ్చినప్పట్నుంచీ. బ్యాంకు లోను మూడు సంవత్సరాలలో తీర్చేశాడు. ప్రతీ సంవత్సరం ఎంతో లాభం సంపాదించి పెట్టింది. తోటలోని ప్రతి చెట్టూ మొక్కా తెచ్చి పాతినప్పట్నుంచీ తనకి గుర్తే.

తోట వేసినప్పట్నుంచీ ఇంత తుపాను చూళ్లేదు. చిట్టి తల్లులు ఎట్లా తట్టుకుంటయ్యో! బాలయ్య కళ్లలోంచి నీళ్లూ, వాన మొదలవడం ఒకేసారి జరిగాయి.

"ఏందయ్యా! ఏమైనా పిచ్చి పట్టిందా? ఇదిగో ఈ పాలు తాగు. సరిగ్గా తిండి కూడ తినలే! ఏమయ్యేదుందో అదే అవుతుంది. ఏది శాశ్వతం ఈలోకంలో? "

రేణుక వచ్చి ఎదురుగా నేలమీద కూర్చుని ఓదార్పు మాటలు పలికింది. వానజల్లు చివ్వున మీదికి ఎగజిమ్మింది.

నెమ్మదిగా లేచి, బాలయ్యని కూడా లేపి ఇంట్లోకి నడిపించుకుని తీసుకువెళ్ళింది.

"ఒక్క మొక్కయినా మిగులుతుందంటనే.. ఎట్లా అల్లాడుతున్నయ్యో పాపం" తనూ వాటిలాగే ఊగిపోతూ అన్నాడు.

పెండ్లిండ్లయ్యి కాపురం చేసుకుంటున్న కూతుళ్ల గురించి ఒక్కసారి కూడా అడగడు బాలయ్య. అంత పెద్ద వృక్షాలని పట్టుకుని చెట్లంటడు. రేణుక నవ్వుకుంది. అదే నిలదీసింది మొగుణ్ణి.

"అంటే.. వాళ్ళని మంచిగా చూసుకోనీకి అల్లుళ్ళున్నారు, అన్నావదినలున్నారు, మనం ఉన్నాం. మరి వాటికి నేను తప్ప ఇంకెవరున్నారు చెప్పు? " బాలయ్య బైటికి చూస్తూ అన్నాడు. వానతో గాలి కూడా మొదలయింది.

"నిజమేనయ్యా! చంటి పాపలెక్క సాకావు మరి. అట్టానే ఉంటుంది. చూద్దాం. రేపు తెల్లారి వాన తగ్గకపోతుందా, అప్పుడు వెళ్ళి చెయ్యగలిగింది చేద్దాం. ఇప్పటికి నెమ్మదిగా ఉండు" రేణుక భారంగా వంటింట్లోకి వెళ్ళింది.

★ ★ ★

ఆదివారాలు కోచ్‌కి రావద్దని చెప్పేశాడు అనంత్. అతను ప్రతిరోజూ వచ్చి చేసేది ఏమీ లేదు.. గంటకి ఇంతని డబ్బు పట్టుకుపోవడం తప్ప.

వారానికి మూడు రోజులే చెయ్యాలి బరువులు ఎత్తడం లాంటి కఠినమైన వ్యాయామాలు. మిగిలిన రోజుల్లో దగ్గరుండి ట్రెడ్‌మిల్, సైక్లింగ్, ఈత చేయిస్తాడు. అది అతను లేకపోయినా చెయ్యచ్చు. కాకపోతే నాండీ కోచ్ లేకపోతే జిమ్ చుట్టుపక్కలకి వెళ్ళడు.

శనివారం రాత్రే అమ్మని తయారుచేశాడు అనంత్. రాణీ గొడవ పెట్టింది.

"మామ్! నేను చాలా రోజుల తర్వాత క్రికెట్ మ్యాచ్‌కి వెళ్తున్నా.. నాండీని కూడా తీసుకుని వెళ్తా" అనంత్ నెమ్మదిగా అడిగాడు తల్లిపక్కన కూర్చుని. తమ్ముడ్ని అక్కడ నుంచి ముందే పంపించి వేశాడు. వాడు ఉంటే అప్సెట్ అయి, ఏడుస్తూ కూర్చుంటాడు.

"అదెలా కుదురుతుంది? నాండీ షెడ్యూల్ చిందర వందరవుతుంది. కుదరదు.." అనంత్‌కేసి తిరక్కుండా సమాధానం చెప్పి టీవీ చూస్తూ కూర్చుంది.



అనంత్‌కి తిక్కరేగింది. అసలు తామిద్ద రికీ కూర్చుని మాట్లాడ్డానికి ఏ రెండు మూడు నెలలకోగానీ తీరదు. అటువం టిది, దగ్గర కూర్చుని చెప్పాలని ప్రయత్ని స్తుంటే వినడానికి కూడా మనసు ఒప్పదా!

లేచి వెళ్లి టీవీ ప్లగ్ ఆఫ్‌చేసి వచ్చాడు.

"ఇదేమిటి అనంత్? ఇలా చేస్తే నాకు ఇష్టం ఉండదు. కమాన్ ఆన్ చెయ్యి" ఆజ్ఞాపిస్తున్నట్టుగా అంది.

"ముందు నా మాట వినండి. అప్పుడు రాత్రంతా కూర్చుని చూడవచ్చు" అనంత్ గొంతులో కోపం రాణీగారిని అతనికేసి తిరిగేలా చేసింది.

"ఓకే.. ఏంటో చెప్పు? "

"అప్పుడప్పుడు తమ్ముడికి ఇష్టమైన పనులు కూడా చెయ్యాలి మామ్. అంతా మనమే చెప్పకూడదు. ఒక్కరోజు ప్రోగ్రామ్ మారితే ఏమవుతుంది? "

"ఏమవడమా? అదే అలవాటవుతుంది. అందరూ నన్ను వెనక్కి లాగేవారే. ఇంట్లో కోపరేషన్ ఉంటే ఇలా ఎందుకుంటుంది? వాడికి నచ్చచెప్పాల్సింది పోయి నాకు చెప్తు న్నావా? వాడి గోల్ రోజూ గుర్తుచేసి, నువ్వు నీ ఫీల్డ్‌లో ఎలా పైకొచ్చావో, అలాగే వాడూ సినీ ఫీల్డ్‌లో పైకి రావా లని చెప్పకుండా నన్ను విసిగిస్తావా? " వాయించేసింది రాణి.

అనంత్‌కి నోట్లోంచి మాట రాలేదు.

"అదికాదు మమ్మీ! వారానికి ఒక్కరోజు ఫ్రీగా వదిలెయ్యండి. అప్పుడు మీరు అను కున్నది ఇంకా తొందరగా నెరవేరుతుంది. మెంటల్ హేపీనెస్‌తో ఫిజికల్ బాడీ డెవ



లవ్ అవుతుంది. చదువుకున్నవారు.. మీకు చెప్పాలా? " తేరుకుని అన్నాడు.

రాణీ ఆలోచించింది. అదీ చూద్దాం.

"సరే మూడు నెలలు చూస్తా. ఆది వారం వాడిష్టం. నేను కల్పించుకోను. ఆ తరువాత ఇంప్రూవ్‌మెంట్ లేకపోతే నా మాటే వినాలి"

మనసులో విసుక్కున్నాడు అనంత్. కన్నతల్లిని ఏమీ అనలేడు. మరొకరయితే, అంత నియంతలా మాట్లాడితే ఉతికేసేవాడే. 'అసలు తప్పంతా తండ్రిది. మొదట్లోనే కంట్రోల్ చెయ్యాల్సింది' అనుకున్నాడు.

"థ్యాంక్యూ మామ్!"

మూడు నెల్ల తర్వాత చూసుకోవచ్చు. ఇక నుంచీ ప్రతివారం తమ్ముడితో గడపాలనుకున్నాడు.

"అన్నా! నేను రెడీ" అంటూ ఆరింటికే అనంత్ గదికి వచ్చేశాడు నాండీ. అనంత్ ఇంకా లేవలేదు. గ్రౌండ్‌లో ఎనిమిదింటికి ఉండాలి. బద్ధకంగా కళ్లు తెరిచాడు.

సంతోషంగా వెలిగిపోతున్న తమ్ముడ్ని చూస్తే అనంత్‌కి ఇన్నాళ్లు తాను ఎంత తప్పు చేశాడో తెలిసింది. మల్లెపువ్వులాంటి పాంట్, టీషర్ట్, టక్ చేసి.. నల్లటి బెల్ట్ పెట్టుకుని, జుట్టుని క్రీమ్‌తో అణచి దువ్వి, కడిగిన ముత్యంలా ఉన్నాడు. అన్నింటి కంటే మొహంలో కనిపిస్తున్న ఉత్సాహం, నాండీని మరింత మెరిసేలా చేసింది.

నవ్వుతూ దగ్గరగా రమ్మని, నుదుటి మీద ముద్దిచ్చాడు.

"ఒక్క పది నిమిషాలు టైమియ్యి"

"సరే, నా గదిలో ఉంటా"

అనంత్ తయారై నాండీ గదిలోకి చూశాడు, లేట్ అవ్వడంతో నాండీ ఏమంటాడో అనుకుంటూ.

నాండీ, అనంత్ వచ్చింది కూడా గమనించకుండా ఏదో రాస్తున్నాడు, తన బల్ల దగ్గర కూర్చుని. అనంత్ వెళ్ళి, ఏం రాస్తున్నాడా అని వంగుని చూశాడు.

లెక్కలు.. గబగబా.. చుట్టుపక్కల ఎవరున్నారో, ఏం జరుగుతోందో గమనించకుండా లెక్కలు చేస్తున్నాడు.

అనంత్ కళ్లలో నీళ్లు తిరిగాయి. ఎంత సులభంగా చకచకా చేస్తున్నాడు. వీడిని చదువులో ప్రోత్సహిస్తే.. ఆలోచించడం కూడా అనవసరం.

వెనకాల ఊపిరి తీస్తున్న చప్పుడుకి లేచాడు నాండీ.

"అన్నా! ఎన్ని రోజులకి గదికొచ్చావ్? దా కూర్చో వచ్చే నెల నుంచి ఇంటర్ ఎగ్జామ్స్. ఖాళీ ఉన్నప్పుడు చదువుకుంటా"

అంటే పది నిమిషాలు కూడా ఖాళీనా? అనంత్ గది చుట్టూ పరికించాడు. ఎంతో శుభ్రంగా ఉంది. పదహారేళ్ళ ఇంటర్ చదివే కుర్రాడి గదిలా లేదు.

"ఆయా రోజూ వచ్చి క్లీన్ చేస్తుంది కదన్నా!" అనంత్ మొహంలో తృప్తిని గమనించి అన్నాడు నాండీ. అయితే మాత్రం.. ఎక్కడివక్కడ పడేసేవాళ్ళు ఎంతమంది లేరు. లెక్కల పుస్తకం, నోట్ బుక్, తనతో మాట్లాడుతూనే రేక్‌లో సర్దేశాడు, ఎంతవరకూ చేశాడో గుర్తు పెట్టి.

తమ్ముడ్ని చూస్తుంటే, అనంత్ హృదయం ఉప్పొంగింది. ప్రేమతో "పద.." అంటూ భుజం చుట్టూ చెయ్యి వేసి, కిందికి నడిచాడు.

★ ★ ★

"అన్నా! కమాన్. రన్.." నాండీ ఎగురుతూ అరుస్తున్నాడు.

అనంత్‌వాళ్ల టీమ్ బ్యాటింగ్ చేస్తున్నారు. చిన్నప్పుడు బాగా ఆడటంతో అనంత్‌కి పిచ్‌కి రాగానే తన గేమ్ వచ్చేసింది. అందులో ఆడేవాళ్ళు అంతా అప్పుడప్పుడే నేర్చుకుంటున్న వాళ్ళు.. పిల్లలు.

అనంత్ పార్ట్‌నర్ మరీ చిన్న కుర్రాడు. అయినా అతన్ని ప్రోత్సహిస్తూ అనంత్ నెమ్మదిగా అర్ధసెంచరీ కొట్టాడు.

నాండీ పట్టలేకపోయాడు. పిచ్‌లోకి దూసుకొచ్చి అన్నని గట్టిగా పట్టుకున్నాడు.

"ఎంత బాగా ఆడుతున్నావన్నా?"

నాండీ బ్యాటింగ్ వచ్చేవరకూ అనంత్ అడుతూనే ఉన్నాడు. అనంత్ పరుగులు చేస్తూనే ఉన్నాడు. తమ్ముడే బ్యాటింగ్ చేసేందుకు వీలు కలిగిస్తూ.

ఉత్సాహంతో నాండీ కూడా అర్ధసెంచరీ చెయ్యడం, అనంత్ టీమ్ గెలవడం ఒకేసారి అయింది.

నాండీ స్టామినాని, సమయస్ఫూర్తినీ ఆశ్చర్యంగా గమనించాడు అనంత్. పిల్లల అభిరుచిని చూడకుండా తల్లిదండ్రులు ఎంతలా వాళ్లని బాధపెడ్తున్నారో నాండీని చూస్తే తెలుస్తోంది అనంత్‌కి. ఎందుకలా మూర్ఖంగా ప్రవర్తిస్తారు? పేరెంట్స్‌కి కౌన్సిలింగ్ సెంటర్లు పెట్టాలేమో అనే ఆలోచన వచ్చి నవ్వుకున్నాడు.

"అన్నా! హేపీ?" అనంత్ మొహం దగ్గరగా వచ్చి అడిగాడు నాండీ. ఇంచుమించు అనంత్ ఎత్తే ఉన్నాడు.

"అవునురా!" నాండీకి హైఫై ఇచ్చి, వీపు మీద చరిచాడు. గట్టిగా తగిలింది. చాలా స్ట్రాంగ్‌గా ఉన్నాడు. ట్రైనర్ మహత్యం.

అంతా క్లబ్‌లోకి వెళ్ళి టీ, టిఫిన్లు కానిచ్చి ఇంటిదారి పట్టారు.

"చాలా బాగా గడిచిందిరా! ప్రతీ ఆదివారం వద్దాం" అనంత్ అన్నాడు కార్ డ్రైవ్ చేస్తూ.

నిజంగానా! మరి మమ్మా?" నాండీ

నిరుత్సాహంగా అన్నాడు.

అదిచూసి అనంత్ "ఇకనుంచీ ప్రతీ ఆదివారం మనదే. నేను కూడా ఆఫీస్ మాటే ఎత్తను" అన్నాడు.

"వావ్" అన్నాడు నాండీ. డ్రైవ్ చేస్తూనే అనంత్ వాడి తలని సర్ది, విజిల్ వేస్తూ శ్రీనాథ్ గురించి ఆలోచించసాగాడు.

★ ★ ★

"వినోద్! సునీతకి బాగాలేదట. కేర్‌లో అడ్మిట్ చేశారుట. నీ ఫ్రెండ్ డాక్టర్ మధుకి ఫోన్ చేద్దామా? అతను అక్కడే ఉన్నాడు కదా!" సుజాత గాభరాగా వచ్చింది హాస్పిటల్ నుంచి. ఆరోజు వినోద్‌కి ఆఫ్.

సుజాతా, వినోద్‌లు మూడేళ్ల క్రితం సౌదీ అరేబియా వెళ్ళారు. ఇంకో నెలలో వాళ్ళ అగ్రిమెంట్ అయిపోతుంది. ఇండియా వచ్చేస్తారు.

"ఏమయింది? " నిద్ర కళ్ళతోనే అడిగాడు.

"ఒక సంవత్సరం నుంచీ అది డిప్రెషన్‌లో ఉందని శ్రీనాథ్ చెప్తున్నాడు. నేను డాక్టర్ గౌరి దగ్గరికి తీసుకెళ్ళమన్నాను. మందులు వాడుతున్నారు. అయినా తగ్గట్లేదుట. జాబ్ మానేసింది కూడా"

"మరి నాకు చెప్పలేదే ఎప్పుడూ? " నిష్ఠూరంగా అన్నాడు, పైకి లేస్తూ.

"అంత ఎమర్జెన్సీ కాదులే అని ఊరుకున్నా. ఇప్పుడు చాలా ఎక్కువైనట్లుంది."

వినోద్, మధుకు డయల్ చేశాడు. కుశల ప్రశ్నలయ్యాక అసలు విషయం చెప్పాడు.

"భయపడాల్సిన పనేం లేదు. సునీతకు రక్తం చాలా తక్కువగా ఉంది. ఈరోజు డిశ్చార్జ్ చేసేశాం. శ్రీనాథ్ కేరళ తీసుకెళ్తానని అన్నాడు. నేను కూడా అదే మంచిదని చెప్పాను. అదీగాక.." అంటూ మధు చెబుతున్నదంతా సుజాత కూడా ఇంకొక ఫోన్‌లో విని గాఢంగా నిట్టూర్చింది.

"అమ్మా!" స్కూల్ నుంచి వచ్చిన నాలుగేళ్ళ స్వీటీ సుజాత ఒళ్ళో పడింది.

స్వీటీని దగ్గరికి తీసుకుని ఇంటి పనిలో పడింది సుజాత.

వినోద్, శ్రీనాథ్‌తో కూడా మాట్లాడాడు.

"సుజీ.. శ్రీనాథ్ చేస్తున్నదే బెటర్. ఆయుర్వేదం మందులు, మసాజ్‌లు, మంచి వాతావరణం, రొటీన్ నుంచి మార్పు.. ఇవన్నీ కూడా డిప్రెషన్‌ని తగ్గిస్తాయి. పైగా వేరే ఊరు వెళ్ళి అక్కడ ఇద్దరే ఉంటే, అసలు సమస్య మూలమేంటో కూడా తెలుస్తుంది. సరిగ్గా వాళ్ళు అక్కడ్నుంచి వచ్చే టైమ్‌కి మనం వెళ్తాం. ఆ తర్వాత మనం చూసుకోవచ్చు. సరైన సమయంలో ట్రీట్‌మెంట్ అందుతుంది"

## కొత్తగాలి...

**గాలి లేక నిప్పు**
**నిప్పు కాదు**
**జాలి లేని గుండె**
**గుండె కాదు**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

★ ★ ★

రాత్రంతా హాల్లో కుర్చీలో కూర్చుని, అలాగే నిద్రపోయాడు బాలయ్య. మధ్య మధ్యలో లేచి, తలుపు తీసి చూసి, నిట్టూరుస్తూ, కాసిని మంచినీళ్ళు తాగి కలత నిద్రలోకి జారుకున్నాడు.

పొద్దున్న లేచేసరికి ఒళ్ళంతా నొప్పులు, తల పైకెత్తి చూడలేనంత భారం. కాళ్ళూ చేతులూ లాగేస్తుంటే, ఒక చేత్తో ఇంకొక చెయ్యి నొక్కుకుంటూ పెరట్లోకి నడవబోయాడు, 'ఈ కుంభవృష్టి.. ఎప్పటికి తగ్గుతుందో? ' అనుకుంటూ. ఇంట్లోకి వెళ్ళి గొడుగు తెచ్చుకుని, బోర్ దగ్గరికి వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకున్నాడు.

శ్రీనాథ్ మోటారుతో ఇంట్లోకి నీళ్ళు వచ్చేలా చేసి, లోపలే బాత్రూం కట్టినా బాలయ్యకి పెరట్లోకి వెళ్తే కానీ తోచదు.

"కానీ బేటా జరిగినన్ని దినాలు ఇలాగే. చాత కాకుంటే అప్పుడే చూద్దాం" అంటాడు కొడుకు కోప్పడితే.

ఇంట్లోకి వచ్చీరాగానే కాఫీ అందించింది రేణుక. తను కూడా పెనిమిటినీ, వాననీ గమనిస్తూనే ఉంది.

చల్లని నీళ్ళతో మొహం కడుక్కోగానే సత్తువ వచ్చినట్లనిపించింది. వేడి వేడి కాఫీ ఒక్కో చుక్కా గొంతులో దిగుతుంటే, కాస్త నొప్పులు లాగేస్తున్నట్లు ఉంది.

రేణుక, తను కూడా కాఫీ తెచ్చుకుని బాలయ్య పక్కనే కుర్చీలో కూర్చుని మౌనంగా తాగుతోంది, మాటలే లేనట్లు. నిజానికి నోరు విప్పాలంటే బెదురు. బాలయ్యని ఓదార్చే శక్తి తనకి కూడా లేదు.

ఇద్దరూ ఒకర్నొకరు, చూపులతోనే సముదాయించుకుంటున్నారు.

అంతలో ఫోన్. బాలయ్య లేవబోతుంటే వారించి, ఫోన్ దగ్గరికి నడిచింది రేణుక.

"అమ్మా! నాయన ఎట్లున్నాడు? " ఆదుర్దాగా అడిగాడు శ్రీనాథ్. రేణుకకి ఎంతో సంతోషం వేసింది. ఇంత బాగా అరుచుకునే కొడుకు.

"ఫరవాలే బేటా! రాత్రి కొంచెం కూడ కునుకు తియ్యలేదనుకో. ఇప్పుడే లేచి కాఫీ తాగుతున్నం. కోడలు ఎట్లుంది? ఇంటికొచ్చేశారా? ఇక్కడికొచ్చెయ్యరాదు బేటా? "

"సునీతకు బాగుందమ్మా! ఏం భయం లేదు. రాత్రి వాన చూస్తే నాకే బెంగొచ్చింది. తోట గురించి నాన్న ఎంత బాధ పడుతున్నాడో అని చేస్తున్న"

"మాకేం గాదు. నువ్వు అమ్మాయిని చూసుకో. సెలవు పెట్టినవు కదా? " రేణుక బాలయ్యని చూసి నవ్వింది. ఫోన్ చూపిస్తూ. బాలయ్య లేచి, నెమ్మదిగా నడుస్తూ వచ్చాడు.

"చెప్పు శ్రీనాథ్. నాకేం బాగానే ఉన్నా. మీరేం చేస్తున్నరు? ఒక్కడివి ఏం అవస్థ పడుతున్నవో అనే మాకు.."

"మేము రెండు రోజుల్లో కేరళ వెళ్తున్నాం. అక్కడ్నుంచి అప్పుడప్పుడు ఫోన్ చేస్తుంటా. మీ ఆరోగ్యం జాగ్రత్త" మరికొంచెంసేపు యోగక్షేమాలు మాట్లాడి ఫోన్ పెట్టేశాడు శ్రీనాథ్.

శ్రీనాథ్ మాట్లాడగానే వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది బాలయ్యకి. హుషారుగా అన్నాడు, "పోన్లేవే. కాసిని ఆకులు, కాయలు రాల్తయి. అంతేగా! వాన తగ్గగానే వెళ్లి బాగు చేసుకోవచ్చు"

★ ★ ★

వానకి కిటికీ తలుపులు టకటకా కొట్టుకొంటుంటే శ్రీనాథ్ గడియపెట్టి వచ్చాడు.

సునీత ఒళ్ళు ఎరగకుండా నిద్రిస్తోంది.

డాక్టర్ చెప్పింది ఒకసారి మననం చేసుకున్నాడు, "చూడండి శ్రీనాథ్! సునీతకి అబార్షన్ అయింది..."

"ఏంటీ? నాకు తెలీదే! చెప్పకుండా దాచిందా? " షాక్ తిన్నట్లయింది శ్రీనాథ్‌కు.

"అసలు తనకే తెలీదు శ్రీనాథ్. జస్ట్ అప్పుడే ఫామ్ అయింది. దానివల్లే రక్తం తక్కువయ్యుండవచ్చు. మీరేం వర్రీ అవక్కర్లేదు. జాగ్రత్తగా చూసుకోవాలి"

"ఆమెకు పిల్లలు పుట్టటం లేదనే డిప్రెషన్ డాక్టర్. ఇప్పుడు ఇలా అయిందని తెలుస్తే ఏమవుతుందోనని భయంగా ఉంది" శ్రీనాథ్ ఆందోళనగా అన్నాడు.

"ఎన్ని రోజుల్నుంచీ? "

"మూడేళ్ల నుంచీ చూస్తోంది. టూ ఇయర్స్ బ్యాక్ అకస్మాత్తుగా ఉద్యోగం మానేసింది. మాకు ఎంత డబ్బు వస్తే అంతతో గడపడం అలవాటే కనుక నాకేం బాధ వెయ్యలేదు. ఖర్చు తగ్గించుకున్నాం. తనెప్పుడూ ఒంటరిగా కూర్చునేది. నాకు

ఇందాకే దానికి కారణం తెలిసింది. అదీ యాక్సిడెంటల్‌గా"

తను ప్రసవం గురించి చెప్తుంటే సునీత ఏడవడం గుర్తుకొచ్చింది.

డాక్టర్ కుతూహలంగా చూసింది.

"పెళ్ళైన వెంటనే మా అమ్మ 'జల్దీ పిల్లల్ని కనేయ్ బేటీ! ఆ గోలీలవీ వాడద్దు. ప్రాబ్లమ్స్ వస్తయ్యి' అని అందట. ఆవిడ పనిచేసిన ఇంట్లో దొరగారి భార్య డాక్టర్. అక్కడికొచ్చే కేసులు చూసేదిట. అదీకాక మా పిన్ని కూడా పిల్స్‌తో సఫర్ అయింది. సునీత పిల్స్ వాడడం మానేసిన సంవత్సరం వరకూ బాగానే ఉంది. అప్పట్నుంచీ, నెల నెలకీ డిప్రెషన్‌లోకి వెళ్ళిపోవడం ఎక్కువైందని ఈ మధ్యే గమనించాను. నిజం చెప్పాలంటే, ఇప్పుడు హాస్పిటల్‌కి వచ్చే ముందే, తనని మీరు ఎగ్జామిన్ చేస్తున్నప్పుడు ఆలోచిస్తుంటే తెలిసింది"

"ఓహ్! అదా సంగతి. మీ ప్రొఫెషన్‌లో ఇలా ఆలస్యమవడం కామన్. ఎప్పుడూ హడావుడి.. వర్క్ ప్రెషర్స్ ఎక్కువ. దానికి అంత బెంగ పెట్టుకునే పనేలేదు. నా దగ్గరికి తీసుకొస్తే కొన్ని పరీక్షలు చేసి ఎప్పుడో చెప్పేదాన్ని. ఇంటికి వెళ్ళేముందు కౌన్సిలింగ్ ఇస్తా. షి విల్ బి ఆల్రైట్"

"కానీ అబార్షన్ సంగతి తెలుస్తే బర్స్ట్ అయిపోతుందేమో. వెళ్ళేముందు మీరు అన్నీ టెస్ట్స్ చేస్తారా డాక్టర్?"

డాక్టర్ భరోసా ఇస్తున్నట్లుగా నవ్వింది.

"ఆ విషయం సునీతకి చెప్పనే వద్దు. ఇప్పుడు ఏ టెస్టులూ అక్కర్లేదు. ఈసారి గర్భం ధరించాక వెంటనే డాక్టర్‌కి చూపించుకుని, జాగ్రత్తగా ఉంటే సరిపోతుంది. ఆల్ ది బెస్ట్ శ్రీనాథ్!"

చిన్నగా మూలుగు వినిపించింది. శ్రీనాథ్ ఆలోచనల్లోంచి బైటపడి, సునీత దగ్గరికి వచ్చి నుదుటిమీద చెయ్యి వేశాడు. చల్లగానే ఉంది.

## 'చతుర'లో మొదటి నవల!



డా. మంథా భానుమతి

సాహిత్యంపట్ల చిన్నతనం నుంచి నాకున్న మక్కువ, ఆసక్తి జీవితంలో సెకండ్ ఇన్నింగ్స్‌లో రచనా వ్యాసంగాన్ని కొనసాగించేలా చేస్తున్నాయి. ప్రభుత్వ సిటీ కళాశాలలో రసాయన శాస్త్ర అధ్యాపకురాలిగా పనిచేసి, పదకొండేళ్ల క్రితం స్వచ్ఛంద పదవీ విరమణ చేశాను. సంగీత, సాహిత్యాలంటే నాకు మక్కువ ఎక్కువ. అలాగే దేశ, విదేశాల పర్యటనలన్నా ఆసక్తి. ఇప్పటి వరకూ పది నవలలు, పాతికకు పైగా కథానికలు రాశాను. అందులో కొన్ని బహుమతులు గెలుచుకుని, వివిధ పత్రికల్లో ప్రచురితమైనాయి. 'అనంత వాహిని' పేరుతో నా కథానికల సంపుటి వెలువడింది. 'చతుర'లో నా మొదటి నవల 'మాయపండు'. దీన్ని ప్రచురణకు స్వీకరించిన సంపాదకులకు కృతజ్ఞతలు.

చిరునామా :
డా. మంథా భానుమతి,
102, పిన్నకిల్ ప్రైడ్,
ఉమానగర్, బేగంపేట,
హైదరాబాద్-500016

సునీత కళ్ళు తెరిచి, పాపాయిలా నవ్వి, "కడుపులో నొప్పి శ్రీ!" గారంగా అంది.

"తగ్గిపోతుంది లేరా. నేనుండగా ఏ నొప్పులూ నిన్నేమీ చెయ్యలేవు. పడుకో"

డాక్టర్ ఇచ్చిన మాత్రలు మింగించి, బత్తాయి రసం తాగించాడు.

"నువ్వు భోం చేశావా శ్రీ? "

శ్రీనాథ్ హృదయం ద్రవించింది. 'ఇప్పుడు కూడా తనంటే ఎంత శ్రద్ధ? '

"పొద్దున్నే ఇడ్లీ తిన్నాను. మనిద్దరం కలిసి లంచ్ తిందాం"

"కొంచెం ఆగి" అంటూ కళ్ళు మూసుకు పోతుండగా వెనక్కి వాలింది సునీత.

శ్రీనాథ్ కూడా మంచంమీద వాలాడు.

'తనకి దొరికిన పెన్నిధి సునీత. అపురూపంగా చూసుకోవాలి. తనని పూర్వపు సునీతని చేయాలి. అవసరమైతే ఇంకోనెల సెలవు పొడిగిస్తా. జీతం నష్టం మీదైనా సరే!' అనుకున్నాడు సునీత ముంగురులు మృదువుగా సవరిస్తూ.

ఎంతో ఆశగా ఎదురు చూస్తే ఇంకా పిందె కూడా అవకుండానే చిదిమేశాడు ఆ దేముడు! ఎంత నిర్దయుడు?




**తె**ల్లవారుతూనే లేచిన బాలయ్యకి, పెరట్లోకి రాగానే ఉదయిస్తున్న సూర్యుడు స్వాగతం పలికాడు. రెండు రోజులుగా కురిసిన కుండపోత వాన వెలిసింది. ఆకాశంలో ఒక్క మబ్బు కూడా లేదు.

అణగిపోయిన చిన్న చెట్లన్నీ నెమ్మదిగా తలలెత్తి చూడడానికి ప్రయత్నం చేస్తున్నాయి. చెట్ల కొమ్మల్లో బలహీనంగా ఉన్న సపోటా, జామ కాయలు రాలిపోయాయి.

పాకలో బర్రెలు ఆనందంగా అరుస్తున్నాయి. అప్పుడే వచ్చిన పాలేరు దంపతులని చూసి. వాళ్ళిద్దరూ పాకని శుభ్రం చెయ్యడంలో మునిగిపోయారు.

బాలయ్య తొందర తొందరగా కొంత పెరడు శుభ్రంచేసి, పళ్ళు తోముకుని ఇంట్లోకి వెళ్ళాడు. స్నానం చేసేసి, 'నాస్తా తినెల్దామయ్యా' అని రేణుక అరుస్తున్నా వినకుండా, వెంటనే బట్టలు వేసుకుని తయారయ్యాడు.

చేసేదేంలేక రేణుక వచ్చింది, కాఫీ గ్లాసులు పట్టుకుని. తను ఎప్పుడో స్నానం చేసేసి తయారుగా ఉంది.

"నాకు తెలుసయ్యా. నువ్వొక్క నిముషం కూడా ఆగలేవని. అందుకనే, జొన్నరొట్టెలు, పప్పు కూడా చేసి టిఫిన్‌లో సర్దేశా" నవ్వుతూ అంటున్న భార్యని అభిమానంగా చూశాడు బాలయ్య.

ఇద్దరూ ఇంటిబైటికి వచ్చి, అక్కడే ఉన్న ఆటో ఎక్కారు. ఇంటి పక్కనే ఉన్న ఒక బ్బాయి ఆటో నడుపుతాడు. అదో అదృష్టం. రోజూలాగ నడిచే పనికాదు. ఎంత జల్దీ వెళ్ళి తోటలో వాలిపోదామా అని ఉంది ఇద్దరికీ.

తోట లోపలికి ఉరికారు ఇద్దరూ.

తియ్యడానికి గేటు లేదు. ఎప్పుడో బందులు ఊడిపోయి, రెండు రెక్కలు ఒక దానిమీద ఒకటి పడి ఉన్నాయి. ఇంక లోపల బీభత్సంగా ఉంది. అది చూస్తూనే బాలయ్య గోడని ఆనుకుని, నుంచుండిపోయాడు.. మాటలు, చేష్టలు దక్కి.

రేణుక పెనిమిటి దగ్గరగా వెళ్ళి, బాలయ్య భుజంమీద తలవాల్చింది. ఇద్దరి

కళ్ళలోంచి ధారగా నీళ్లు కారిపోతున్నాయి.

తోటలో చెట్లు నిలువుగా లేవు. కొన్ని మొదలువరకు విరిగిపోయాయి. నేలమీద ఆకులు, కాయలు.. గుట్టలు గుట్టలుగా పడి నీళ్లలో తేలుతున్నాయి.

తోట మొత్తం సర్వనాశనమైపోయింది. చుట్టుపక్కల అన్ని తోటలూ అంతే.

బాలయ్య ఏమయిపోతాడోనని భయం వేసింది రేణుకకి. 'తోట సంగతి తర్వాత. శ్రీనాథుని రమ్మందామా!' అనుకుంది. కాని తనే కష్టాల్లో ఉన్నాడు. వాళ్ళనెందుకు పరేషాన్ చెయ్యడం! కోడలు మంచిగుంటే చాలు. ఇంక ఆడపిల్లలు.. చక్కగా కాపు రాలు చేసుకుంటున్నారు. రమ్మంటే పరుగె త్తుకుని వస్తారు కానీ.. తప్పదు.. తనొ క్కతే భరాయించుకోవాలి. ఎట్లా, ఏమని సముదాయించాలి? ఏం మిగిలిందనీ? సొంత బిడ్డల్లెక్క చూసుకున్నాడు వాటిని తన భర్త. ఇప్పుడు ఏ మొక్కకి ఏం పేరో కూడా తెలియట్లేదు.

ఆశ్చర్యం! ముందుగా బాలయ్యే తేరుకు ని, "పద పోదాం. ఇక్కడుండి చేసేదేం లేదు. నీళ్ళన్నీ తీసేసినాక వద్దాం" అంటూ రేణుక చెయ్యి పట్టుకుని నడిపించాడు.

ఇద్దరూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళి పోయారు, ఒకళ్ళ చెయ్యి ఒకళ్ళు పట్టు కుని. రోడ్డుమీద అప్పుడప్పుడే వాహనాలు కదుల్తున్నాయి. కళ్ళు మసకలుగా ఉన్నాయి ఇద్దరికీ. నెమ్మదిగా, కాళ్ళలో శక్తి అంతా పోగా.. అటూ ఇటూ చూడకుండా నడుస్తున్నారు. పక్కనే ఒక కారు వచ్చి ఆగింది.

"అమ్మా! నాయనా!"

"అరే.. శ్రీనాథు! బేటా!" అంటూ ఒక్క సారి, రెండ్రోజులుగా కురిసిన వానలా రోదించారు. శ్రీనాథ్ ఇద్దర్నీ కారులోకి ఎక్కించి, తను కూడా వెనుక సీట్లో కూర్చుని, తల్లిదండ్రుల చేతులు పట్టుకుని నిమురుతూ.. స్వాంతన ఇవ్వడానికి ప్రయత్నం చేశాడు.

ఉద్ధృతి తగ్గాక, కళ్ళు తుడుచుకుని అడి గింది రేణుక, "సునీత ఎట్లుంది బేటా!"

"తనూ వచ్చిందమ్మా. ఇంట్లో దించి వచ్చా. మీరెట్లున్నారో అని వచ్చేశాం"

'అరే.. జబ్బు పిల్లని తోలుకొచ్చావా! జల్దీ పద. ఇంటికెళ్దాం"

వారి రాకతో బాలయ్య, రేణుకలిద్దరికీ బాధంతా చేత్తో తీసేసినట్లయిపోయింది.

★ ★ ★

సునీతని చూడగానే రేణుక దగ్గరికి తీసుకుని తల నిమిరింది. తన దుఃఖం మర్చిపోయింది. బాలయ్య కూడా కొడుకు కోడల్ని చూసిన ఆనందంలో కండువాతో కళ్ళు వత్తుకుంటూ కూర్చున్నాడు.

సునీత పక్కన కూర్చుని బాలయ్య చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకుంటూ "మామయ్యా! ఎట్లున్నారు? మొక్కల గురించి బాధపడ్తున్నారా? మళ్ళీ మంచిగా వస్తాయి" అంది.

"అదేం కాదు తల్లీ. మిమ్మల్ని చూసిన ఆనందంలో ఒళ్ళు తెల్వలే. ఎట్లున్న వమ్మా? ఆరోగ్యం జాగ్రత్త తల్లీ. నువ్వు చక్కగుంటేనే మేం కూడా హుషారౌతం" పుల్లల్లా ఉన్న సునీత చేతులు చూస్తూ అన్నాడు. అతను ఎప్పుడూ నేరుగా కోడలి మొహంలోకి చూసింది లేదు.

"నేనూ కోలుకుంటున్నాను మామయ్యా! మీ అబ్బాయి చాలా బాగా చూసుకుంటు న్నారు. కొద్ది రోజుల్లోనే మామూలు సునీ తనవుతా" నవ్వుతూ అంది.

తర్వాత రేణుకని చూసి, "అత్తమ్మా! ఆకలేస్తోంది. ఏం పెడ్తావు? " చిన్న పిల్లలా నవ్వుతూ అడిగింది. సునీత రెండు రోజుల్లోనే బాగా తేరుకుంది. శ్రీనాథ్ అనుక్షణం కనిపెట్టి ఉంటున్నాడు.

'డిప్రెషన్‌లో ఆత్మహత్య చేసుకోవాలనే

కోరిక వెంటాడుతూ ఉంటుంది. 'కాచుకో వాలి' డాక్టర్ వెనక్కి పిల్చి చెప్పినప్పుడు శ్రీనాథ్ గుండె దడదడా కొట్టుకుంది.

ఎప్పుడూ ఒంటరిగా వదలవద్దని చెప్పింది. అందుకనే నీరసంగా ఉన్నా తనని కూడా వెంట తీసుకొచ్చాడు. పైగా సునీతే వాన తగ్గాక వెళ్దామని అడిగింది. శ్రీనాథ్‌కి సంతోషం వేసింది, భార్య తన తల్లిదండ్రుల గురించి అడగడంతో.

"చెప్పు బేటా! నీకు ఏది కావాలంటే అదే. ముందు బూస్ట్ తెస్తా, తాగి మాట్లా డుకుందాం" రేణుక వంటింట్లోకి వెళ్ళింది.

సునీత తమ గదిలోకి వెళ్ళి మంచం మీద పడుకుంది. వెనుకే వెళ్ళిన శ్రీనాథ్ ఫ్యాన్ వేశాడు.

గదంతా చీకటి. ఫ్యాన్ తిరుగుతుంటే వేడిగాలి వస్తోంది. వాన తగ్గగానే సూర్యుడు తన ప్రతాపం చూపిస్తున్నాడు. శ్రీనాథ్ కిటికీ తలుపులు తీశాడు.

"గాలికి తపతపా కొట్టుకుంటున్నయ్యని మూశాం. ఇప్పుడంతా చక్కగా ఉంది" రేణుక పెద్ద స్టీల్ గ్లాసుల నిండా నురుగు పాలతో బూస్ట్ కలిపి, ఇద్దరికీ ఇచ్చింది.

"ఏం తల్లీ.. ఎట్లుంది? " అడిగింది కోడ లిని రేణుక.

"చాలా బాగుందత్తమ్మా! బియ్యం రవ్వ ఉందా? రవ్వ పులిహోర చెయ్యగలరా? " సునీత అడిగిన వెంటనే, ఇంకా మాట పూర్తి కాకుండానే జవాబు వచ్చింది.

"రవ్వకేం లోటు తల్లీ! పది నిముషాల్లో చేసేస్తా. నువ్వు కొంచెంసేపు నిద్రపో"

రేణుక గదిలోంచి వెళ్ళకుండానే సునీ తకి నిద్ర ముంచుకొచ్చింది, చిక్కని పాలతో బూస్ట్ తాగగానే. శ్రీనాథ్ కూడా ఆమె పక్కనే ఆదమరచి నిద్రపోయాడు. హాల్లో బాలయ్య, చాపేసుకుని గుర్రు పెట్టాడు. ముగ్గుర్నీ మధ్య మధ్యలో చూస్తూ, రేణుక రవ్వ పులిహోర, కొబ్బరి పెరుగుపచ్చడి చేసింది. ఆవిడకి కడుపు నిండిపోయింది. నిద్రపోతున్న వాళ్ళు పసి పిల్లల్లా అనిపించారు. కంటిమీద కునుకు రాలేదు. అలా అని అలసటగాను లేదు.

★ ★ ★

"అయ్యా! తోటలో నీల్లు తీసేసాయండి. కూలీల్ని పిల్చుకురమ్మంటారా? " పాలేరు పొద్దెక్కకుండానే అరుస్తూ వచ్చాడు.

బాలయ్య ముందే లేచి తయారుగా కూర్చున్నాడు, నిన్నటి ఎండకి ఎండిపో వాలే అనుకుంటూ. రేణుక మాత్రం గేటు దగ్గరికి వచ్చి కోపంగా చూసి, పెదవుల మీద వేలు పెట్టింది, హుష్ అంటూ.

"కొడుకు, కోడలు నిద్దర లేవలే. నెమ్మది. మీరిద్దరూ వెళ్ళండి. నేను కొంచెం ఆగివస్తా" అంటున్న రేణుక చేతి లోంచి కాఫీ అందుకుని తాగేసి, వెళ్ళిపో యాడు బాలయ్య.

శ్రీనాథ్, సునీత రాత్రి ఉండిపోయారు. వాళ్ళకోసం ఒక గది ఉంటుంది ఎప్పుడూ. ఆడపిల్లలు వచ్చినా దాన్ని వాడరు. చిన్నవే అయినా మూడు గదులున్నాయి. అవికాక హాలు, వంటిల్లు. సామాన్లు ఎక్కువ లేక పోవడంతో విశాలంగానే అనిపిస్తుంది.

కోడలి కలుపుగోలుతనానికి మురిసిపో తుంది రేణుక. 'నీరసంగా ఉన్నావు వద్దమ్మా' అని వారించినా వినదు.

రాత్రి ఆలుఫ్రై, వెల్లిపాయ పప్పుచారు చేసింది సునీత. అన్నం ఒక్కటే తను వార్చింది. ఎంత రుచిగా ఉన్నాయో! పెద్దింటి బిడ్డ అని అస్సలు గర్వంలేదు. అంతా తమ అదృష్టమే!

ఇప్పుడు పైసలు చాలానే మిగులుతు న్నయ్. కూరా, నార, పాలు కొనుక్కోనక్క ర్లేదు. పండ్లా కొల్లలు. ఇంక కర్చేముం టుంది. శ్రీనాథు ఏదైనా అడక్కుండానే గ్రహించి అమరుస్తాడు. ఇప్పుడు తోటకి ఎంత పెట్టుబడి పెట్టాలో! తనకెందుకు

ఫికర్. కొడుకు చూసుకుంటాడు.

"అత్తమ్మా!" సునీత పిలుపు విని ఆలో చన్లు మాని ఇంట్లోకెళ్ళింది రేణుక. నిన్న టిమీద గొంతు కొంచెం లేచింది.

"లేచావా బంగారూ! బూస్ట్.." అంది.

"అమ్మో వద్దు. కాఫీ తాగుతా. మన బర్రె పాలతో చాలా బాగుంటుంది. శ్రీనా థ్‌కీ కలిపెయ్యండి, బాత్రూంలో ఉన్నారు"

రేణుక హుషారుగా లోపలికి వెళ్ళింది.

★ ★ ★

"మామయ్యా! మీరేనా?" ఆశ్చర్యంగా చూసింది సునీత.

నిన్న అంత దుఃఖంతో ఉండిన బాలయ్య, నలుగురు కూలీల్ని పెట్టి తోటంతా బాగు చేయిస్తున్నాడు. మొహం తేటగా ఉంది. అందర్నీ హుషారు చేస్తూ, పంచె పైకి ఎగకట్టి తను కూడా చెయ్యి వేస్తున్నాడు.

"అబ్బో! మా తల్లి ఇక్కడికే వచ్చేసిందే. ఇటువంటివి రైతులకి అలవాటేనమ్మా! కాస్సేపు బాధపడ్తాం. మళ్లీ మొదలు చెయ్యాల. లేకుంటే జీవితం ఆగిపోదూ!"

అంత నీరసంగా ఉండి సునీత ఎందుకొ చ్చిందని ఒక్క మాటా అనలేదతను. తిరు గుతూ, నలుగుర్లో ఉంటేనే ఏ జబ్బయినా నయమవుతుందని అతని నమ్మకం.

సునీతకి వీళ్ల పద్ధతులు అందుకే నచ్చు తాయి. ఎవర్నీ, దేనికీ బలవంత పెట్టరు. మంచేదో, చెడేదో చెప్పి ఊరుకుంటారంతే!

దారిలో అన్నీ చూసుకుంటూ, షెడ్ దగ్గ రకి వెళ్ళారు శ్రీనాథ్, సునీత. మొదలు బాలయ్య చేయించిన పని అదే. నడిచే దారులన్నీ తుక్కులు, చెత్తా తీయించి బాగు చేయించాడు.

కొడుక్కీ, కోడలికీ కుర్చీలు బైట వేయించి కూర్చోమన్నాడు బాలయ్య. పాలేరు కొబ్బ రిబొండాలు కొట్టి తీసుకొచ్చాడు. తోట వెనుక భాగంలో కొంత తేమభూమి ఉంది. అక్కడ ఆరు కొబ్బరి చెట్లు వేశారు

## ఆహార-శాస్త్రంపై గ్రంథం!

వృద్ధాప్యంలో అస్వస్థత కారణంగా అప్పారా వుగారిని చలిగాలి బాగా బాధిస్తోంది. ఆయన గదిలోనికి ఎండపొడ సోకుతూండటంతో దుస్తులన్నీ తీసివేసి, లాల్చీతో కూర్చున్నారు. కొడుకును పిలిచి కాస్తంతఉష్ణం కోసం 'కొంచెం కోకోవైన్, దంపిన తాంబూలం తెచ్చిపెట్టు బాబూ!' అన్నారు.



తాంబూలం చప్పరిస్తూ అప్పారావుగారు తన చేయిపట్టుకుని నాడిని పరీక్షిస్తున్న వైద్యు డితో 'ఈ స్థితిలో వీటిని వేసుకోవచ్చునో, వేసు కోగూడదో నేను బతికుంటే ఆహారశాస్త్రం మీద ఒక గ్రంథం రాస్తాను డాక్టరుగారూ!' అని చిరు నవ్వు నవ్వారు. ఇదే ఆయన ఆఖరి దరహాసం.

చివరిశ్వాస వరకు అప్పారావుగారు హాస్య ప్రియత్వాన్ని, రచనా వ్యాసంగాన్ని విడిచిపెట్ట లేదని ఈ సంఘటన తేటతెల్లం చేస్తోంది.

వాటికీ బోర్ నుంచి నీళ్ళు వెళ్తుంటాయి.

"మన చెట్టువేనయ్యా! గాలివానకి రాలి పోయాయి. అందుట్లో మంచివి తీశాను" పాలేరు ఇంకోబొండం అందిస్తూ అన్నాడు.

చల్లని బొండం నీళ్ళు తాగుతుంటేనే సునీతకి ప్రాణం లేచొచ్చినట్లయింది.

"తల్లీ, నీళ్లు మంచిగున్నయ్యా!" బాలయ్య, పంచ మామూలుగా కట్టి వచ్చాడు. ఒక వంతు తోట పని అయింది. ఇంకా ఐదారు రోజులు చేస్తే కానీ ఒక షేపుకి రాదు తోట.

షెడ్ ముందున్న గున్నమామిడి

మాత్రం స్థిరంగా ఉంది. అది పునాస కాపు చెట్టవడంతో కాయలు రాలే పని లేదు. కొమ్మలు, ఆకులు గుత్తంగా దగ్గరగా ఉంటాయి. కొమ్మలు పొట్టివి. అందుకనే కొన్నే విరిగి చెట్టుకి వేళ్ళాడుతున్నాయి.

"అంత గాలి వానకి తట్టుకుని నిలబడింది చూడమ్మా.. అందుకే ఇది మాలచ్మి" సునీత దాన్నే చూస్తుంటే బాలయ్య అన్నాడు.

"నాన్నా! తోటని ఇన్స్యూర్ చేశాను. వాళ్ళ ఇన్‌స్పెక్టర్ వచ్చి ఎన్ని పైసలొ స్తయ్యో లెక్కకట్టి రాసిస్తాడు. మనం వెళ్ళి తెచ్చుకోడమే. ఖర్చుకి వెనుకాడకుండా పని చేయించు. ఇంకా పదిమందిని పెట్టచ్చు"

"నిజమా! చేతి కందొచ్చిన కాయ పొయ్యిందే, పైసలు నష్టమే అనుకుం టున్నా. చల్లని మాట చెప్పావు" అప్పుడే వచ్చిన రేణుక సంబరంగా అంది.

"అదెప్పుడూ చేస్తుంటా. ఇప్పుడు అవ సరం పడింది" శ్రీనాథ్, సునీతనే చూస్తూ అన్నాడు. 'రెండురోజుల్లోనే చాలా మార్పు వచ్చింది. మనుషుల మధ్యలో ఉండాల నేమో ఈ అమ్మాయికి' అనుకున్నాడు.

"మళ్ళీ కొత్త తోట వచ్చేస్తుందా అత్తమ్మా!"

"అదేనమ్మా నేననేది. పిందె రాలిపో యిందని బాధపడతామా? అది ఇంకో నాలుగు పిందెలు రావటానికే అనుకో వాలి. మనుషులకైనా, చెట్లకైనా, సృష్టిలో దేనికైనా అంతం తప్పదు. అయితే అది మరో ఆరంభానికి నాంది" ఏ విద్యావంతు లకీ తీసిపోని తత్వాన్ని చెప్పింది రేణుక.

తోట బాగు చెయ్యడానికి వారం పట్టింది. బాలయ్య పగలంతా అక్కడ్నే ఉండి చూసుకున్నాడు. శ్రీనాథ్, సునీత కొ ట్టయికల్ చేరినట్లు ఫోన్ చేశారు.

టికెట్లు దొరక్కపోవడంతో, నాలుగు రోజులు ఆలస్యమైంది వారి ప్రయాణం. రేపు వెళ్తామనగా, వాళ్ళ ఫ్లాట్‌కి వెళ్ళి, బట్టలు అవీ సర్దుకుని వెళ్లారు.

రేణుక బోలెడు తినుబండారాలు కట్టి ఇచ్చింది. అన్నే జాగ్రత్తలు కూడా చెప్పింది. వాళ్ళు వెళ్లే రోజున సురేష్, శాంత వచ్చి వీడ్కోలు చెప్పారు. అలాగే బాలయ్య, రేణుకలతో వెళ్ళారు, 'రెండు రోజులుండిపోదురు రండి వదినమ్మా' అని రేణుక పిలవడంతో.

మర్నాడు తోటకి వెళ్ళిన సురేష్‌కి కళ్ళు తిరిగినట్లయింది. గుట్టల, గుట్టల మామిడి రాశులు. ఒక్కొక్క గుట్ట ఒక్కొక్క సైజు.

ఆకులన్నీ పెద్ద గొయ్యి తవ్వి అందులో కప్పేశారు. ఇంకా మిగిలినవి, లారీతో పంపేశారు. ఇన్స్యూరెన్స్‌వాళ్లు, మూడు వంతులు పైగా ఖర్చులు ఇచ్చారు.

"ఈ మామిడి కాయలన్నీ ఏం చేస్తారు బావగారూ?" సురేష్ ప్రశ్నకి అయోమ యంగా చూశాడు బాలయ్య.

"అదే నాకర్థమవట్లేదు. మామూలుగా అయితే కోసేవాళ్ళు తోట చూసుకుని, ముదిరినప్పుడు వచ్చి తీస్కెళ్తారు. ఇంత లేత కాయల్ని ఏం చెయ్యాలో? పెద్దగా డామేజి కూడా అవలేదు.. చెట్టుమీదున్న ప్పుడే కాదు, కింద పడినప్పుడు కూడా వీ టిని ఆకులు కొమ్మలు కాపాడాయి. అన్నీ పడెయ్యడమేనా?" బాలయ్య దిగాలుగా

## కొత్తగాలి...

**అవును!**
**వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు**
**రాజకీయం.. అవినీతి**

– ప్రభాకర్ తల్లాప్రగడ,
హైదరాబాద్

కూర్చున్నాడు, గుట్టల్ని చూస్తూ.

అంతలో తోట ముందు కారొకటి వచ్చి ఆగింది, కీచుమంటూ. అందులో నుంచి దిగాడు, ఎప్పుడూ బాలయ్యా దగ్గిర కాయలు కొనే కాంట్రాక్టర్.

"ఆయియే సాబ్! అన్నీ ముందుగాల్నే రాలిపోయినయ్. ఈసారికి సేల్ లేనట్లే"

"అదే చెప్దామని వచ్చిన బాలయ్యా! ఏదో ధర చెప్పు. అన్నీ నేనే తీస్కుంట"

బాలయ్య నమ్మలేనట్లు సంభ్రమంగా "ఇసుమంటి కాయల్నేం చేసుకుంటరు? " అన్నాడు.

"కోల్డ్ స్టోరేజ్ కట్టినలే బాలయ్య. అందులో పెడ్తా"

"మరి అందుట్లో ముదురుతయ్యా.." బాలయ్యకి నమ్మకం కుదరట్లేదు.

"అవ్వన్నీ నీకెందుకు భాయ్. అమ్ముతవా లేదా చెప్పు. ధర అయితే ఎప్పటి దాంట్ల సగం ఇస్త. ఇష్టమైతే ఇప్పుడే లారీ తోలిస్త" కాంట్రాక్టర్ వెనక్కి తిరిగాడు వెళ్ళడానికి. బోలెడు కాయ.. అన్ని తోటల్లోనూ. ఎప్పుడూ ఇచ్చేటోడు, చిన్న రైతు అని ఇక్కడికొచ్చాడు.

"సర్లే సాబ్. అట్లనే ఇయ్యండి"

అసలు రాదనుకుంటే సగం వచ్చింది. నయమే కదా!

సురేష్, ఆశ్చర్యంగా చూస్తున్నాడు బేరసారాల్ని.

"ఏందో కలికాలం. ఊరగాయక్కూడా పనికిరావు. ఏం చేసుకుంటరో..." ఇంటికెళ్ళే వరకూ బాలయ్య గొణుకుతూనే ఉన్నాడు.

★ ★ ★

సుజాతా, వినోద్‌లకి పెద్ద సమస్య వచ్చి పడింది. తలలు పట్టుకుని కూర్చున్నారు.

ఒక నెల, ఇరవై ఎనిమిది రోజులు.. అంటూ ఇండియా వెళ్ళడానికి లెక్కపెడుతున్న వాళ్ళకి, ఇంకొక రెండు సంవత్సరాలు ఉండమని ఆఫర్ వచ్చింది. పైగా జీతం మూడో వంతు పెంచుతామన్నారు.

సుజాత ఉత్సాహమంతా నీరు కారినట్లయిపోయింది.

"ఇంకా ఎన్నాళ్ళు, ఈ జైలు జీవితం? నాకిష్టం లేదు. వదిలేసి వెళ్ళిపోదాం. సంపాదించింది చాలు"

"ఒక్కసారి ఆలోచించు సుజ్జీ! ఈ ఆఫర్ ఒప్పుకుంటే, ఇండియా వెళ్ళాక మనం కాలు మీద కాలేసుకుని కూర్చోవచ్చు. హాస్పిటల్స్‌కి మనమే శాలరీ డిక్టేట్ చెయ్యొచ్చు"

"నేను మాత్రం ఉండను. కావాలంటే నువ్వుండు. నేను ఒక్కదాన్నీ స్వీటీని ఎలాగో మానేజ్ చేస్తాను" సుజాత మొరాయించింది.

"అదెలా కుదురుతుంది? మనిద్దరికీ కలిపి ఇచ్చారు ఆఫర్. ఒకళ్ళే ఉంటామని అంటే ఒప్పుకోరు. అదీకాక, నేను మిమ్మల్ని వదిలి ఉండగలనా? "

"అయితే అందరం వెళ్ళిపోదాం"

మళ్ళీ మొదటికొచ్చింది వ్యవహారం.

"అబ్బాబ్బా! ఎంత చెప్పినా వినిపించుకోవేంటి? అంతా నీ ఇష్టమేనా!" వినోద్ కోపంగా అరిచాడు.

సుజాత కళ్ళు మూసుకుని నిగ్రహించుకుంది. ఇద్దరూ అరవడం మొదలుపెడ్తే సమస్య ఇంకొంచెం క్లిష్టమవుతుంది.

అప్పటికి ఊరుకుని మర్నాడు రాత్రి భోజనాలయ్యాక మొదలుపెట్టింది.

"వినూ! మనిద్దరి పేరెంట్స్‌కీ వయసులు ఎంత? "

"మావాళ్ళు సెవెంటీస్‌లో, మీ వాళ్ళు సిక్స్టీస్‌లో ఉన్నారు" ఏదో ట్రాప్ వేస్తోంది అనుకుంటూ అన్నాడు.

"మనల్ని మెడిసిన్ ఎటువంటి ఆశల్తో చదివించారు? చదవించడానికి వాళ్ళు ఎంత కష్టపడ్డారు? ముఖ్యంగా మీ

పేరెంట్స్.."

వినోద్ ఏమీ మాట్లాడలేదు. ఏమంటాడు? తండ్రి ప్రైవేట్ ఉద్యోగం వినోద్ మెడిసిన్ మూడో సంవత్సరంలో ఉండగా పోయింది. రెండు పార్ట్‌టైమ్ ఉద్యోగాలు చేసి సంసారాన్ని నడిపాడాయన. అందులో ముగ్గురు పిల్లలు ఒకేసారి పెద్ద చదువులకి వచ్చారు. మిగిలిన ఇద్దరూ అమ్మాయిలు. వాళ్ళు డిగ్రీ అవగానే చిన్న చిన్న ఉద్యోగాల్లో చేరిపోయారు. తన చదువుకోసం ఇంటిల్లపాదీ కష్టపడ్డారు.

"నువ్వు ఏమాలోచిస్తున్నావో నాకు తెలుసు వినూ. వాళ్ళ రుణం తీరేది కాదనుకో. అందుకే కొంతయినా ఈ వయసులో వాళ్ళకి సేవచేసి మన బాధ్యత మనం నెరవేర్చాలి.

అలాగే మా పేరెంట్స్. మా అమ్మ కీళ్ళ నొప్పులతో నేను ఎప్పుడు వస్తానా, రోజూ రాకపోయినా కనీసం ఫోన్‌లో పలకరించి, ఏవయినా మందులు చెప్తానని చూస్తోంది. మనం డాక్టర్స్‌ని సజెస్ట్ చెయ్యొచ్చనుకో.. కానీ వాళ్ళు కన్నపిల్లలతో సమానం కాదు కదా!" పావుగంట మాట్లాడి సుజాత లోపలికి వెళ్ళి పడుక్కుంది. వినోద్ ఏమయినా నిర్ణయించనీ.. తను అతనితోనే ఉంటుంది. ఇద్దరూ వేర్వేరుగా ఉండే ప్రసక్తే లేదు.

పొద్దున్నే వినోద్ కాఫీ పెడ్తుంటే లేచి వంటింట్లోకెళ్ళింది. ఆరోజు అతనికి ఆఫ్.

"గుడ్ మార్నింగ్ సుజ్జీ! ఇండియా షాపింగ్ లిస్ట్ రాయి. ఇవేళ నేను కొంత చేస్తాను, మాల్‌కి వెళ్ళి.

"మై స్వీట్ బేబీ.." ఎగిరి, అతని బుగ్గ మీద ముద్దు పెట్టింది సుజాత, మెరుస్తున్న కళ్ళతో.

★ ★ ★

చెన్నై ఎక్స్‌ప్రెస్, ఫస్ట్ ఏసీ, కూపే కంపార్ట్‌మెంట్‌లో..

సామానంతా సర్ది, సునీత పక్కన కూర్చున్నాడు శ్రీనాథ్. అంత వరకూ పడ్డ శ్రమ.. టెన్షన్‌తో చాలా అలసిపోయాడ తాను. భౌతికంగా, మానసికంగా కూడా.

సునీతని రక్షించుకో గలుగుతాడా!

బాగా ఉన్నట్లే నమ్మిస్తారు.. కానీ ఎప్పుడేం చేస్తారో ఊహించలేం.. అంటూ ఉదాహరణలు చెప్పారు డాక్టర్. అసలు ఈ డిప్రెషన్ ఎందుకొస్తుందో! చిన్న మెదడులో ఏదో కెమికల్ ఏర్పడుతుందట. అది ఆడిస్తుందట. ఏమిటో ఈ జీవితాలు? ఎవరు ఎవర్ని ఆడిస్తారు? భగవంతుడనే వాడు ఉంటే.. ఆయన ఆడిస్తూ వినోదిస్తుంటాడుట.

నిస్త్రాణగా వెనక్కి వాలాడు శ్రీనాథ్. అన్నిరోజుల అలసత్వం అప్పుడు బయటికి వచ్చింది. దిండు సర్దుకుని కాళ్ళు ముడుచుకుని అడ్డంగా కూర్చున్నాడు.

సునీత కిటికీ దగ్గిర కూర్చుని, గ్లాస్‌లో నుంచి కనిపించినంత వరకూ చూస్తోంది. ఇప్పుడు కొంచెం ఫరవాలేదు. కళ్ళలో జీవం వచ్చింది. అన్నింట్లోనూ ఆసక్తి చూపిస్తోంది.

రైలు కదిలిందని.. ప్లాట్‌ఫాం వెనక్కి వెళ్ళిపోవడంతో తెలుస్తోంది.

'ఫస్ట్ ఏసీలో అంత కుదుపు ఉండదంటారు నిజమే' అనుకున్నాడు శ్రీనాథ్.

### కొత్తగాలి... 

**పూచే గులాబీలు**
**రాలిపోతాయి!**
**గుచ్చే ముళ్లేమో**
**మిగిలే ఉంటాయి!!**

*– జంపన తులసీబృంద, హైదరాబాద్*

# ప్రేమంటే ఇదేనేమో?




ఇంగ్లండ్‌లో ట్రక్ డ్రైవర్‌గా పనిచేసే గేరి 21 ఏళ్ల ఎమ్మాను ప్రేమించాడు. మరోవైపు గేరి సోదరుడు ఎమ్మా కవలసోదరి లోరాతో డేటింగ్ చేసాడు. అయితే గేరికి మాత్రం తను డేటింగ్ చేసే ఎమ్మా కవలసోదరి మీదే మన సుంది. కాని తన సోదరుడు బాధపడవచ్చని ఆ సంగతి బయటికి చెప్పలేదు. చివరికి ఎమ్మాను గేరి వివాహం చేసుకున్నాడు. కానీ లోరా, గేరి సోదరుడు విడిపోయారు.



దాంతో గేరి తన మనసు లోని భావాలన్నిటినీ లోరాకు చెప్పాడు. తాను వివాహం చేసుకోవాలనుకున్నది ఎమ్మాని కాదని ఆమెనేనని కన్నీళ్ళ పర్యంతమయ్యాడు. దీంతో లోరాలో స్పందన కలిగింది. వివాహమైన మూడు వారాలకే ఎమ్మానుంచి గేరి విడాకులు కోరుకున్నాడు! గేరి, లోరాలు ఓ హోటల్‌లో ఎమ్మా కంటపడటంతో ఆమెకి అసలు కారణం తెలిసింది. ఎమ్మా తన సోదరి లోరాతో పోట్లాడింది. కొన్ని వారాలు వారిద్దరూ పరస్పరం మాట్లాడుకోలేదు.

ఆ కవలపిల్లల తల్లి దండ్రులు గేరిని, లోరాని తప్పు పట్టారు. ఈ విషయంలో వారి కుటుంబంలోనూ చిచ్చు రేగింది. అయితే గేరి, లోరా మాత్రం వెనక్కి తగ్గలేదు.

చివరికి ఎమ్మానే తన సోదరితో పోట్లాడటం ఇష్టంలేక రాజీపడి గేరికి విడాకులు ఇచ్చింది.

వారి విడాకుల అనంతరం గేరి, లోరాల వివాహం చర్చిలో జరిగింది. ఎమ్మా, లోరాలు చూడటానికి ఒకేలా ఉండటం వల్ల చర్చి ఫాదర్ ఆశ్చర్యంగా 'కొద్ది నెలల క్రితమే మీ వివాహం చేశానే? మళ్లీ రెండోసారి ఎందుకు చేసుకుంటున్నారు?' అని అడిగాడు.

పెళ్లయ్యాక లోరా గర్భం ధరించింది. వారి బిడ్డకి ఎమ్మానే 'గ్రాండ్ మదర్'గా వ్యవహరించింది.

"శ్రీ!"

శ్రీనాథ్ కళ్ళు మూసుకునే ఊకొట్టాడు.

శ్రీనాథ్ కాళ్ళు లాగి తన ఒడిలో పెట్టుకుని ఒత్త సాగింది సునీత.

"అయ్యయ్యో! అదేం పని నీతూ..." కాళ్ళు లాగేసుకోబోయాడు.

"ఇది నాహక్కు. ఎవరూ లాగేసుకోలేరు. చివరికి ఆ కాళ్ళ తాలూకు ఓనరూ"

పకపకా నవ్వుతూ సునీతని చిలిపిగా చూశాడు. మళ్ళీ తన పాత సునీత వచ్చేస్తోందా!

"శ్రీ! నిన్ను చాలా భయపెట్టా కదూ?" కాళ్ళు సుతారంగా ఒత్తుతూ అంది.

"అవును నీతూ. నువ్వు ఇలా ఉంటే ప్రపంచంలో నాకింకేమీ అక్కర్లేదు. నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను. అవసరమైతే జాబ్ మానేస్తాను"

"మరేం చేద్దాం.. ఆడుతూ పాడుతూ తోటపని చేద్దామా" ఆట పట్టించింది.

"నువ్వు సంతోషంగా ఉంటానంటే నాకేం అభ్యంతరం లేదు" శ్రీనాథ్ కూడా తక్కువ తినలేదు.

"సరే కానీ, అంత అవసరం లేదులే. మనం కేరళ నుంచి వచ్చాక, బోర్ కొడ్తే నేను కూడా మళ్ళీ చేర్తాను. అనంత్ తప్పకుండా తీసుకుంటాడనే అనుకుంటున్నా"

"అదేం ప్రాబ్లం కాదు. కొత్త ప్రాజెక్ట్‌కి మాన్ పవర్ కావాలి. చూద్దాం.. ఎలా ఉంటుందో. ముందు నా రాణీగారు నార్మల్‌గా అవ్వాలి. తర్వాతే ఏదయినా.."

కొంచెం సేపు పేకాట ఆడారు. మధ్యలో రాంగ్‌షో చూపించి.. లేదు లేదని పేచీ పెట్టింది సునీత. ఆ తర్వాత అంత్యాక్షరీ ఆడారు. సునీత గొంతు బాగుంటుంది.

"అంత్యాక్షరీ ఏమిటికానీ మంచి పాట పాడు" అన్నాడు శ్రీకాంత్.

"సావిరహే తవ దీనా... రాధా..." అంటూ ఎంతో మధురంగా పాడింది. కొంచెంసేపు పిల్లల్లా దెబ్బలాడుకున్నారు.

సుజాతా, తనూ ఎలా కొట్టుకునేవారో యాక్షన్ చేసి చూపించింది సునీత.

ఆడి, ఆడి.. భోజనాలయ్యాక, హాయిగా నిద్రపోయారు. మధ్యలో శ్రీనాథ్ లేస్తూనే ఉన్నాడు, సునీతని చూడ్డానికి.. మందులు వెయ్యడానికీ.




అలారం మోగకుండానే, విసుగ్గా నిద్ర గొంతుతో అమ్మ తిట్టకుండానే నాండీ లేచేశాడు. ఒళ్ళు విరుచుకుంటుంటే అనిపించింది.. రాత్రి కాళ్ళు, చేతులూ అస్సలు లాగలేదు. శరీరం అంతా తేలిగ్గా ఉంది.

ఇంటర్‌కమ్ నొక్కగానే బట్లర్ ఆశ్చర్యపోయాడు. చిన్న బాబుగారే! ఐదునిముషాల్లో వేడి వేడిపాలు, ప్రత్యేక ప్రోటీన్ పొడి వేసినవి తీసుకొచ్చి, నాండీ గది తలుపు తీశాడు.

"గుడ్ మానింగ్" అనబోయి, నిశ్శబ్దంగా పాలు బల్లమీద పెట్టేసి వెళ్ళిపోయాడు. నాండీ అప్పటికే స్నానం చేసేసి ప్రాణాయామం చేస్తున్నాడు.

బట్లర్ జాన్‌కి నమ్మబుద్ధి కాలేదు. రోజూ ఏదో గొడవ లేకుండా తెల్లారదు చిన్నబాబుకి. జాన్‌కి ఏదో వెలితిగా అనిపించింది. నవ్వుకున్నాడు. చిన్నబాబు అలా మొండికేస్తుంటేనే ముద్దుగా ఉంటుంది.

నాండీ పుట్టినప్పట్నుంచీ వాళ్ళింట్లోనే ఉన్నాడు జాన్. ఇంచుమించు నాండీ పర్సనల్ కేర్‌టేకర్ అని చెప్పచ్చు. నాండీ అతనికి ఎప్పటికి పసిపిల్లాడిలాగే అనిపిస్తాడు. మమ్మా దగ్గిర సాగని వేషాలన్నీ జాన్ దగ్గర వేస్తుంటాడు.

ఒక గంట ముందుగా లేవడంతో, తను ఆరోజుకి అనుకున్న పాఠాలు చదివేసుకున్నాడు. నాండీ ఏక సంతాగ్రాహి. స్కాన్ చేసినట్లు పేజీలు తిప్పేస్తాడు. అలా గుర్తుండిపోతాయి. అతితక్కువ సమయం చదువుకి కేటాయించినా ఎప్పుడూ ఎనభై శాతానికి తగ్గిపోవడానికి అదే కారణం.

నాండీకి దేవుడిచ్చిన అద్భుతమైన ఆ వరాన్ని, కన్నతల్లి రాణీ గ్రహించలేకపోవడం దురదృష్టకరం.

ఏడు గంటలకి జిమ్‌లో ఉండాలి, మమ్మా ఇచ్చిన టైమ్ టేబుల్ ప్రకారం. ఆ టైమ్‌కే కోచ్ వచ్చి అసహనంగా తిరుగుతుంటాడు. ఇవ్వాళ మాత్రం అతని కంటే ముందే వెళ్ళి, స్ట్రెచింగ్ చేస్తుంటే, కళ్ళు పెద్దవి చేస్తూ వచ్చాడు కోచ్.

"వావ్! మైబాయ్. దట్స్ గుడ్" అన్నాడు.

గంటసేపు అలవాటైన వ్యాయామాలు సునాయాంగా చేసేసి, షవర్‌కింద నిలబడి, స్విమ్మింగ్‌పూల్‌లోకి దూకాడు నాండీ.

చేపపిల్లలా కిందినుంచి పైకి లేచి తల ఎత్తేసరికి, అప్పుడే డైవ్ చేస్తున్న అనంత్ కనిపించాడు.

"అన్నా..! రోజూ రావచ్చు కదా!" సంభ్రమంగా అరిచాడు.

అనంత్ ఆదివారంతప్ప అటుపక్క రాడు.

"నువ్వు రోజూ చేస్తావురా? " తమ్ముడి పక్కనే బటర్‌ఫ్లై ఈత కొడ్తూ అడిగాడు.

"అవును, కనీసం పది నిముషాలు

స్విమ్మింగ్ నా షెడ్యూల్‌లో ఉంటుంది" అనంత్ మీది నుంచి విల్లులా దూకి, బారలు తీస్తూ సర్రున వెళ్లిపోయాడు. తీగలా సాగుతున్న తమ్ముడిని చూస్తూ.. వెల్లకిల్లా పడుకుని, తేలుతూ ఆలోచిస్తు న్నాడు అనంత్.

ఒక్కరోజు వాడికిష్టం వచ్చినట్లు ఉండ నిస్తే ఇంత మార్పా! ఆ కళ్ళలో ఆనందం.. కదలికల్లో చురుకుతనం.. ఇంకా పసితనం వీడని అమాయకత్వం. ఆ వయసులో పిల్లలకుండే కోపతాపాలు ఏవీ నాండీలో చూడలేదు అనంత్.

ఇటువంటి అమూల్యమైన వరాలకొండని ఇచ్చినందుకు తమ అదృష్టానికి మురిసిపో వాలి. అది మామూలు తల్లిదండ్రులకే కానీ రాజాగారి దివాణంలో కాదు.

ఎప్పుడూ, ఏ అర్ధరాత్రో ఊళ్ళో ఉంటే ఇంటికొచ్చే రాజాకి, నాండీ ఎంత ఎత్తు న్నాడో కూడా తెలీదు. రాణీ అడుగడుగు నా ఆంక్షలతో వాడి బాల్యాన్ని కర్కశంగా నలిపేసింది. ఇప్పుడు కూడా తన వయసు పిల్లలని ఎవరి పేర్లయినా వాడికి తెలుసో లేదో అనుమానమే. అదే తనైతేనా.. రోజూ రణరంగమే అయ్యేది ఇంట్లో. అదృ ష్టవశాత్తూ తాతగారి పెంపకం కనుక ప్రశాంతంగా జరిగిపోయింది.

కానీ.. ఉన్న కొద్ది సమయంలోనే నాండీ, స్నేహితులతో గడుపుతాడనీ.. అప్పుడప్పుడు ప్రాక్టికల్స్ ఎగ్గొట్టి మ్యాట్నీ లకి వెళ్తాడనీ, అతని టీనేజి టాంట్రామ్స్ అన్నీ జాన్ భరిస్తాడని అనంత్‌కి తెలీదు. నాండీకి అందుకే ఇంకా పిచ్చెక్కలేదు.

★ ★ ★

సెల్‌ఫోన్ మోగుతుంటే పట్టించుకో లేదు అనంత్. డ్రైవ్ చేస్తుంటే సెల్ తియ్యడు. ఆరోజు కొత్త ప్రాజెక్ట్ గురించి చర్చించేందుకు సింగపూర్ నుంచి క్లయింట్స్ వస్తున్నారు. వికాస్‌ను గంట ముందుగా ఆఫీస్‌కి రమ్మని చెప్పాడు.

ఐదు నిమిషాలయ్యాక తన సీటులో కూర్చుని సెల్ తీశాడు. అనంత్ ఉండే బంజారాహిల్స్ నుంచి ఆఫీసుకు పది నిముషాలు కూడా పట్టదు.

'శ్రీనాథ్!' అనంత్ పెదవులమీద నవ్వు విరిసింది.

"హాయ్ శ్రీ! డ్రైవ్‌లో ఉన్నా అందుకని. ఎక్కడున్నారు... ఎలా ఉన్నారూ? "

"ఇప్పుడే చెన్నై స్టేషన్ చేరుతున్నాం. థేంక్స్ అనంత్. జర్నీ చాలా బాగుంది. కంపార్ట్‌మెంట్‌లో మేమిద్దరమే. ఓహ్! మళ్ళీ 'ఊ' చేసుకునే రోజులకెళ్ళిపోయాం"

"గుడ్ మీకు ఆ ఏకాంతం కావాలి శ్రీ! ట్రీట్‌మెంట్ అయ్యాక ఇంకా మార్పు కని

**కొత్తగాలి...**

**ఇల్లంతా**
**మనీప్లాంటు తీగలే**
**పొయ్యిలో పిల్లి లేచి**
**రెండు రోజులయింది**

- పి.వి.ఎన్. ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

పిస్తుంది, ముఖ్యంగా సునీతలో. నువ్వే చూస్తావు కదా!" శ్రీ చేసిన ప్రాజెక్ట్ సీడీ కంప్యూటర్‌లో పెడ్తూ అన్నాడు అనంత్.

"అదే నా ఆశ, కోరిక. నీకు ప్రాజెక్ట్ నచ్చుతుందని అనుకుంటా. అంటే డీటై ల్డ్‌గా చూళ్లేదు కదా! చూశాక చెప్పు ఎలా ఉందో. ఉంటా.. స్టేషన్ వచ్చేసింది. ఇక్క డ్నుంచి ట్రీచీ వెళ్తాం. మళ్ళీ రేపు చేస్తా".

అనంత్ కంప్యూటర్లోకి వెళ్ళి ప్రాజెక్ట్ చూడసాగాడు. నచ్చకపోడమేమిటి? తీసు కున్నవాళ్ళు బుర్రలేనివాళ్ళా! అసలు అమ్మ కుండా తనే ఉంచేసుకోవాల్సింది పూర్తిగా.

ఇప్పుడైతే సింగపూర్‌వాళ్ళతో కలిసి చేద్దామని, అదే తనొక్కడూ అయితే.. మళ్ళీ వేరే బిజినెస్ మొదలుపెట్టాలి, ఎస్టాబ్లిష్మెంట్.. ప్రాజెక్ట్ డీటైల్స్‌లోకి వెళ్తున్న అనంత్ కళ్ళు పెద్దవయ్యాయి. ఇంటర్‌నెట్ పొజిషన్ మార్కెటింగ్.. అడ్వర్టైజ్మెంట్. సెర్చ్ ఇంజన్లలో.. అంటే గూగుల్, బింగ్ వంటివాటిల్లో, క్లయింట్ల ప్రాడక్ట్స్ గురించి మొదటి పేజీలో రావడానికి చెయ్యవలసిన దేమిటి? అటువంటి పనులు చేసే కంపెనీలు ప్రపంచంలో ఎన్ని ఉన్నాయి. కొత్త కంపెనీ నిలదొక్కుకొనే అవకాశం ఎంత? అంతా అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు తయారు చేశాడు రిపోర్ట్‌ను శ్రీనాథ్.

ఏదయినా మనకి కావలసిన వస్తువుల గురించి తెలుసుకోవాలంటే, గూగుల్ సెర్చ్ నొక్కగానే వందలకొద్దీ పేర్లు వచ్చేస్తాయి. అందులో మొదట ఉన్నవే ఎక్కువ చూస్తారు జనం. పదివేల ఒకటో దాని చూడ్డానికి ఎవరికీ ఓపిక ఉండదు.

మొదటి పేజీలో రావడానికి కొన్ని పద్ధతులు, ఉపాయాలు ఉంటాయి. దానికి బిడ్డింగ్ ఉంటుంది. అది చాలా నైపుణ్యంతో చెయ్యాలి. అటువంటి వస్తువుల గురించి వచ్చే దగ్గిర, వాటిని తయారుచేసే కంపెనీలు తమ వస్తువుల గురించి యాడ్ ఇస్తుంటారు.

ఉదాహరణకి విటమిన్స్ గురించి తెలుసుకోవాలని సెర్చ్‌లోకి వెళ్తే.. విటమిన్ల రకాలు, ఏ విటమిన్ ఎందుకు కావాలో.. వికీ పీడియా లాంటి దాంట్లో వస్తుంది. దాని పక్కనే ఇటూ అటూ కదులుతూ, ఫ్లాష్ అవుతూ అవి తయారు చేసే కంపెనీలు.. రెడ్డీ లాబ్స్ వంటివి తమ గురించి చెప్పుకుంటూ ఉంటాయి.

మొత్తం, డిమాండ్ ఉన్న కంపెనీలూ, వాటి ప్రాడక్ట్స్, ఎవరెవరు వీటిని ఇంటర్నెట్ ద్వారా మార్కెట్ చేస్తున్నారో, కొత్త వాళ్ళకి ఏ అవకాశాలు ఉన్నాయో.. అంతా ఆ రిపోర్ట్‌లో పెట్టాడు శ్రీనాథ్.

అందుకే అది బైట పెట్టిన క్షణాల్లోనే సింగపూర్‌వాళ్ళు ముందుకొచ్చారు. ఆ తర్వాత బోలెడు ఫోన్ కాల్స్!. కానీ అనంత్ ముందుగా మాట ఇచ్చేశానని చెప్పాడు. విక్కీ వచ్చేలోపు అంతా చదివేశాడు. విక్కీ కంటే రెండు గంటలు ముందు వచ్చేశాడు తను. అతనితో చర్చించే పరిజ్ఞానాన్ని సంపాదించడానికి.

అంతా అయి, కుర్చీ వెనక్కి వెళ్ళగలిగినంత వెళ్ళి, కళ్ళు మూసుకున్నాడు.

అసలు ఈ ప్రాజెక్ట్ తనే పూర్తిగా ఎందుకు తీసుకోకూడదు. మరి సింగపూర్‌ని ఏంచెయ్యాలి? వాళ్ళకి చూద్దాం అన్నాడు కానీ మాట ఇవ్వలేదు. కాంట్రాక్ట్ సంతకం పెట్టలేదు. వాళ్ళు ఒప్పుకున్నారని సంబరంతో ఆనందంగా గడిపాడంతే.

ఈవేళ చర్చలకి రమ్మన్నాడు, డీల్ ఎంటరవడానికి ఆలోచించుకునే టైమ్ అడగచ్చు. ఆలోపు మనసు మార్చుకోవచ్చు.

తన దగ్గర డబ్బు ఎంత ఉందో లెక్క వేసుకున్నాడు. వికాస్‌నీ, శ్రీనాథ్‌నీ పార్ట్‌నర్స్‌గా పెట్టి ఎప్పుడో ఏదో మొదలుపెడదామని అనుకుంటూ కాలయాపన చెయ్యడమెందుకు? ఇప్పుడే.. ఇదే ఎందుకు చెయ్యకూడదు.

లేచి కాఫీ మిషన్ దగ్గిరికెళ్ళి, కలుపుకుని తెచ్చుకున్నాడు. కిటికీ దగ్గర ఉన్న సోఫాలో కూర్చుని ఆలోచించసాగాడు.

చెయ్యాలి.. బోలెడు హోమ్‌వర్క్ చెయ్యాలి. తండ్రిని అడగాలి. అవసరమైతే ఆయన పెట్టుబడి పెడ్తారేమో! వికాస్, శ్రీనాథ్‌లతో మాట్లాడాలి. ఈలోపు.. తన స్వంత విషయం.. ఇరవై ఎనిమిది నిండుతున్నాయి. తల్లి పెళ్లి మాటే ఎత్తదు. తనది స్వయంగా చొరవ చూపే స్వభావం




కాదు. పైగా తమ స్థాయివాళ్ళే కావాలని పేరెంట్స్ అంటారేమో.. అటువంటి వాళ్ళు ఎంత మంది ఉంటారు? ఎక్కడుంటారు?

అరేంజ్‌డ్ మారేజ్‌లలో తప్ప ఇటువంటి ఫైనాన్షియల్ మాటర్ అడగలేదు కదా! తనకి తోడు కావాలనిపిస్తోంది. కానీ ఎవరికి, ఎలా చెప్పడం?

"సారీ అనంత్! లేటయింది" వికాస్ లోపలికి వచ్చాడు.

అనంత్ టైమ్ చూశాడు. తొమ్మిది పది. ఎంత.. పది నిముషాలు లేట్. అదీ ఇవాళ ఎవరిదో జయంతి. తామిద్దరే ఆఫీసులో. వికాస్ సమయ పాలనకీ, ఆ కొద్ది ఆలస్యాన్నీ, అతను వివరించే విధానాన్నీ చూసి అప్పటికప్పుడే నిర్ణయానికి వచ్చేశాడు అనంత్.

★ ★ ★

"గుడ్ మార్నింగ్ మమ్మా!"

రాణీ పేపర్‌లో చూస్తున్న ఫేషన్ పేజ్ నుంచి తల తిప్పింది.

నాండీ నవ్వుతూ నుంచున్నాడు. గొంతు కేంటి ఇలా ఉంది. రోజూలాగ ఎందుకు చెప్తున్నానా అన్నట్లు లేదు. ఇప్పుడిప్పుడే మంద్రంగా మారుతోంది. పది గోళీలు ఆడిస్తున్నట్లుండే కీచుకీచులన్నీ పోయాయి.

వీడి కంఠం ఇంత బాగా వస్తోందే..

రామాచారిగారి దగ్గరికి మ్యూజిక్ కి పంపితే! ఆయన ఇంత పెద్దవాళ్ళకి చెప్తాడో లేదో. వాయిస్ కల్చర్ కి పంపాలి. అమితాబ్ బచ్చన్ లా వీడు డబ్బింగ్ బట్టే సక్సెస్ అయిపోవచ్చేమో!

"మమ్మా! స్కూల్ కెళ్తున్నా. ఇవేళ హాఫ్ డే. డాన్స్ మాస్టర్ గార్ని రమ్మని ఆల్రెడీ చెప్పేశా"

రాణీ తెల్లబోయి చూస్తుంటే మెరుపులా బుగ్గమీద ముద్దిచ్చి వెళ్ళిపోయాడు.

తనని ఆదివారం క్రికెట్ ఆడనిచ్చినందుకే ఆ సంతోషమని గ్రహించలేకపోయింది. ఆమె మనసులో వేల ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

ఆవిడ ప్రసిద్ధి చెందిన సంఘసేవిక. ముఖ్యంగా గుడిసెల్లో, వీధుల్లో ఎండనక వాననక పని చేస్తున్న పిల్లలని చూస్తే ఆవిడ గుండె తరుక్కుపోతుంది. వాళ్ళకి చదువు సంధ్యలు లేకుండా చేసిన ఈ సమాజాన్ని ఏకిపారేస్తుంటుంది. అంత చిన్నవయసులో, పాలుకారే పిల్లలు, వాళ్ళ కంటే పెద్దగా ఉన్న చిత్తుకాగితం బస్తాలని వీపుమీద వేసుకుని తీసుకుపోతుంటే.. ఫొటోలు తీసి అన్ని పేపర్లలో వేయించి.. 'ఇదేనా మన ప్రగతి?' అని ప్రశ్నిస్తుంది.

అటువంటి వీధిబాలల్ని చేరదీసి ఓ స్కూల్ నడుపుతోంది. అదే విధంగా ప్రభుత్వం, ఇతర సమాజోద్ధరణ సంఘాల సహకారంతో వృద్ధాశ్రమం నడుపుతోంది.

రైల్వే స్టేషన్లోనూ, బస్టాండుల్లోనూ అడుక్కునేవారిని ఇంటర్వ్యూలు చేసి వారి సమస్యల్ని తెలుసుకుంటుంది. ఇలా చెప్పాలంటే చాలా ఉన్నాయి.

ఇవన్నీ కాక నాండీని తీర్చిదిద్దే బాధ్యత ఉండనే ఉంది. వాడి క్లాస్ మేట్ల పేరెంట్స్ ని చూస్తే కూడా ఆవిడకి చికాకే. అర్ధరాత్రి మూడింటికి లేపుతారుట పిల్లల్ని. అక్కడ్నుంచీ రామయ్యగారి ఇన్స్టిట్యూట్, క్రిష్ణమూర్తీ, నలంద.. ఇలా అన్నింటికీ పిల్లల్ని స్కూటర్లమీద.. వాళ్ళ నిద్ర కూడా మానుకుని దింపుతుంటారుట. బుల్ షిట్.. అలాంటి చదువులు చదవకపోతే ఏంపోయింది..

చదవాలంటే ఎన్ని రకాలు లేవు. చెయ్యాలంటే ఎన్ని బిజినెస్ లు లేవు? అందులో ఆడపిల్లలకి మోడలింగ్ అంత ల్యూక్రేటివ్ ప్రొఫెషన్ ఇంకేదయినా ఉందా? ఆ మాటకొస్తే మగపిల్లలకి కూడా. అందులో ట్రైనింగ్ ఇప్పించచ్చు.

అలాగే ఇప్పుడు బోలెడు ఛానల్స్. టీవీల్లో, రేడియోల్లో.. వాటిల్లో యాంకర్లుగా, జాకీలుగా వెళ్లచ్చు.

ముందు ఈ నాండీ సంగతి చూడాలి. చెప్పిన మాట వింటున్నట్లే ఉంటాడు. కాని ఫలితం కనిపించదు. మొహంలో ఇంకొంచెం బుగ్గలు వస్తే, చెస్ట్ ఇంకొంచెం వెడల్పు పెరిగితే.. చేతులు ఇంకొక ఇంచ్ లావు అవ్వాలి. కాళ్ళు కూడా చాలా సన్నగా ఉంటాయి. పిక్కల్లో మజిల్ స్ట్రాంగ్ గా పింగ్ పాంగ్ బాల్ వేస్తే టంగుమని శబ్దం వచ్చేట్లుండాలి. ఎలాగ! ఇంకా రెండేళ్ళుంది. పద్ధెనిమిదేళ్ళకి వాడిని లాంచ్ చెయ్యాలి. వీడికి మంచి బాడీ షేప్ వస్తే, తనే తీస్తానని చెప్పాడు రాజా!

ముహూర్తం షాట్ దగ్గర్నుంచీ, రికార్డ్

## కొత్తగాలి... ✍

**కల కరిగితే**
**మెలకువ**
**నిశి కరిగితే**
**వేకువ!**

– కె.ఎస్. **ఆచార్యులు**, విజయనగరం

రిలీజ్ వరకూ చాలా గ్రాండ్‌గా చెయ్యాలి. మంచి ప్రొఫెషనల్ చేత పబ్లిసిటీ ఇప్పించాలి. కొన్ని సినిమాలు దానివల్లనే యాభై రోజులాడతాయిట, లోపలేం సరుకు లేకున్నా! సగం సినిమాలో లేచి వెళ్ళిపోయే వాళ్ళని ఎవరూ ఇంటర్వ్యూ చెయ్యరు కదా!

నాండీ షేపే! ఎలాగబ్బా! ఏంచెయ్యాలీ. వాడి లోపం లేకుండా ప్రయత్నం చేస్తున్నాడనే అందరూ చెప్తారు. డాన్స్ మాస్టర్‌ని అడిగి ముందు 'ఆటా' పోటీలకి పంపితే.. అప్పుడు అందరి దృష్టిలో పడ్తాడు కదా! మంచి ఐడియా తోచినట్లు చివాలున లేచింది రాణీ.

"హాయ్ హేమా! హౌ ఆర్ యు?" రాజావారు పదిహేను రోజుల తర్వాత ఇంటికి వచ్చారు, హాంగ్‌కాంగ్ నుంచి. ఆయనొక్కరే రాణీ హేమాంబరీ దేవిని అలా పిలిచేది. ఆవిడ పేరు చాలా మందికి తెలియదు. పబ్లిక్‌కి 'మిసెస్ ఈశ్వర్ రాణీ'గానే తెలుసు. రాజా ఈశ్వర్‌వర్మగారి పట్టపు రాణీ మరి.

"ఫైన్. రాజావారికి స్వాగతం. వెళ్ళిన పనులన్నీ సక్రమంగా అయ్యాయా? మళ్ళీ ఎప్పుడు ప్రయాణం?" వ్యంగ్యంగా కాదు.. మామూలుగానే అడిగింది రాణీ. రాజాగారున్న రెండుమూడు రోజులూ ఆయనతోనే ఉంటుంది, ఆయన పనులు స్వయంగా చూస్తూ.

రాజా వ్యాపార వ్యవహారాలు తగ్గించుకుని కొంచెం ఎక్కువ సమయం ఇంట్లో ఉంటే ఎలా ఉండేదో!

★ ★ ★

"బాబూ శ్రీనాథూ! శ్రీరంగం మీరు వెళ్లే దార్లోనేనంట కదా! ఒక్కసారి ఆ రంగనాథుడ్ని మొక్కడానికి కుదుర్తుందా?" బాలయ్య ప్రశ్న చెవిలో వినిపిస్తుంటే ట్రిచీ స్టేషన్‌లో సామాన్లు దింపి, సునీతకి చెయ్యి అందించాడు శ్రీనాథ్.

బాలయ్య ఇది చెయ్యండని ఎప్పుడూ చెప్పడు. తనకు కావల్సింది అలాగే అమాయకంగా అడుగుతాడు. గ్రహించి నెరవేర్చే కొడుకు ఉండడం బాలయ్య అదృష్టం.

కొట్టైకల్ అక్కడ్నుంచే టాక్సీ చేసుకుని వెళ్ళచ్చు. శ్రీరంగం వెళ్ళడం శ్రమేం కాదు, సునీత ప్రయాణం చెయ్యగలిగితే. ట్రిచీ, శ్రీరంగం జంట నగరాలు. సునీత ఉత్సాహంగానే ఉంది. ట్రిచీలో హోటల్ బుక్ అయింది. రైలు దిగగానే స్నానం చేసి, ఇడ్లీలు తిని బయల్దేరారు టాక్సీలో.

సునీత టిఫిన్ తిన్నాక దైవదర్శనం ఏమిటని పేచీ పెట్టింది. శ్రీనాథ్, డాక్టర్ రాసిచ్చిన కాగితం చూపిస్తే ఊరుకుంది.

శ్రీరంగం గుడి తమిళనాడులోని అన్ని ఊర్లలో లాగే చాలా పెద్దది. అసలు ఆ గాలిగోపురం చూడ్డానికే జిరాఫీలా మెడ సారించాలి. ఇంక లోపల ప్రాకారాలూ, చుట్టూ ఉండే చిన్న చిన్న ఆలయాలూ.. సరిగ్గా చూడాలంటే రోజంతా పడుతుంది.

శ్రీనాథ్‌కి అంత సమయం, సునీతకి శక్తీ లేదు. సాయంత్రం ఆరులోపు కొట్టైకల్‌లో ఉండాలి. ఆలస్యమైతే తమకి అలాట్ చేసింది ఇంకొకరికి ఇచ్చేస్తారని చెప్పాడు అనంత్. అంత రద్దీనట అక్కడ.

రంగనాథుని దర్శనం చాలా బాగా అయింది. గర్భగుడిలో ఇంకొంచెం వెలుతురు ఉంటే బాగుండుననిపించింది సునీతకి. దర్శనమయ్యాక ఒకతను అన్నీ చూపిస్తానని వెంట పడ్డాడు.

ప్రాకారంలో ఉన్న అనేక ఆలయాల్ని పేరుపేరునా చూపించాడు. అన్ని చోట్లా కుంకం, విభూతీ, హారతులూ, తీర్థాలు.. ఇంక నావల్ల కాదనేసింది సునీత సగం అవగానే.

"ఇంకొక్క ప్లేస్ సామీ!" బలవంతంగా లాక్కుని వెళుతున్నట్లు తీసుకెళ్ళాడు గైడ్. విసుక్కుంటూ వెళ్ళిన శ్రీనాథ్, సునీతలు

ఆశ్చర్యంతో చూస్తూండిపోయారు.

రామానుజాచార్యుని సమాధి అది. అంటే సమాధిలా లేదు. ఆయన పార్థివ శరీరాన్నే ఏ రసాయనాలు ఉపయోగించారో కానీ, శిల్పంలా చేశారు. చేతి గోళ్ళ దగ్గర్నుంచీ అంతా స్పష్టంగా కనిపిస్తోంది.

"నీతూ! పోదామా.. టైమ్.." అన్నాడు. సునీత తెప్పరిల్లి, నెమ్మదిగా నడిచింది.

★ ★ ★

కేరళలోని అన్ని ఊళ్ళలాగే సన్న వీధులతో ఉంది కొట్టైక్కల్. ఊర్లో ఉన్న పెద్ద రహదారిపై ఎత్తైన ప్రహరీ, పెద్ద గేటు.. లోపలికి వెళ్తుంటే రకరకాల పసరు, నూనె వాసనలు చుట్టుముట్టాయి.

## కొత్తగాలి...

**వేదిక మీద కవులు**
**ఎదురుగ్గా ఖాళీ కుర్చీలు**
**విలువల్లేని సమ్మేళనం**
**ప్రేక్షకుల్లేని సభావనం**

– జి. శ్రీశైలం,
పెద్దవెల్మెడ, మెదక్ జిల్లా

విశాలమైన లాన్లు, పెద్ద పెద్ద చెట్లు, బోలెడు ఖాళీస్థలం ఉంటుందనుకున్న సునీతకి కొంచెం నిరాశ ఎదురైంది.

కాంపౌండ్ సాధారణంగా ఉంది. అక్కడక్కడ ఇళ్లు, చిన్నచిన్న కాటేజీలు, మధ్యలో హాస్పిటల్, చెదురుమదురుగా చెట్లు.

శ్రీనాథ్, తను చేయించుకున్న రిజర్వేషన్ కాగితం చూపించగానే, గేటు వద్ద ఉన్న సెక్యూరిటీ మనిషి ఆఫీసుకి దారి చూపించాడు. అందరూ ఇంగ్లీష్ బాగా మాట్లాడుతున్నారు.

ఆఫీస్ మేనేజర్, వాళ్ళకిచ్చిన వసతి గృహాన్ని చూపించాడు. కావల్సిన డబ్బు అనంత్ క్రెడిట్ కార్డ్‌తో ముందే కట్టాడు.

యన్నారైలు, విదేశీయులు ఉండే కాటేజ్.. చాలా ఆధునికంగా ఉంది. వెళ్తానే పెద్ద వరండా, అటూ, ఇటూ రెండు ఇళ్ళు. అంతా పాలరాయి నేల. తలుపు తియ్యగానే ఒకమాదిరి పెద్ద హాలు, హాలుకి ఒకపక్క పడకగది, ఇంకొక పక్క వంటిల్లు. వంటింట్లో తప్ప అన్ని గదుల్లోనూ ఫర్నిచర్ ఉంది. హాలు వెనుక వైద్యానికి కావలసిన పరికరాలు ఉన్నాయి.

"మీరు ఇక్కడ కేంటీన్‌లో తినచ్చు, లేదా వంట చేసుకోవచ్చు. వంటకి గిన్నెలు తెచ్చుకోవాలి. సామాన్లు బైట బజార్లో దొరుకుతాయి. గాస్ స్టౌ రోజుకి ఇరవై రూపాయలు అద్దె చెల్లిస్తే మేము సప్లై చేస్తాం" శ్రీనాథ్‌తో అన్నాడు, వారి వెంట వచ్చిన వైద్యశాల ఉద్యోగి.

"మరి డాక్టర్.."

"పొద్దున్నే మీ కాటేజ్‌కే వస్తారు. మీ ప్రాబ్లం చెప్తే ఆయనే వేరే వాళ్ళని పంపుతారు. మీరు ఫ్రీగా కాంపౌండ్‌లో బైట తిరగచ్చు. ఇక్కడ పెద్ద లైబ్రరీ కూడా ఉంది" అంటూ ఇద్దరికీ గుర్తింపు కార్డులు ఇచ్చి వెళ్లిపోయాడు. తెల్లని బట్టలతో ప్రసన్న వదనంతో నవ్వుతూ.

అప్పటివరకూ పరిచయమైన ముగ్గురు నలుగురూ మధ్యమధ్యలో తెలుగు పదాలు కూడా వాడుతున్నారు గర్వంగా చూస్తూ.

"వ్యాపార మెళకువలు ఇలాగే ఉంటాయి. ఏ సంస్థయినా పిఆర్‌లతోనే పైకొచ్చేది" శ్రీనాథ్ సామాన్లు సర్దుతూ అన్నాడు.

సునీత బట్టలన్నీ అల్మార్లలో సర్దింది.

ఆఫీసులో ఇచ్చిన లిస్ట్‌లోని వస్తువులు కొనడానికి వెళ్ళాలి.

"స్నానం చేసి వెళ్దాం. అంతా చిరాగ్గా ఉంది" అంది సునీత. కేరళలో ఉక్కపోత ఎక్కువే.

"సరే. భోజనం కాంటీన్‌లో తినేద్దాం. మళ్లీ వంట అదీ అంటే.. ఇక్కడికి విశ్రాంతి కోసం కదా మనం వచ్చింది."

తలూపింది సునీత. తనకి వంట చెయ్యడం పెద్ద కష్టమేం కాదు. కేంటీన్‌లో ప్రకృతి వంటలు పెడ్తారేమో చూద్దాం.. సునీత నవ్వుకుంది.

సునీత ఇప్పుడు అన్నింటిమీద ఆసక్తి చూపిస్తోంది. దేన్నికైనా.. కష్టమైనా సుఖమైనా.. స్పందించడం కూడా తిరిగి వచ్చింది. శ్రీనాథ్‌కి ఊరట కలిగింది.

స్నానాలు చేసి, లేత రంగుల నూలు దుస్తులు ధరించి కాటేజ్ తాళం వేసి బైటి కొచ్చారు. బజారు చాలా పెద్దది. ఫుట్‌పాత్‌లమీదా, వెనుకనున్న కొట్లలో దొరకని వస్తువులు లేవు.

హాస్పిటల్ వాళ్ళు ఇచ్చిన లిస్ట్‌లో సామాన్లన్నీ కొనేశారు. నాలుగు తువాళ్ళు.. హాండ్‌లూమ్‌వి. రెండు మగ్గులు, ఒక బక్కెట్టు, నూనెలు వేసుకోవడానికి సీసాలు.. చాలానే ఉన్నాయి. వస్తూ వస్తూ కేరళలో ప్రసిద్ధి ఐన అరటిపళ్ళు, పనస తొనలు, వేరేరకాల పళ్ళు కొన్నారు.

ఒకరి చెయ్యి ఒకరు పట్టుకుని, నెమ్మదిగా నడుస్తోంటే కాలం ఎలా గడిచిందో తెలియలేదు. కాటేజ్‌కి వచ్చేసరికి ఎనిమిదయింది. 'తొమ్మిదికల్లా కాంటీన్ క్లోజ్' మానేజర్ చెప్పిన మాటలు గుర్తుకొచ్చి, గబగబా పరుగెత్తారు.

కాంటీన్ చాలా విశాలంగా ఉంది. బల్లల మీద అరటి ఆకులు పరచి ఉన్నాయి. లోపలికి అడుగు పెట్టగానే దగ్గరుండి తీసుకెళ్ళి ఖాళీజాగా చూపించారు.

మంచి మంచి వాసనలతో నోరూరిపోయింది శ్రీనాథ్, సునీతలకి. ఆకలి కూడా పరుగెత్తుకుంటూ వచ్చేసింది, ఎక్కడ్నుంచో. అప్పుడు గుర్తుకొచ్చింది వాళ్ళకి.. ఎప్పుడో ట్రేన్‌లో తిన్న సంగతి. హడావుడిలో దాని గురించే మర్చిపోయారు.

## నుయ్యో గొయ్యో..!

తమిళనాట ప్రసిద్ధిచెందిన కల్యాణ రామయ్యరు బృందం శాకుంతల నాటక ప్రదర్శనాన్ని తలపెట్టింది. గురజాడ ఆ నాటక ప్రదర్శనకు వెళ్లారు. శకుంతల పాత్రధారియైన నడివయస్సులోని రామయ్యరు చాలా మోటుగా అభినయిస్తున్నారు. ఓ నటుడు విశాఖపట్నమంత చేంతాడు స్వగతం చెప్పుకుపోయాడు. దర్జా, ఔచిత్యం, సౌకుమార్యం లేకుండా



నటులు మోటుగా అభినయిస్తూ రంగస్థలాన్నంతా కంగాళీ చేస్తున్నారు. నిలుచున్నపాటున మనిషిని గొంతు నులిమి హత్య చేసినట్లు శ్లోకాలన్నింటినీ ధ్వంసం చేస్తున్నారు. దుష్యంతుడి చెంత సానిపిల్లలా టక్కరితనంతో గునుస్తూ శకుంతల వగలు కురిపిస్తోంది.

ఇదంతా చూస్తున్న ఒకాయన 'ఇప్పుడీ నాటక ప్రదర్శనానికి కాళిదాసు వచ్చి వుంటే ఏమనుకునేవాడో?' అన్నాడు.

పక్కనే కూర్చున్న గురజాడ వెంటనే 'మారు మాటాడక ఈపాటికి ఏ నుయ్యో, గొయ్యో చూసుకుని వుండేవాడు' అన్నారు నవ్వుతూ.

తళతళా మెరిసే గ్లాసుల్లో మంచినీళ్ళు తీసుకొచ్చారు. అందులోకి చూసి సునీత కెవ్వు మంది. ఏవో తేలుతున్నాయి. గ్లాసు ముట్టుకుంటే వేడిగా ఉంది.

"ఏమీగాదు అమ్మణ్ణీ! జీరా వేశి, కాచి తెచ్చాం తణ్ణి" అరవ తెలుగులో మాట్లాడాడు, మళయాళీ సర్వరు. వేడి వేడిగా పొగలు కక్కుతున్న అన్నం, పల్చని పప్పు, నాలుగు చిన్న గిన్నెల్లో కూటు, సాంబారు, చారు, మజ్జిగ. వెజిటబుల్ సలాడ్, రెండు

రకాల కూరలు.. ఒకరి తరువాత ఒకరు వరుసగా వడ్డించి వెళ్ళిపోయారు.

ఆఖరుగా ఒకతను, చేత్తో గిన్నెతో ఏదో తీసుకొచ్చి వెయ్యడానికి సిద్ధపడ్డాడు.

"ఏంటది? "

"కొబ్బరినూనె అమ్మా! చేతిమీదికి.."

"అమ్మో! వద్దు. ఘీ లేదా.."

"ఉంది అమ్మా! అడుగుతే వేస్తాం."

నెయ్యి వేయించుకుని, కొంచెం దుడ్డుగా ఉన్న అన్నంలో కూర కలిపి నోట్లో పెట్టుకుంది సునీత.

"తేడాగా ఉంది.. ఏమిటి శ్రీ? "

"అదా! ఇక్కడ వంటల్లో కొబ్బరినూనె వాడతారు. అన్నమేమో బాయిల్డ్ రైస్‌తో చేస్తారు" శ్రీనాథ్ అలవాటు ఉన్నవాడిలాగ తినేస్తున్నాడు.

అన్నింట్లో కొబ్బరి. ఏదో ఒక ఐటమ్ అయితే బాగుంటుంది కానీ.. అరటికాయ, పనసకాయ కూరలు కూడా కొబ్బరితోనే. సునీత ఒక్క ముద్దా తినలేకపోయింది.

శ్రీనాథ్ బట్లర్‌ని పిలిచి అడిగాడు. "చపాతీలు ఉన్నాయా? "

"ఉన్నాయి సామీ. కానీ కొనుక్కోవాలి"

"ఒక ప్లేట్ తెచ్చిపెట్టు."

చపాతీ, కుర్మా తెచ్చిచ్చాడు సర్వర్. అది తిని, మజ్జిగ తాగి లేచింది సునీత.

డైనింగ్ హాలంతా కలియజూసింది. రకరకాల దుస్తులు ధరించి ఉన్నారు. ఎక్కడెక్కడ్నుంచో వచ్చారు. అన్ని రాష్ట్రాల భాషలూ వినిపిస్తున్నాయి. విదేశీయులు ఓ ఇరవై మంది ఉన్నారు. అందరూ ఏమీ ఇబ్బంది లేకుండా తినేస్తున్నారు.

'ఆంధ్రులకేనా ఆవకాయ, దప్పళం లేకుండా అన్నం దిగనిది.. అన్ని రకాలూ అలవాటు చేసుకోవాలి' అనుకుంది సునీత.

వస్తుంటే ఒక విదేశీ వనిత నవ్వుతూ పలకరించింది, 'హాయ్' అంటూ. సునీత దగ్గరగా వెళ్ళి పరిచయం చేసుకుంది.

"మేము మీ నైబర్స్. పక్క కాటేజ్‌లో ఉంటాం. మీరు లోపలికెళ్తుంటే చూశాను. నా పేరు లిండా. ఫ్రమ్ అమెరికా."

సునీత, శ్రీనాథ్‌ని కూడా పరిచయం చేసి, కేంటీన్ బయటికి వచ్చింది. చపాతీకి పైసలు ఇచ్చి వస్తున్న శ్రీనాథ్, పక్కకి రాగానే అడిగింది, "శ్రీ! అంతా కొత్త ఫుడ్ కదా? పూర్తిగా వేరే రుచులు. ఎలా తినగలిగావూ? "

"మాకు తినే వస్తువు ఏదైనా దొరికితే, మాట్లాడకుండా తినెయ్యడమే అలవాటు చిన్నప్పట్నుంచీ. కడుపు నిండడం ముఖ్యం. జబ్బు చెయ్యని ఏ పదార్థమైనా సరే. ఆకలికి రుచి తెలియదు నీతూ!"




యన్నారై కాటేజ్ కదా! ఏసీ ఉంది. మంచాలూ, పరుపులూ, సోఫాలూ.. అన్ని సదుపాయాలున్నాయి. సునీత, శ్రీనాథ్ రాత్రి, హాయిగా నిద్రపోయారు. పొద్దున్న ఐదింటికీ ఆయా తలుపు కొట్టింది.

"సామీ! నిమ్మకాయ రసం. పరగడుపునే తాగెయ్యాలి. ఏడో గంటకి డాక్టర్ వస్తారు. మీరు తయారయి ఉండాలి. ఎనిమిదో గంటకి బ్రేక్ ఫాస్ట్."

"కాఫీ ఉండదా? " సునీత ఆవలిస్తూ వచ్చింది.

"అవి కావాలంటే మీరు చేసుకోవాలి మేడమ్. ఇక్కడ పాలు దొరుకుతాయి"

ఆయా చకచకా నడుస్తూ వెళ్ళి పక్కింటి తలుపు కొట్టింది.

సునీతకప్పుడే తలనొప్పి మొదలయింది.

"ఇదెక్కడ ట్రీట్‌మెంట్ శ్రీ.. రెండు రోజుల్లోనే పారిపోతానేమో!" చిన్నపిల్లలా గారంగా అంటున్న సునీతని చూసి శ్రీనాథ్ నవ్వుకున్నాడు. పళ్లు తోముకుని, తేనె కలిపిన, గోరువెచ్చని నిమ్మకాయ రసం తాగారు. శక్తి వచ్చినట్లనిపించింది.

"మనం కొన్ని గిన్నెలు కొనుక్కుని వంట చేసుకుందాం శ్రీ!" స్నానాలు అయ్యాక అంది సునీత.

"రాణీగారి ఆజ్ఞ"

"నేను అడిగింది ఏదయినా ఎప్పుడూ కాదనవా శ్రీ! ఎప్పుడైనా నువ్వు నో అనాలనీ, నేను అలగాలనీ అనిపిస్తుంటుంది నాకు" కినుకగా అంది.

"నేనివ్వగలిగిందే అడుగుతున్నావు నీతూ. ఏ కారణం చెప్పను? "

"ఒక్క పాపాయిని తప్ప" సునీత కళ్ళ లోంచి నీళ్ళు జలజలా రాలాయి.

'అమ్మా!' అనుకున్నాడు శ్రీ. ఇది తన చేతిలో ఉందా! వజ్రాల నెక్లెస్ అడిగితే, ఇంకో షిఫ్ట్ పనిచేసి కొనియ్యగలడు. ఇంకా మంచి ఫ్లాట్ కొందామంటే, లోన్ పెట్టి కొనగలడు. కానీ పాపాయి?

దేముడిపై భారంవేసి "తప్పకుండా ఇస్తా నీతూ! ఒక్క ఏడాదిలోపు" అన్నాడు.

సునీత మొహం పున్నమి చంద్రుడిలా వెలిగిపోయింది.

★ ★ ★

తలుపు మీది గంట మోగింది. తీస్తున్న తలుపు తోసుకుని లేడీ డాక్టర్ లోపలికి వచ్చింది. ముప్ఫై ఏళ్ళుంటాయి. నల్లని శరీరఛాయతో కళగా చక్కగా ఉంది.

"హలో.. అయామ్ తార. ఎలా ఉన్నారు? నైట్ బాగా నిద్రపోయారా? కంఫర్ట్‌బుల్‌గా ఉందా రూం? " మాట్లాడుతూనే నెట్‌లో పంపిన సమాచారంతో తయారైన కేస్‌షీట్ చూసింది.

"మిసెస్ సునీతా! వెరీ స్వీట్ నేమ్. స్మార్ట్ లేడీ. చాలా హాపీగా ఉన్నారు. మా హాస్పిటల్ నచ్చిందా? " సమాధానం కోసం ఎదురుచూడకుండా, స్టెత్ తీసి నాడి, హార్ట్ బీట్, లంగ్స్ అన్నీ పరీక్ష చేసింది.

మొదట శ్రీనాథ్, సునీత జవాబులిద్దామని ప్రయత్నం చేసి, అవకాశం దొరక్క ఊరుకున్నారు. గలగల పారే కావేరీ ప్రవాహంలాగ ఉంది ఆవిడ ధోరణి.

వెనుక ఉన్న ట్రీట్‌మెంట్ గదిలోకి తీసుకెళ్ళింది.

"డాక్టర్! నేను కూడా రావచ్చా? " శ్రీనాథ్ అడిగాడు.

"ఫైవ్ మినిట్స్ తర్వాత.." తలుపేస్తూ లోపల్నుంచే జవాబిచ్చింది.

సునీతని పరీక్ష చేస్తూనే, నెలసరి గురించీ, ఇంకేవయినా గైనిక్ సమస్యలు ఉన్నాయా అనీ అడిగింది. సునీత చెప్పినవన్నీ శ్రద్ధగా విని కేస్‌షీట్‌లో రాసింది.

పదిహేను నిముషాలయ్యాక, శ్రీనాథ్‌ని రమ్మంది. శ్రీనాథ్ ఆత్రుతగా వెళ్ళాడు.

"షి ఈజ్ పెర్ఫెక్ట్‌లీ ఆల్ రైట్ శ్రీనాథ్. ఇప్పుడే ట్రీట్‌మెంట్ స్టార్ట్ చేద్దాం. మార్నింగ్, ఈవినింగ్ ఆయిల్ మసాజెస్ ఉంటాయి. రెండూ డిఫరెంట్. ఆఫ్టర్‌నూన్ యోగా ఉంటుంది. ఈవెనింగ్ ట్రీట్‌మెంట్ అయ్యాక మీ ఇష్టం. ఎక్కడికైనా వెళ్ళచ్చు. ఒన్ ఇంపార్టెంట్ థింగ్! ఈ ట్రీట్‌మెంట్ రోజుల్లో స్నానం చేయకూడదు. మసాజ్ అయ్యాక, క్లాత్ పెట్టి తుడుస్తారు ఆయాలు. అప్పుడే మెడిసిన్ లోపలికి ఇంకుతుంది"

సునీత భయంగా చూసింది, నెల రోజులు స్నానం లేకుండానా? అందులో ఈ వెదర్‌లో? ఏమైనా దెబ్బలాడైనా సరే రేపే వెళ్ళిపోవాలి. ట్రీట్‌మెంట్, గ్రీట్మెంట్

జాన్తా నై...

శ్రీనాథ్ సునీత ఆలోచన్ను పసికట్టాడు.

"ఆఫ్టర్నూన్ మసాజ్ అయ్యాక, సోప్ లేకుండా జస్ట్ వాటర్‌తో కడుక్కుని టెంపుల్‌కి వెళ్తాం డాక్టర్! ప్లీజ్.. ఒకేసారి.."

"ఓకే.. బట్ నో సోప్. మీ డాక్టర్ నేనే. ఏ ప్రాబ్లమ్ వచ్చినా నన్ను పిలవండి" ఆవిడ కార్డ్ ఇచ్చి వెళ్ళిపోయింది.

★ ★ ★

"అదెలా కుదురుతుంది అనంత్! పార్టీలని రమ్మని చెప్పాం కదా, వాళ్ళకేం ఆన్సరిద్దాం? బిజినెస్ సర్కిల్‌లో మాట తప్పామన్న పేరు రాదూ? ఆలోచించు" రాగానే అనంత్ చెప్పింది విని మతిపోయినట్లె అన్నాడు వికాస్.

కొత్తగాలి... 

గ్రాసం దొరక్క గ్రామం
నగరంవైపు పయనం
పెనం పైనుండి పొయ్యిలోకి..

– సురేష్ కుమార్,
ఉప్పల్, హైదరాబాద్

అనంత్ ఈ ప్రాజెక్ట్‌ని అమ్మే ఉద్దేశం మార్చుకుంటున్నానని చెప్పాడు వికాస్‌కి. అప్పట్నుంచీ చేస్తున్నారు ఇద్దరూ వాదోపవాదనలు. వికాస్ భయం వికాస్‌ది. ఇది పనిచెయ్యడం మొదలవుతే, తమ జీతాలూ, బోనస్‌లూ పెరుగుతాయి. ఇంకో కొత్త ప్రాజెక్ట్ చెయ్యడానికి ఉత్సాహమొస్తుంది. వచ్చే డబ్బుతో ఏమేం కొనాలో కూడా ఆలోచించేశాడు. ఇప్పుడు అనంత్ చెప్పింది వినగానే అతని ఉత్సాహమంతా నీరు గారింది.

అనంత్.. తనే బిజినెస్‌మాన్. తాత్కాలిక ప్రయోజనాలకంటే, వ్యాపారం దీర్ఘకాలికంగా నిలబడ్డం కావాలనే దూరదృష్టితో నడుచుకుంటాడు. అసలు వికాస్ అభిప్రాయం అడగాల్సిన అవసరం లేదు. తన వ్యాపారం, తన ఇష్టం. కానీ అనంత్‌ది ఉద్యోగులని కూడా కలుపుకోవాలనే తత్వం. ఈ ప్రాజెక్ట్ వికాస్ ఆధ్వర్యంలో జరిగింది. పైగా అతన్ని పార్ట్‌నర్‌గా తీసుకుందామనే ఆలోచన కూడా ఉంది. ఏకపక్షంగా నిర్ణయం తీసుకుంటే వికాస్ కోపం వచ్చి వెళ్ళిపోతానంటే.. తను అనుకున్నదేదీ నెరవేరదు.

అప్పుడు తట్టింది అనంత్‌కి, ఇది తనే చేద్దామనుకుంటున్నానని, చెప్పలేదనీ. అంత కష్టపడి వాళ్ళు చేసిన ప్రాజెక్ట్ రిజెక్ట్ చేయడానికి కాదనీ.. పార్ట్‌నర్‌షిప్ గురించి కూడా తనేం చెప్పలేదనీ, పైగా శ్రీతో కూడా చర్చించాలి కదాని!

"చూడు విక్కీ! రెండు పాయింట్స్. ఒకటి ఆ సింగపూర్‌వాళ్ళ సంగతి వదిలేయ్. ఇప్పటివరకూ జరిగింది ఇనిషియల్ టాక్. ఎప్పుడైనా అగ్రిమెంట్ అయ్యేలోపు నేను మార్చుకోవచ్చని ముందే చెప్పాను. రెండు, ఇది మనమే చేద్దామని అనుకుంటున్నాను. వింటున్నావా.. నేను కాదు 'మనం'. నీకు, శ్రీకి, ఒక్కొక్కరికీ ఇరవైఐదు శాతం పార్ట్‌నర్‌షిప్. పెట్టుబడి నాది. పని మీది. ఫలితాలు వచ్చేవరకూ ఇప్పుడు మీకు వస్తున్న శాలరీ వస్తుంది. శ్రీ వచ్చాక మాట్లాడుదాం. మీ ఇద్దరికీ ఇష్టమైతే మొదలుపెట్టేయ్యచ్చు. శ్రీ వచ్చేలోపు కావల్సినవేవో ఆలోచించి రిపోర్ట్ తయారుచెయ్యి.

ఏ కారణం చేతయినా చెయ్యలేకపోతే, అప్పుడే అమ్మేద్దాం. ఇన్వెస్ట్‌మెంట్ గురించి మా ఫాదర్‌తో కూడా మాట్లాడాలి నేను. శ్రీకి అప్పుడే చెప్పకు. అతన్ని, ఈ విషయాలతో విసిగించద్దు. వెకేషన్ అంటే వెకేషనే. ఓకే"

అనంత్ ఫోన్ తీశాడు, సింగపూర్ పార్టీతో మాట్లాడ్డానికి.

అనుకున్నది ఎంత కష్టమైనా సాధించే పట్టుదల ఉన్నవాడు అనంత్. కొంతవరకూ రాణీ స్వభావమని చెప్పచ్చు.

విక్కీ నోట్లోంచి మాట రానట్లు ఉండిపోయాడు. నిజమా.. తను పార్టనరా? ఎప్పుడైనా కలగన్నాడా!

"విక్కీ! కమాన్.. వెళ్దాం. ఇవేళ సెలవు కదా! కనీసం ఇప్పుడైనా ఫ్యామిలీతో గడుపుదాం"

"అనంత్! నువ్వు ఖాళీగా ఉంటే మా ఇంటికి రారాదూ! లక్కీ.. అదే నా వైఫ్ లక్ష్మి, ఎప్పుడూ అడుగుతూ ఉంటుంది" వికాస్‌కి ఆత్రంగా ఉంది, అనంత్‌ని ఎప్పుడు తీసుకెళ్ళి ఇంట్లో చూపిద్దామా అని. విక్కీ పెళ్ళికి వెళ్ళలేకపోయాడు అనంత్. తరువాత అవకాశం రాలేదు. ఇప్పుడు సెలబ్రేషన్ చేయాల్సిన సమయం..

"ఓకే. కానీ వారికి ఈ బిజినెస్ గురించి చెప్పకూడదు. అంతా శ్రీ వచ్చాకే!"

"సరే!" నిరుత్సాహంగా నడిచాడు వికాస్.

★ ★ ★

"కమ్మాన్ డూడ్. నీకీ ప్రపోజల్ ఇష్టం లేదా? అంత డల్‌గా ఉన్నావేంటీ.. డ్రాప్ చేసేద్దామా? అనంత్ డ్రైవ్ చేస్తున్నాడు. వికాస్ ఫ్లాట్ అనంత్ ఇంటికి మూడు కిలోమీటర్లు. ఖైరతాబాద్ వెంకటరమణా కాలనీలో ఉంది.

ఎవరో కొట్టినట్లు ఉలిక్కిపడ్డాడు వికాస్.

"ఓహ్.. సారీ అనంత్. ఏదో ఆలోచనలో పడి.. అయినా ఇంత మంచి న్యూస్ ఇంట్లో చెప్పద్దంటే ఎలా ఉంటుంది? నా గుప్పెడు గుండె దాచుకోలేనంటోంది"

అనంత్ పకపకా నవ్వుతూ, వికాస్ ఉండే కాంప్లెక్స్ దగ్గర ఆపాడు కారు.

"లోపలికి పోనీ, నా కారు లేదు కదా!" అనంత్ మెర్సిడెజ్‌ని కళ్ళు పెద్దవిచేసి చూస్తూ అన్నాడు వికాస్. అందులో వస్తుంటే ఇంటిదగ్గరికి వచ్చిందే తెలీలేదు.

"ఏం ఫరవాలేదు విక్కీ.. ఓకే యాజ్ యు విష్" సర్రున లోపలికి తీసుకెళ్ళి విక్కీ పార్కింగ్ లాట్‌లో ఆపాడు.

ఇల్లు ఎలా ఉందో! సర్దారో లేదో, పని మనిషి వచ్చిందో లేదో! ముందు ఫోన్ చెయ్యాల్సింది. అనంత్ చెప్పింది వినగానే, ఆ ఉత్సాహంలో తీసుకొచ్చేశాడు. పెద్దా, చిన్నా అని కాదు. అనంత్ ఇంట్లో అన్ని వస్తువులూ మిలమిలా మెరుస్తుంటాయి. అనంత్ ఇదే మొదటిసారి రావడం.

"నో ప్రాబ్లమ్ విక్కీ! రిలాక్స్. నువ్వు టెన్షన్ పడ్తావని తెలిస్తే రాకపోదును తెలుసా!" విక్కీ భుజం మీద స్నేహపూర్వకంగా తట్టాడు.

అప్పుడు, విక్కీ మొహంలోని నరాలన్నీ కుదుటపడ్డాయి.

"ఈ ఫ్లాట్ మా నాన్నగారు తీసుకున్నారు. పదేళ్ళు పైనే అయింది. ఆయనే సెక్రెటరీ అప్పట్నుంచీ. వద్దు అందామన్నా ఎవరూ దానికి ముందుకి రావట్లేదు"

"ఎందుకొస్తారు? అదంతా ఆదాయం లేని పనికదా! ప్రతీ నిముషం ఎంత వస్తుందా అనే ఆలోచిస్తారు? పైగా ఎవరో చేస్తుంటే, ఇది బాగాలేదు, అది సరిగ్గా చెయ్యలేదు. ఇంత డబ్బెందుకయింది? అంటూ నిలబెట్టి కడిగెయ్యొచ్చు కదా!"

వికాస్ ఆశ్చర్యపోయాడు. అనంత్‌కి మిడిల్ క్లాస్ సమస్యలు ఇంతగా తెలుసా!

"సింపుల్ విక్కీ.. అన్నిచోట్లా ఉండేవే ఇవీ. గ్రేడ్ తేడా అంతే. మా కాలనీలోనూ ఇలాగే. నిష్కామంగా చెయ్యాలంతే"

★ ★ ★

లిఫ్ట్‌లో పైకి వెళ్తుంటే వికాస్ అద్దంలో చూస్తూ తల దువ్వుకున్నాడు. కొంతమం

దికి అదో అలవాటు. ఏసీ కార్‌లో వస్తే, జుట్టు రేగే పనే ఉండదు. కానీ ఎంత కాదనుకున్నా విక్కీకి టెన్షనే. అనంత్ అంత సులువుగా వచ్చేస్తాడనుకోలేదు.

తీరా వస్తుంటే ఇప్పుడేం చెయ్యాలో, ఎలాంటి ఆతిథ్యమియ్యాలో తెలియట్లేదు.

అనంత్ అదేం పట్టించుకోకుండా లిఫ్ట్ గోడలమీది నోటీసుని చదువుతున్నాడు. లిఫ్ట్ ఎలా వాడాలి, వెళ్ళేటప్పుడు ఫ్యాను, లైట్లూ ఆపెయ్యాలి.. బరువు వస్తువులు తీసుకెళ్ళకూడదూ.. అంటూ ఉంది.

లిఫ్ట్‌లోంచి వికాస్ బైటికి వెళ్ళిపోయాడు. తలుపు తీసి. అనంత్ లైటు, ఫ్యాన్ స్విచ్‌లు ఆర్పి వచ్చాడు.

**కొత్తగాలి...**

**పోయినవాళ్లందరూ**
**జ్ఞాపకాల్లో మిగిలిపోతారు**
**కానీ, అమ్మ**
**జ్ఞాపకమెలా అవుతుంది?**
**మన ఊపిరి కదా!**

– ఊర్మిళాజ్యోతి, మహబూబ్‌నగర్

"నువ్వు ఉన్నావని ఆర్పలేదు అనంత్" అన్నాడు వికాస్ సిగ్గుగా. అనంత్ చిన్న విషయాలు కూడా పట్టించుకోడం చూస్తే ముచ్చటేసింది.

వికాస్‌వాళ్ళది త్రీ బెడ్‌రూమ్ ఫ్లాట్. ప్రవేశించగానే విశాలమైన హాలు, అందులో చక్కగా అమర్చిన సోఫాలు, బల్లలు.. గోడలకి పెయింటింగ్స్.. రెండు మూలల్లో రెండు ఇండోర్ మొక్కల కుండీలు.. చూడగానే ఆహ్లాదంగా ఉంది.

వికాస్ దగ్గర ఇంటి తాళం ఉంటుంది. దానితో తలుపు తీశాడు, బెల్ కొట్టకుండా.

లోపల్నుంచి కెవ్వున కేక వినిపించింది.

అనంత్ గాభరాగా చూశాడు. ఫరవాలేదన్నట్లు సైగ చేశాడు వికాస్.

"విక్కీ! మైగాడ్.. నిజంగా నువ్వేనా! ఉండు నన్ను గిల్లుకుని చూడనీ.. అసలు అప్పుడే రాత్రయిపోయిందా! ఇంకా వంట కూడా చెయ్యలేదు" గదిలోంచి ఆపకుండా ఒక కంఠస్వరం వాయించేస్తోంది. మనిషి కనిపించట్లేదు. బైటికొచ్చే జాడ కూడా లేదు.

వికాస్ ఇబ్బందిగా చూశాడు. అనంత్ కళ్ళలో నవ్వు దాచుకోలేకపోయాడు. ఏం చెయ్యాలా అని చూస్తుండగానే, ఇంకో గదిలోంచి అరవైలోని ఇద్దరు దంపతులు వచ్చారు.

"ఎవరిమీదరా... అమ్మాయి ఝుడివాన కురిపిస్తోందీ? " అనుకుంటూ.

"మా అమ్మ మాణిక్యం, నాన్నగారు అవధానిగారు. యస్.బి.ఐ.లో డిజీయమ్‌గా రిటైర్ అయ్యారు" వికాస్, అనంత్‌కి పరిచయం చేశాడు.

"దా బాబూ! కూర్చో. అమ్మా నాన్నగారూ బాగున్నారా? " అవధానిగారు, ఆప్యాయంగా అనంత్‌ని సోఫా దగ్గరికి వచ్చి కూర్చోమని, తనూ కూర్చున్నారు.

అనంత్ కూర్చుంటూ పెద్దవాళ్ళిద్దర్నీ పరికించి చూశాడు. ఇద్దరు కూడా తన తల్లిదండ్రులకంటే ఐదారేళ్ళు పెద్దయి ఉంటారు. జీవితంలో అనుకున్నది సాధించామన్న తృప్తి మొహాల్లో కనిపిస్తోంది. ఎక్కడికో వెళ్ళడానికి తయారైనట్లున్నారు.

వికాస్, అనంత్‌కి చెప్పి ఇందాకా వీణా నాదం వినిపించిన గదిలోకి వెళ్లాడు.

"అంకుల్! మీరు ఎక్కడికైనా వెళ్తున్నారా? నేను వచ్చి మిమ్మల్ని.." ఇద్దర్నీ చూస్తూ అన్నాడు.

"అదేంలేదు బాబూ! ఇంత ఎండలో ఎక్కడికి వెళ్తాం.. మాణిక్యం కూడా స్కూల్లో పనిచేసేది టీచరుగా. మా ఇద్ద

రికీ, ఇప్పటికీ తొమ్మిదింటికల్లా ఉద్యోగాలకి వెళ్ళినట్లు తయారయిపోయి, ఇంట్లో కూర్చోడం అలవాటు. 'బైటివాళ్ళ కోస మేనా.. మనకి మనం కూడా శుభ్రంగా కనిపించాలి' అంటుంది మా ఆవిడ" పెద్దా యన ముసిముసి నవ్వులు నవ్వాడు.

మాణిక్యం బుగ్గలు ఎర్రబడ్డాయి.. ఇలా రహస్యాలు చెప్పేస్తారా అన్నట్టు తెచ్చిపె ట్టుకున్న కోపంతో చూసింది.

"సారీ అనంత్.. లక్కీ బట్టలు మార్చు కుంటుండింది. అందుకే ఆలస్యమైంది రావడం. ఇదిగో ఇందాకా నువ్వు నిన్న ఝుంఝూ మారుతం ఈవిడదే.. లక్ష్మి"

రోజారంగు పంజాబీ డ్రస్సులో, చున్నీ నిండుగా కప్పుకుని, నమస్కారం చేసింది. హడావుడిగా వచ్చిందేమో, మొహం మీద నీటి బిందువులు అక్కడక్కడా మెరుస్తు న్నాయి. తెల్లవారుఝామున కురిసిన మంచు బిందువులతో తడిసిన రోజా పువ్వులా ఉంది. మరీ... అందాలరాశి కాక పోయినా, ముగ్ధమనోహరంగా ఉంది.

చక్కని పలువరస కనిపించేలా నవ్వుతూ, నమస్కారం చేసింది లక్ష్మి. పైపెదవి కొంచెం మరీ పైకి వెళ్ళినట్లు అనిపించినా అదీ బాగానే ఉంది.

"ఇంటికొచ్చినవాళ్ళకి, మంచినీళ్ళయినా ఇచ్చేది ఉందా లేదా? " వికాస్ వంటింట్లోకి వెళ్తూ అన్నాడు.

"ఓహ్! సారీ విక్కీ. ఇంత సడన్‌గా మీ బాస్‌ని తెచ్చేస్తే... ఏం చెయ్యాలో మాకు తోచట్లేదు" ఒక్క అంగలో విక్కీ వెనుకే వంటింట్లో దూరి, ఐదు వెండి గ్లాసుల్లో చల్లని మంచినీళ్ళు తెచ్చింది లక్ష్మి. వెండి గ్లాసులు ఒక్క నల్లని మచ్చ కూడా లేకుండా తళతళా మెరుస్తున్నాయి.

అనంత్‌కి ఆశ్చర్యం వేసింది. రాజావా రింట్లో బోలెడు వెండి సామాను ఉంది. ఎప్పుడైనా ఏ పూజకైనా తీస్తే.. బైటపెట్టిన రెండ్రోజులకే నల్లగా అయిపోతాయి. విసు గొచ్చి, లాకర్లో పడేస్తుంది రాణీ.

"ఇంత తెల్లగా ఉన్నాయి.. ఏం పాలిష్ వాడతారు? " నీళ్ళు తాగి గ్లాసుని తిప్పి చూస్తూ అడిగాడు అనంత్.

వికాస్‌కి చాలా ఆశ్చర్యమేసింది. అనంత్ వాళ్ళింట్లో ఉన్న కట్లరీ... క్రిస్టల్ గ్లాసులు... వాటి ముందు, ఈ పాత వెండి గ్లాసులు... ఇవి వికాస్ తాతగారి నాటివి. ఆమధ్యన సొట్టలు తీయించి మెరుగు పెట్టించారు.

"రోజూ బూడిద పెట్టి తోమేస్తే అవే మెరుస్తాయి బాబూ! మేము రోజూ కుంపట్లో పాలు కాచుకుంటాం, మెల్లిగా, ఎర్రగా కాగుతాయని. అందులోంచి పడే బూడిద. అంతేకానీ పాలిష్... అదీ" ఆపేసి వికాస్‌ని చూసింది మాణిక్యం.

అబ్బాయి బాస్ అంటే ఏం మాట్లాడాలో, ఎంతవరకూ మాట్లాడచ్చో. స్కూల్లో ముప్ఫై ఏళ్ళు పనిచేసిన అనుభవం ఉంది కానీ.. ఇప్పటి పిల్లలు, పద్ధతులు ఏమో.. ఎలా తెలుస్తాయి!

"కుంపటి అంటే ఎలా ఉంటుంది ఆంటీ? నేను ఎప్పుడూ చూడలేదు. మీరు విక్కీతో ఉన్నట్లే నాతో కూడా ఫ్రీగా ఉండచ్చు. నన్ను పరాయివాడిలా చూడద్దు" అనంత్‌కి చిన్నప్పట్నుంచీ కూడా

## కొత్తగాలి...

**దగ్గరున్నవారు దూరం**
**దూరమున్నవారు దగ్గర**
**ఇది సెల్, నెట్‌ల**
**గొప్ప మ(హ)త్తు**

– శ్రీష్టి శేషగిరి,
సికింద్రాబాద్

స్నేహితులు తనని వేరుగా చూడ్డం ఇష్టం ఉండేది కాదు. కానీ ఒకసారి తమ ఇంటికి వచ్చినవాళ్ళు, ఏదో రాజకుమారుడిలా తన్ను చూడడం గమనించి ఎవర్నీ ఇంటికి పిలవడం మానేశాడు. పైగా రాణీ ఎవర్నీ మనస్ఫూర్తిగా పలుకరించేది కాదు.

కనీసం పెద్దయ్యాక అయినా, తన కంటే ఎక్కువ చదివిన ఉద్యోగులు.. తన దగ్గర పనిచేసే వారయితే మాత్రం.. స్నేహంగా ఉండకూడదా! చెరిపెయ్యాలి.. ఈ గోడల్ని తుడిచెయ్యాలి.

"దా బాబూ! చూపిస్తాను" వంటింటి వెనుక ఉన్న బాల్కనీలోకి తీసుకుని వెళ్ళబోయింది.

వంటింట్లో విక్కీ గిన్నెలో నీళ్ళు పెడుతున్నాడు, కాఫీ డికాక్షన్ వెయ్యడానికి. లక్కీ, అతని మీదనుంచి ఎగిరి, కాఫీపొడి డబ్బా తియ్యడానికి అవస్థ పడుతోంది. విక్కీ మరింతగా సాగి, తనకి అందనియ్యకుండా చేస్తున్నాడు.

విక్కీ వీపుమీద రెండు పిడికిళ్ళతో గుద్దుతూ, మెడ చుట్టూ చేతులు వేసి లేవబోతోంది లక్కీ.

అనుకోకుండా వచ్చిన అనంత్‌ని చూసి, కిందకి దూకి రెండు చేతుల్తో మొహం కప్పుకుంది లక్కీ.

"ఇదంతే బాబూ! ఇంట్లో అందర్నీ ఒక ఆట ఆడిస్తూ ఉంటుంది. నువ్వు పద.." బాల్కనీలో నున్నగా తోమి ఎండలో బోర్లించిన కుంపటిని తీసి చూపిస్తూ, అందులో బొగ్గులు ఎక్కడ వెయ్యాలో, ఎలా వెలిగించాలో చూపించింది మాణిక్యం.

చనువుగా లోపలికి వచ్చి అందరితో కలిసిపోయిన అనంత్‌ని చూసి అటువంటి బాస్.. కాదు ఫ్రెండ్.. ఉన్నందుకు గర్వంతో ఉప్పొంగింది విక్కీ హృదయం.

మాణిక్యం, అవధానిగారూ, అనంత్‌కి ఇల్లంతా చూపించారు. తను ఎంత కష్టపడి లోన్ తీసుకుని, ఆ ఫ్లాట్ కొన్నాడో వివరించారు అవధాని.

"ఇంకొక్క బాధ్యత మిగిలిందయ్యా! నాకు ఇద్దరమ్మాయిలూ, ఒక అబ్బాయి. పెద్దమ్మాయి ఇంజనీరింగ్ చదివింది. పెళ్ళిచేసి అమెరికా పంపించాం. వికాస్ గురించి చెప్పక్కర్లేదుగా. ఇంకో అమ్మాయి ఉంది. జర్నలిజం చదివి హిందూ పత్రికలో చేస్తోంది. దానిక్కూడా.."

"అదిగో.. నాన్నా! నా గురించి మొదలు పెట్టావా? ఇంటికెవరొచ్చినా నేనే కనిపిస్తానా.. ఇంకా ఆఫీస్‌కి వెళ్ళలేదు. డాబా మీద వడియాలు ఎండబెట్టడానికి వెళ్ళాను. నేను లేకుండా నా పేరెత్తితే.. తెలుసుగా నా సంగతి.." ఎప్పుడొచ్చిందో, సుడిగాలిలా వచ్చి అవధానిని వెనుకనించి గట్టిగా పట్టుకుంది ఒకమ్మాయి.

అనంత్, అవధానికి ఎదురుగా ఉన్నాడేమో అతనికి ఆమె కనిపించలేదు.

"మా చెల్లెలు బిందు. ఇతను అనంత్. ఇది మధ్యాహ్నం రెండు గంటలకి వెళ్తుంది ఆఫీస్‌కి. అంత వరకూ అందరిపనీ గోవిందా.." వికాస్, చెల్లెల్ని ఇవతలికి లాగి పరిచయం చేశాడు.

బిందు బిడియంగా నమస్కారం చేసింది. ఎవరొచ్చారో చూసుకోకుండా అలా రెచ్చిపోయిందేమిటీ? అబ్బబ్బ అంత తొందరెందుకే బిందూ? అని తనని తనే కొట్టుకుంది, ఎవరికీ కనిపించకుండా.

అనంత్‌కి నోట మాట రాలేదు. ప్రతి నమస్కారం చెయ్యడం మర్చిపోయి, తల పంకించాడు. ఇంత అందమైన అమ్మాయిని అతనెప్పుడూ చూడలేదు. చాలా సాధారణమైన దుస్తులు, ఎండలో ఎర్రబడిన మొహం, నుదుటిమీద చిరుచెమట తుడుచుకుందామని చున్నీ అంచుపైకి లేపి చేత్తో తుడుచుకుంటుంటే.. అందులో కని

# సొంతగడ్డకే దూరమైన తల్లి!




నేటి వరకూ ఓ మహిళ అమెరికా అధ్యక్షురాలిగా ఎన్నికవ్వలేదు. కాని నిన్నటి హిల్లరి క్లింటన్‌దాకా చాలామంది అధ్యక్ష ఎన్నికల్లో పాల్గొనాలని ప్రయత్నించారు.

'ఈక్వల్ రైట్స్ పార్టీ'ని స్థాపించిన విక్టోరియా ఉడ్‌హల్ 1872లోనే అమెరికా అధ్యక్ష పదవికి పోటీ చేసింది. ఈమె వాల్‌స్ట్రీట్‌లోని తొలి మహిళా స్టాక్ బ్రోకర్ కూడా. అంతేకాదు, ఆమెనే మొట్టమొదటి మహిళా దినపత్రిక యజమానురాలు. మహిళల హక్కుల గురించి కాంగ్రెస్ ముందు మాట్లాడిన తొలి మహిళ. అయితే సాటి మహిళలే ఆమెకు మద్దతు ఇవ్వక పోవడం దురదృష్టకరం.



ఓహియో రాష్ట్రంలో 1838లో జన్మించిన విక్టోరియా తనకు రోగాలకు చికిత్స చేసే వరం ఉందని నమ్మి, వైద్యం చేసేది. స్త్రీ వాదానికి విక్టోరియానే పునాదిరాయి వేసింది. స్వేచ్ఛా ప్రణయాన్ని, కుటుంబ నియంత్రణని, ఇంకా అనేక సామాజిక మార్పులను ఆమె తీసుకు రావాలనుకుంది.

ఆనాటి కోటీశ్వరుడైన కొర్నెలియస్ వేండెల్ బిల్ట్‌కు ఆమెమీద వ్యామోహం కలిగింది. వారిద్దరి మధ్య చాలాకాలం శారీరక సంబంధం కొనసాగింది. ఆమె తీసుకు రాదలచిన మార్పుకి సాటి స్త్రీల మద్దతు లేకపోవడంతో ప్రవాహానికి ఎదురీదలేక ఓ బ్యాంకర్‌ను వివాహం చేసుకుంది. ఆ తర్వాత అందరిలా సాధారణ ఇల్లాలిగా జీవితాన్ని గడిపింది. ఆమెకి ఓ కూతురు పుట్టాక తన గత చరిత్ర ఆ బిడ్డను ప్రభావితం చేస్తుందని భావించింది. తన పాపపై ఓ చెడ్డతల్లికి పుట్టిందనే మచ్చ వేస్తారని భయపడింది. అందువల్ల ఆమె అమెరికా వదలి ఇంగ్లండ్‌కు వలస వెళ్లిపోయింది. మళ్లీ ఎన్నడూ అమెరికాకు రాలేదు.

---

పించే గ్రేస్.. ఓహ్! అనంత్‌కి తన గుండె చప్పుడు తనకే వినిపిస్తోంది.

బిందు అందం చాలా విలక్షణమయింది. మొహంలో నాజూకుతనం, తీర్చి దిద్దిన కనుముక్కు తీరు, కళ్ళల్లో అనుకున్నది సాధించగల పట్టుదల ఒకేసారి కనిపిస్తాయి. నడిచే, నిల్చునే తీరు ఒకేసారి చాలా పొందిగ్గా, నిర్లక్ష్యంగా అనిపిస్తుంది.

"కాఫీ రెడీ.. పరిచయ కార్యక్రమాలు అయిపోతే.. కాఫీ తాగి చురుకుదనాన్ని పెంచుకుందాం" ట్రేలో ఆరు కప్పుల్లో ఫిల్టర్ కాఫీ తీసుకొచ్చింది లక్ష్మీ.

"కాఫీ సూపర్ లక్ష్మీ! ఇదంతా కుంపటి పాల మహత్యమేనా? " అనంత్ ప్రతీ కాఫీ బిందువునీ ఆస్వాదిస్తూ అన్నాడు.

"థాంక్యూ! ఇంకా సూపర్ భోజనం పెడ్తాం. ఉంటానంటే"

లక్ష్మీని, కోప్పడుతున్నట్లు చూసింది మాణిక్యం. ఇంట్లో ఏం కూరలున్నాయో చూసుకోకుండా అలా అనెయ్యడమే.. జమీందార్ల పిల్లాడు..

"తప్పకుండా. ఇవేళ నేను ఫ్రీ. రోజంతా మీతోనే గడుపుతాను"

వికాస్ నమ్మలేనట్లు చూశాడు. అనంత్ తమ ఇంట్లో.. ఏం వండిపెట్టాలీ..

అనంత్ వాళ్ళ తటపటాయింపు తెలుసుకున్నాడు.. మొహమాట పడకూడదు. కొంచెంసేపు బిందుతో కలిసుండే ఛాన్స్..

"హే! కమ్మాన్ యార్. నేనేం బంగారం తినను. మీరేం వండుకుంటారో అదే పెట్టండి. ఒక్క ఐటమ్ ఎక్కువ చేసినా ఊరుకోను"

"నువ్వలా అనాలే కానీ ఎంతసేపు బాబూ! ఒక్క గంట చాలు" మాణిక్యం

లేచి కొంగు దోపుకుంది.

"అమ్మా! ఇవేళ మేమిద్దరం చేస్తాం. నువ్వు ఇక్కడ్నుంచి కదలడానికి లేదు. ఏం చెయ్యాలో కూడా చెప్పడానికి వీల్లేదు" బిందు తన సహజ ధోరణికి వచ్చేసి, లక్ష్మిని తీసుకుని వంటింట్లోకి నడిచింది. ఫ్రిజ్ తీసి ఏమేం ఉన్నాయో చూసింది.

అరటికాయలు, బెండకాయలు తప్ప ఏమీ లేవు. పప్పు చేద్దామంటే ఆకుకూర, టమాటాలు లేవు. ఉల్లి, వెల్లుల్లి, ఆలుగడ్డ ఎప్పుడూ ఇంట్లో ఉంటాయి. ఇద్దరూ కలిసి చకచకా మెనూ అనేసుకున్నారు.

"మేమేమైనా హెల్ప్ చెయ్యాలా? " విక్కీ అరిచాడు.

"అక్కడుండి ఏం చేస్తావు? ఏదో అడిగానని అనిపించుకోడానికి కానీ.."

"అమ్మ శక్తీ! వచ్చేస్తున్నా.." విక్కీ లోపలికి వచ్చేశాడు. వెనుకే అనంత్.

"అయ్యో మీరు కూడానా? సరదాగా అన్నాను. మీరు కబుర్లు చెప్పుకుంటూ ఉండండి" బిందు చాకు చేతిలోకి తీసుకుని అంది.

"ముందు ఆ చాకు దించు.. నాకు భయం వేస్తోంది" విక్కీ, బిందు చేతిలో చాకు లాక్కుని లక్ష్మి కడిగిపెట్టిన బెండకాయలు తీశాడు.

"జస్ట్ గాటు పెట్టు.. అంతే.." అనంత్ వెల్లుల్లిపాయలు ఒలవడానికి తియ్యబోతుంటే వారించబోయి, అనంత్ బుంగ మూతి చూసి ఊరుకుంది లక్ష్మి.

జోక్స్ వేసుకుంటూ, ఒకర్నొకరు కవ్వించుకుంటూ.. చెప్పినట్లుగా, సరిగ్గ గంటలో వంట ముగించేశారు. ఈలోపు, మాణిక్యం, అవధానీ ఒక కునుకు తీసేశారు.

"ఆఫీసు లేదా? " బల్లమీద సర్దుతున్న బిందుని అడిగాడు విక్కీ.

"మీకు ఎందుకో, మాకూ అందుకే సెలవు. రేపు పేపర్ రాదు"

అరటికాయ వడలు, బెండకాయ కారం పెట్టి కూర, వెల్లుల్లి చారు, కొబ్బరిపచ్చడితో భోజనం ముగించారు.

"ఇంత అద్భుతమైన భోజనం ఎప్పుడూ తినలేదు.. మీ కుటుంబంతో పరిచయం అయినందుకు చాలా సంతోషంగా ఉంది. ఇలాగే అప్పుడప్పుడు వచ్చి మిమ్మల్ని సతాయిస్తుంటాను" గేటువరకూ వచ్చి సాగనంపుతున్న ఇంట్లో వాళ్ళందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలిపాడు అనంత్.




"వెరీగుడ్! పొడుగు ఇంచ్ పెరిగావు. బరువు కూడా టూ పౌండ్స్.. ఇలాగే ఉంటే నీ ప్రోగ్రెస్ చాలా బాగుంటుంది. ఈ వారం ఎక్సెర్‌సైజులన్నీ రెగ్యులర్‌గా చేశావు.. అవునా!" కోచ్ మెచ్చుకున్నాడు.

"అవున్సార్! కానీ మజిల్స్ మాత్రం అలాగే ఉంటున్నయ్" నాండీ చెయ్యి మడిచి భుజంకింద కండని బిగించాడు. కొంచెం కూడా పైకి లేవలేదు.

"నిజమే అదే ఆలోచిస్తున్నా. విటమిన్స్ వేసుకుంటున్నావా? బీఫ్ తింటే.."

"అబ్బే అది కుదరదు. మీరు అమ్మకి చెప్పినా, మావంశంలో అదిమాత్రం తినరు. ఇది నాన్నగారికి తెలిస్తే అందర్నీ చంపేస్తారు" నాండీ మాటలకి నిట్టూర్చాడు కోచ్.

"అన్నా!" జిమ్‌లోకి వస్తున్న అనంత్‌ని చూసి ఆనందంగా అరిచాడు నాండీ.

"ఏడిసినట్టే ఉంది.. ఇంకో ఐదారేళ్ళు పోతే అన్ని కండలూ వస్తాయి. అసలు నిన్ను వెళ్ళగొడితే సగం గొడవ వదుల్తుంది" అని గొణుక్కుంటూ అనంత్, నాండీని దగ్గరగా తీసుకున్నాడు.

"నాండీకున్న ఫ్లెక్సిబిలిటీ ఎవరికీ ఉండదు సార్. పూల్‌లో చేపపిల్లలా ఈదుతున్నాడు, జర్రున జారిపోతూ. నెమ్మదిగా పెరగనివ్వండి. తొందరేం లేదు" సందేహిస్తూనే కోచ్ చెప్పి, జిమ్ బైటికి వెళ్తుంటే ఎదురయింది రాణి.

"మేడమ్! ఒకసారి డాక్టర్‌ని కన్సల్ట్ చేసి, డైట్ సప్లిమెంట్స్ ఇమ్మంటారేమో అడుగుదాం. మజిల్ గ్రోత్ బాగా ఉంటుంది" రాణీగారితో కాస్సేపు మాట్లాడి, తన మోటార్ బైక్ ఎక్కాడు కోచ్.

"అన్నా! ఈ టైమ్‌లో నువ్విక్కడా?"

"ఇవేళ మా ఆఫీస్‌కి కూడా సెలవేరా!" ట్రెడ్‌మిల్ మీద పరుగెడుతూ అన్నాడు అనంత్. వికాస్ ఇంటినుంచి వచ్చి, గంట నిద్రపోయి, కిందికి వచ్చాడు అనంత్.

"అన్నా! అయితే పిక్చర్‌కి పోదామా?"

"ఓ యస్, దేనికి?"

"హారీ పాటర్- 3 వచ్చిందిట"

"ఓకే"

నాండీ గెంతుకుంటూ వెళ్ళాడు.

'ఇంకా వీడికి పసితనం పోలేదు. వీడిని ఈ చిత్రహింసల నుంచి ఎలా కాపాడాలి? ఏం చెయ్యాలో తెలీదు కానీ.. ఏదో ఒకటి చెయ్యాలి, చెయ్యి జారకముందే' అనుకుంటూ అనంత్ ట్రెడ్‌మిల్ స్పీడ్ పెంచాడు.

★ ★ ★

ఆ రోజు నుంచి ట్రీట్‌మెంట్ మొదలయింది. సాయంత్రం అయ్యేసరికి సునీతకి నీరసం వచ్చేసింది. పొద్దున్నే నిమ్మకాయ రసం తాగాక, ఏదో కషాయం ఇచ్చారు. చేదుగా, పుల్లగా, వగరుగా ఉంది. కష్టపడి తాగింది. తరువాత ఇద్దరు ఆయాలు వచ్చారు, స్టౌతోపాటు నాలుగు రకాల నూనెలూ తీసుకుని. సునీతని అక్కడున్న టబ్‌లో పడుకోమని, నూనెలు వేడిచేసు కుంటూ, మసాజ్ ప్రారంభించారు.

బాగానే ఉంది కానీ ఆ టబ్‌లో పడుకోవడమే ఇబ్బందిగా ఉంది. ఒక గంట అయ్యాక రెండు తువ్వాళ్ళతో తుడిచేసి, వెళ్ళిపోయారు. అప్పట్నుంచీ రెండేసి గంటలకొకసారి ఏవో గోళీలు, మందులు తెచ్చివేస్తూనే ఉన్నారు.

శ్రీనాథ్ వెళ్ళి, బజార్లో నాలుగు గిన్నెలు, నాలుగు పళ్ళాలు, కప్పులూ, రెండు గ్లాసులూ.. పప్పులూ, నూనె, ఇతర సరుకులు కొనుక్కొచ్చాడు. ఆఫీసు దగ్గరకి వెళ్ళి, గ్యాస్‌స్టౌ కూడా తెచ్చి వెలిగించి కాఫీ కలిపి తెచ్చాడు. రెండ్రోజుల తర్వాత బ్రూ కాఫీ తాగుతుంటే ప్రాణం లేచొచ్చినట్లయింది సునీతకి.

సాయంత్రం మసాజ్ అయిపోయాక, శనగపిండితో రుద్దుకుని స్నానం చేస్తుంటే హాయిగా అనిపించింది. హుషారుగా లేచి వంట చేద్దామని వెళ్ళింది.

"కుక్కర్ తేలేదా? అది లేకుండా నాకు అన్నం, పప్పు వండటం రాదే..."

"అయ్యో! మర్చిపోయాను. రేపు కొనుక్కొస్తా. ఈ పూట నేను వండుతా"

## కొత్తగాలి...

**అమ్మాయికి**
**కడుపు రాలేదన్న బాధ**
**అబ్బాయికి**
**పొట్టొచ్చిందన్న బాధ**

– బిక్కునూరి రాజేశ్వర్,
పాన్కల్

శ్రీనాథ్ గిన్నెలు తీశాడు. సునీత ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది.

"నీకు వంట వచ్చా శ్రీ!"

"ఇప్పటివరకూ నువ్వు ఛాన్స్ ఇవ్వలేదు. చూడు ఎలా చేస్తానో! నువ్వు అలా కూర్చుని కబుర్లు చెప్తుండు. కాయగూరలు కూడా నేనే తరిగేసుకుంటా"

అరగంటలో వంట అయిపోయింది.

కొనుక్కొచ్చిన పెరుగు ఉండనే ఉంది.

"చాలా బాగుంది శ్రీ! ఇంతలా ఎప్పుడు నేర్చుకున్నావు? " సునీత తృప్తిగా తింది.

"ఇంజనీరింగ్ చదివేటప్పుడు, హాస్టల్‌కి పైసలెక్కడ్నుంచి వస్తాయి? నాలాంటి వాళ్ళం ముగ్గురు కలిసి చిన్నగదిలో ఉండి వండుకునే వాళ్ళం. ఎంత చిన్నగది అంటే.. అందులో ఇద్దరే పడుకోగలరు. వంతుల ప్రకారం పడుకునేవాళ్ళం. అదీ, మా కాలేజ్ దగ్గర కాంప్లెక్స్‌లు కట్టేవారు. అందులో నైట్ వాచ్‌మన్‌లాగ ఉండే వాళ్ళం అద్దె లేకుండా. ఒకళ్ళు ఎప్పుడూ మెలకువగా ఉంటాం కనుక సేఫ్టీకి సేఫ్టీ, మా వరకూ ఫ్రీ వసతి"

సునీత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏయ్! నువ్వు అప్సెట్ అవుతావంటే అసలు చెప్పేవాణ్ణి కాదు.. ఊరుకో.."

"ఇవి ఉద్వేగంతో వచ్చాయి శ్రీ! దుఃఖంతో కాదు"

వేడినూనెల మసాజ్‌తో ఒళ్ళు అలిసిపోయి ఏడుగంటలకల్లా పడుకుంది సునీత.

శ్రీనాథ్ తను తెచ్చుకున్న కంప్యూటర్ పుస్తకాలు చదువుకుంటూ.. అలా నిద్రలోకి జారుకున్నాడు.

★ ★ ★

బాలయ్యకి పగలు పన్నెండుగంటలు సరిపోవట్లేదు. తోటకి మామూలు రూపం వచ్చేసింది. పూర్తిగా పోయిన చెట్లని తీసేసి, అక్కడ నేలంతా బాగుచేసి కొత్త మొక్కలు నాటాడు. మొదలు దగ్గర కొన్ని బలమైన కొమ్మలున్నవాటిని అలాగే ఉంచి పాదులు చేసి, సహజ ఎరువులు వేశాడు. అందులో పిడకలు కాల్చిన బూడిద, వేపాకుపొడి కలిపాడు. అవి రెండూ పురుగుల్ని దరి చేరనియ్యవు. మళ్ళీ ప్రతీ మొక్కకీ పేర్లు పెట్టాడు. మాలచ్మి మామూలుగానే అతన్ని చూస్తే ఊగిపోతుంది. పొద్దు నడినెత్తిమీదికి వచ్చింది. బాలయ్య షెడ్డు దగ్గరికి వచ్చి, కాళ్ళూ చేతులూ కడుక్కుని, జొన్నరొట్టెల డబ్బా తీశాడు.

గాలివానకి రెల్లుగడ్డి లేచిపోవడంతో రేకులూ కొత్తవి వేయించి పక్కాగా చేసేశాడు షెడ్డుని. ఎప్పట్లానే అందులో రెండు రోజులుండడానికి సరిపోయే సరుకులు తెచ్చి పెట్టేశాడు.

జొన్నరొట్టె ముక్క తుంచి నోట్లో పెట్టుకోబోతుండగా.. దూరం నుంచి రేణుక పరుగెత్తుకుని రావడం కనిపించింది.

"ఏందే హడావుడి.. చిన్నపిల్లననుకుంటున్నావా? ఏంటా పరుగు? "

"అబ్బాయి దగ్గర్నుంచి ఫోన్ వచ్చిందయ్యా!" వగరుస్తూ అంది రేణుక.

"ఏంది కథ.. మంచిగున్నారా? "

"కోడలికి జబ్బు తగ్గిపోతోందంట. ఒకనెల సరిపోయేట్లుందని అన్నాడు శ్రీనాథు. ఇంక పదిరోజుల్లో ఇంటి దగ్గరుంటారట" రేణుక ఆయాసం తీరాక అంది.

"ఇంతదానికి పరుగెత్తి రావాల్నే.. పొద్దు మీకి నేనే వచ్చేవాన్ని కదా! తిన్నావా? "

"లేదయ్యా! అబ్బాయితో మాటాడా కదా.. ఆగలేక అట్లనే వచ్చేసిన"

"దా! అయితే ఇద్దరం కలిసి తిందాం"

జొన్నరొట్టె ముక్క, మామిడికాయ పప్పులో ముంచి, రేణుక నోట్లో పెట్టాడు బాలయ్య.

గున్నమామిడి ఆనందంతో ఊగింది.

"ఇప్పుడు నీ ఇష్టం మాలచ్మీ! ఇంకా కాయలు రాలే కదా.."

★ ★ ★

శ్రీనాథ్ తన తల్లి రేణుకతో మాట్లాడాక, సునీతవాళ్ళింటికి కూడా చేశారు ఫోన్.

"చాలా సంతోషం నీతూ! నచ్చిందా అక్కడ? అల్లుడు నిన్ను ఏపనీ చెయ్యని య్యట్లేదా? అమ్మకే బాగాలేదు. అస్సలు నడవలేకపోతోంది"

"మరి డాక్టర్ దగ్గరకి వెళ్ళలేదా? మేము ఉండీ మీకేసాయం చెయ్యలేకపోతున్నాం. ఒక్కరూ ఎలా చేసుకుంటున్నారు నాన్నా? " సునీత తన ఆరోగ్యం సంగతి మర్చిపోయింది.

"ఫరవాలేదురా! పనమ్మాయి మంచిదే. అన్నట్లు గుడ్ న్యూస్.. అక్కా వాళ్ళు ఇంకో పదిరోజుల్లో వచ్చేస్తున్నారు. మీరూ, వాళ్ళూ ఒకటి రెండు రోజులు తేడాలో వస్తారు. అక్క వస్తే ఇంక భయం లేదు. తనే చూసుకుంటుంది"

"అత్తయ్యగారికి ఇక్కడ ట్రీట్‌మెంట్ ఇప్పించరాదా మామయ్యా! ఆర్థ్‌రైటిస్ పేషంట్స్ చాలామంది ఉన్నారు ఇక్కడ. తగ్గుతుందని చెప్పలేను కానీ, చాలావరకు రిలీఫ్ దొరుకుతుంది" శ్రీనాథ్ ఫోన్ అందుకుని అన్నాడు.

"అమ్మో! అంత డబ్బు మేమెక్కడ పెట్టగలం. కుదరదులే బాబూ!"

"తక్కువలో కూడా జరుగుతుంది మామయ్యా! సదుపాయాలు తక్కువ వుంటాయికానీ వైద్యం అంతే. మాట్లాడమంటే అడుగుతాను. ఇప్పుడు అడిగితే ఇంకో సంవత్సరానికి దొరకచ్చు స్లాట్"

"అలాగా! మీకు మంచిదనిపిస్తే చెయ్యండి"

శాంత ఫోన్ లాక్కుని సునీత గురించి అడిగింది.

"చాలా బాగుంది. బరువు కూడా పెరిగింది. డాక్టర్ తార చాలా తృప్తిగా ఉన్నారు"

ఫోన్లు మాట్లాడడం అయ్యాక, ఇద్దరూ కలిసి వంట చేసుకుని, తినేశారు. అప్పటి కప్పుడు వండుకుని, వేడిగా ఆవిర్లు వస్తున్న అన్నం తింటూ.. ప్రతీ ఏడూ ఇలా ఒకనెల ఎక్కడైనా గడపాలనే నిర్ణయానికి వచ్చేశారు శ్రీనాథ్, సునీతలు.

అదెంతవరకూ సాధ్యమవుతుందో మరి!

★ ★ ★

సునీత చాలావరకూ కోలుకుంది. వారం రోజుల్లో అయిపోతుంది వచ్చిన పని.

శ్రీనాథ్ కూడా అప్పుడప్పుడు ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నాడు. అతనికి, మెదడుకి చలవ చేసే 'ధార' ఇస్తున్నారు. పడుకోబెట్టి నెత్తిమీద నుంచి గోరువెచ్చని ఆయుర్వేద నూనెలు ధారగా పోస్తుంటారు. అలా పోస్తూ మధ్యలో వత్తుతూంటారు. అరగంటకు పైగా అలా చేసి, తరువాత చల్లని నీటితో కడిగేస్తారు.

వైద్యశాల పద్ధతులు, చేస్తున్నంతసేపూ బాగానే ఉంటాయి కానీ, ఆ తర్వాతే.. ఆ వాసనలు.. జిడ్డు తట్టుకోడం కష్టం. కొన్ని రోజులకి అలవాటైపోతుంది.

ఆరోజు సాయంత్రం, రోజూ వెళ్ళినట్లే వైద్యశాల ఎదురుగా ఉన్న విశ్వంభరేశ్వరుని ఆలయానికి వెళ్ళారు ఇద్దరూ.

ఆలయం అంతా కిటకిటలాడుతోంది. విశాలమైన ప్రాంగణంలో జంపఖానాలు పరిచేశారు. వచ్చినవాళ్ళు వాటిమీద కూర్చుని, కబుర్లు చెప్పుకుంటున్నారు. కొత్త వాళ్లు వచ్చి చేరుతున్నారు.

"ఈ హడావిడేమిటండి స్వామీ? " తీర్థం తీసుకుంటూ అయ్యవార్ని అడిగింది సునీత.

"మీకు తెలియదా అమ్మా! ఇప్పుడు శమ్మంగుడి శ్రీనివాసయ్యర్ కచేరి ఉంది. మూడు దినాల్నుంచీ ఇక్కడ బోర్డ్‌మీద రాశారే" పురోహితుడు అన్నాడు.

సునీత గుడికి వచ్చి నాలుగు రోజులయింది. ఊర్లో ఇతర ప్రదేశాలు చూడ్డానికి వెళ్ళారు ఇద్దరూ, ఇంక వెళ్ళిపోయేరోజు వచ్చిందని. పెద్దగా ఏం మిగల్లేదు కానీ,

గుళ్ళే ఉన్నాయి. నడిచినంత నడవడం, లేకపోతే ఆటో.. ఊరంతా చూశారు.

శమ్మంగుడి కచేరీ అనగానే సునీత సంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఎప్పుడూ రేడియోలోనూ, సిడీల్లోనూ వినడమే కానీ ముఖాముఖీ చూడలేదు.

శిష్యుడు జేసుదాసుతో కలిసి పాడిన సీడీ ఉంది సునీత దగ్గిర. లేత గొంతుతో జేసుదాసు, గురువుగారికి తీసిపోకుండా పాడిన ఆ పాటలంటే సునీతకి ఇష్టం.

దూరంగానైనా, ఆనుకోవడానికి వీలుగా ఉన్నచోటు చూసుకుని కూర్చున్నారు.

"డిన్నర్ లేట్ అయిపోతుందేమో?" శ్రీనాథ్ సన్నగా అన్నాడు. అతనికి సునీత ఉత్సాహం చూస్తుంటే బాగా అనిపిస్తోంది కానీ, మందులు.. టైమ్‌కి తినకపోతే నీరసం.. ఎలా? ఇప్పుడిప్పుడే పూర్తిగా మనుషుల్లో పడుతోంది సునీత.

"ఫర్లేదు శ్రీ! వెళ్తూ వెళ్తూ, హోటల్లో ఇడ్లీలు తినేసి వెళ్దాం. కొబ్బరి పచ్చడి బాగుంటుందిలే.." నవ్వింది సునీత.

వాళ్లకి కేరళ వెళ్ళినప్పట్నుంచీ కొబ్బరితో వంటలు అంటే జోక్ అయిపోయింది. మంచినీళ్ళూ, మజ్జిగా తప్ప అన్నిటిలో వేసేస్తారు మరి.

★ ★ ★

ఆ రాత్రి చాలాసేపు నిద్రపోలేదు సునీత. చెవుల్లో కచేరీలోని కీర్తనలు ప్రతి ధ్వనిస్తుంటే.. భావోద్వేగంతో పదే పదే మననం చేసుకుంటూ అటూ ఇటూ దొర్లుతూనే ఉంది మంచంమీద.

ఉదయం శ్రీనాథ్ కంటే ముందే లేచి కాఫీ కలిపేసింది సునీత. శ్రీనాథ్‌ని లేపింది కూనిరాగం తీస్తూ.

"నువ్వు ఇంత బాగా పాడుతావని తెలీనే లేదు నీతూ! నా దగ్గర్నుంచి దాచావు కదా?" కినుకగా అన్నాడు.

"నా ఇంటర్ అయ్యేవరకూ విద్యానగర్‌లో ఉండేవాళ్ళం. అప్పుడు నేతి శ్రీరామ శర్మగారి దగ్గర నేర్చుకున్నా. చాలా వర్ణాలూ, కృతులూ నేర్పించారు. తర్వాత.. చదువూ, ఉద్యోగం" ఎక్కడో చూస్తూ అంది సునీత.

"నీకు నేర్చుకోవాలని ఉంటే హైదరాబాద్ వెళ్ళాక మళ్ళీ మొదలుపెట్టు. నేను కూడా నేర్చుకునేవాడినే కానీ.. నా గొంతులో ఆ స్వరాలే.. ఎక్కడో విహరిస్తుంటాయి"

చిరునవ్వు నవ్వుతున్న సునీతని అలా చూస్తుండిపోయాడు.

మళ్ళీ మనుపటి సునీత కనిపించింది. హాయిగా నిట్టూర్చాడు శ్రీనాథ్.




**జం**టనగరాల్లోని మార్కెట్లన్నీ మామిడి పళ్ళతో నిండిపోయాయి. సూపర్ బజార్లు, రిలయెన్స్ మాల్స్, బిగ్‌బజార్.. రైతుబజార్.. వీధి వీధినా బళ్ళు. ఎక్కడ చూసినా మామిడి పళ్ళే.

అన్నిరకాలూ.. బంగినపల్లి, నూజివీడు రసాలు, మల్లికా, పెద్ద రసాలు.. ఆఖరికి తోతాపురీ కూడా.

వంకరటింకరగా వడలిపోయిన లేత ఆకుపచ్చ ఇమాంపసందులు, జహంగీరులు, నీలంకాయలు కూడా వచ్చేశాయి.

కళ్ళు చెదిరేట్లు ఎక్కడ చూసినా పసుపు పచ్చగా కొన్ని.. ఇంకా ఎరుపు వన్నెకి తిరి

గినవి కొన్ని. అన్ని రంగులూ హుస్సేన్‌సాగర్ నీటిలో ప్రతిబింబిస్తూ, నోరూరించేలా లారీలతో వచ్చేశాయి.

దిల్‌సుఖ్‌నగర్ ఫ్రూట్ మార్కెట్ అయితే చెప్పక్కర్లేదు. బత్తాయిలూ, అరటి పళ్ళూ, జామకాయలూ.. అన్నీ ఒక మూలకి ఒదిగిపోయాయి. పుచ్చకాయలు, కర్బూజాలు మాత్రం, 'మేము మీ దాడిని తట్టుకోగలం' అన్నట్లు నిలబడ్డాయి.

గాలివాన వచ్చి నెల అయింది. ఈ సంవత్సరం మామిడికాయలు ఉండవనే అనుకున్నారు అందరూ. కానీ విచిత్రం. ఇంత పంట.. ఎక్కడ్నుంచి వచ్చాయో! ఆకాశంనుంచి మామిడిపళ్ళ వాన పడిందా అన్నట్టు వచ్చేశాయి.

ప్రజలు సంచీలతో సరిపోవని, గంపలతో ఎగబడ్డారు కొనడానికి.

ఖరీదు మాత్రం ఎక్కువగానే ఉంది. ప్రతీ ఏడూ ఉన్నదానికంటే ఎక్కువే. బేర మాడితే కొద్దిగా తగ్గిస్తున్నారు.

రైతుబజారు వరకూ వెళ్తే సగంరేటుకి వస్తున్నాయి. కానీ కాయలు బాగా లేవు.. ముందు చూడ్డానికే.. రంగు అస్సలు బాగా లేదు. పాలిపోయిన పసిమి. ముట్టుకుంటే, అక్కడక్కడ మెత్తగా.. అక్కడ వరకూ వెళ్ళిన వాళ్ళు కొనకుండా వెనక్కి వెళ్ళిపోతున్నారు. ఖరీదు ఎక్కువైనా, పెద్దషాపుల్లోనే కాయ ఐద్రూపాయల పైన పడినా కొనేస్తున్నారు. ఆంధ్రులకి అంత ప్రీతి అయిన పండు మరి. పండ్లలో రారాజు.

రైతు బజారుకి తీసుకొచ్చిన రైతులు తిట్టుకుంటూ ఇళ్ళకి తీసుకెళ్ళిపోతున్నారు. రెండు రోజులు చూసి కుళ్ళిపోతే కంపోస్ట్ ఎరువు గుంటలో కప్పెడుతున్నారు.

బాలయ్యకి ఎంతో ఆశ్చర్యమేసింది. కనీ వినీ ఎరుగని విధంగా ఈ వెల్లువేమిటి? ఎక్కడ్నుంచి వచ్చాయి? తనకి తెలిసి, తోటలన్నీ ఊడ్చుకుపోయాయి. కాయలన్నీ రాలిపోయాయి. జామ్‌లు చేసుకోవడానికి తప్ప ఎందుకూ పనికిరావు. ఊరగాయకి కూడా లేతగా ఉన్నాయి. ఒరుగులకి పులుపు లేదు. మొయినాబాద్ వెళ్ళి, కొన్ని పళ్ళు కొనుక్కొచ్చాడు. పెద్ద బంగినపల్లి పళ్ళు, నొక్కితే గట్టిగానే ఉన్నాయి. వాసన మాత్రం.. ఫరవాలేదు అనుకున్నాడు. ఇంటికెళ్ళి తొక్కుతీసి చెంప కోశాడు. లోపల లేత ఆకుపచ్చగా ఉంది. నోట్లో పెట్టుకుని చూశాడు. ఏ రుచీ లేదు. చప్పగా ఉంది. గాలివానలో పడిన కాయ పుల్లగానైనా ఉంటుంది. ఇదేమిటో! రుచి లేనితనం అంటే ఇదేనేమో అనుకున్నాడు. ఇంకొక కాయ కోస్తే, పైన గట్టిగా నవనవలాడుతూ ఉంది. లోపల మెత్తగా కుళ్ళిపోయి ఉంది. కాయ ఇలా అవడం జన్మలో చూడలేదు.

"థూ! ఇసుమంటి కాయ ఎక్కడ్నుంచి కొట్టుకొచ్చారో.. పెజల్ని మోసం చెయ్యడమే కదా!" అన్నాడు రేణుకతో.

అతనికి తెలియదు.. అవి అతని తోటలో కాసినవే అని. అతను కోసిన కుళ్ళు పండు, అన్నింటిలోకీ కాయ బాగా ఇచ్చే గౌరమ్మకి కాసిందే అనీ.

రంగు బాగాలేదు, షేపులూ బాగా లేవు అని తిరక్కొట్టబడి, గుంటలోకి వెళ్ళిపోయిన పళ్ళు ఎంత తియ్యగా, మంచి వాసనతో ఉన్నాయో ఎవరికీ తెలియదు. అవి పండించిన రైతులకీ, వాటిని తనలో ఇముడ్చుకున్న ఆ భూదేవికీ తప్ప.

★ ★ ★

రాణీ హేమాంబరీదేవి మూడీగా కూర్చుంది. రాజావారు ఆ రోజే హాంగ్‌కాంగ్ నుంచి వస్తున్నారు. ఎంత తెచ్చిపెట్టుకుందామన్నా ఉత్సాహం రావట్లేదు.

చివరికి తను అనుకున్న ఆశలన్నీ అడియాశలేనా! అన్నీ ఉన్నాయి తనకి. భగవంతుడ్ని ఎప్పుడూ ఏమీ అడగలేదు. తన

ఈ ఒక్క కోరికనీ తీర్చవచ్చు కదా! పేరున్న నిర్మాతలకీ, దర్శకులకీ ప్రతీ ఏడూ గ్రాండ్‌గా పార్టీ ఇస్తోంది. అయినా సరే ఎవరూ ఒక్కఛాన్స్ కూడా ఇవ్వలేదు. పైగా మొన్నట్నుంచీ ప్రయత్నిస్తోంది. ఎవర్నడిగినా ఈ సంవత్సరం పార్టీకి రాలేమని ఏదో కారణం చెప్తున్నారు. కనీసం టచ్‌లో ఉందామంటే అది కూడా కుదిరేట్లు లేదు. 'నాండీ పాపం వాడి లోపం లేకుండా శ్రమ పడ్తూనే ఉన్నాడు. తనమాట వినని పెద్దవాడికిచ్చిన శరీరాకృతిని, తనేదంటే అది చేసే చిన్నవాడికి ఎందుకియ్యలేదో దేముడు?' అని ఆలోచిస్తూ నైటీతోనే అలా సోఫాలో కూర్చుండిపోయి, టీవీ ఛానల్స్ మారుస్తోంది రాణీ మూడీగా.

అప్పుడే అన్నదమ్ములిద్దరూ నవ్వుకుంటూ హాల్లోకి వచ్చారు. వాళ్ళ నవ్వులు చూస్తుంటే రాణీకి చిర్రెత్తుకొచ్చింది. తనకున్న బాధలో వాళ్లకి వందోవంతూ లేదు.

"ఎందుకు నవ్వుతున్నారూ..?" తీక్షణంగా చూస్తూ అడిగింది.

"లేదు మమ్మీ! అన్నా నేనూ 'ఢీ' పిక్చర్ కెళ్ళాం. మూడోసారి వచ్చినా ఎంత రష్షో తెలుసా! అందులో బబ్లూ, శంకర్‌గౌడ్‌కి ఎట్లా టోకరా ఇచ్చాడో తల్చుకుంటే.. హ్హాహ్హాహ్హా"

"స్టాపిట్ నాండీ! నాకు చెప్పకుండా ఎందుకెళ్ళావ్ పిక్చర్‌కి? నీ ఎక్సర్‌సైజ్ షెడ్యూల్ ఏమయింది? ఎన్నిసార్లు చెప్పాలి, ఇలా అడ్డమైన చోట్లకీ వెళ్ళొద్దని. నీ యాంబిషన్ ఏంటో చెప్పానా? లేదా? స్టాప్ రోమింగ్ లైక్ ఎ వేగబాండ్" ఇంగ్లీష్‌లో, తెలుగులో ఆపకుండా తిడుతోంది.

సంతోషంతో పరవళ్ళు తొక్కుతున్న నాండీ వెక్కుతూ గదిలోకి వెళ్ళిపోయాడు, అనంత్ పిలుస్తున్నా వినిపించుకోకుండా.

"మమ్మీ! ఆపుతారా.." రాణి కంటే గట్టిగా అరిచాడు అనంత్.

"ఇవేళ ఆదివారం. ఈ రోజు ఫ్రీగా గడపవచ్చని మీరే తమ్ముడికి పర్మిషన్ ఇచ్చారు. మరిచిపోయారా? ఎప్పుడూ లేనిది ఈ రోజు అలా అరిస్తే బెంబేలు పడిపోడు మమ్మీ! వాడింకా పసివాడమ్మా! మీ ఆలోచనలు, ఆశలు తీర్చగల శక్తి తనకుందో లేదో తెలియదమ్మా వాడికి. నీ ఆశకోసం పగలూరాత్రీ కష్టపడుతున్నాడు. వాడిని ఎందుకు హింసిస్తున్నావు?"

ఇంట్లో పనివాళ్ళందరూ, దూరంగా వెళ్ళిపోయారు.

ఎప్పుడూ పక్కవాడికి తప్ప తన మాట వినిపించనట్లు మాట్లాడే అనంత్, ఎంత పెద్ద కంఠంతో అరుస్తున్నాడో! షాక్‌తో నోరు తెరుచుకుని చూస్తోంది రాణీ.

"వెళ్ళండమ్మా! వెళ్ళి ఇంకేమైనా దారులు ఉన్నాయేమో ఆలోచించండి. ఆ బక్క ప్రాణికి రాత్రి ఒక గంట ఖాళీ ఉంది. వాడికిష్టమైన చదువు చదువుకుంటున్నాడు. అది కూడా ఉపయోగించే ఉపాయం చూడండి" పెద్ద పెద్ద అంగలేస్తూ, నాండీ గదిలోకి వెళ్ళాడు అనంత్.

నాండీ, పరుపుమీద బోర్లా పడుక్కుని సన్నగా వెక్కుతున్నాడు. అనంత్ పక్కన కూర్చుని తమ్ముడి తల నిమిరాడు.

"అన్నా!" అంటూ అనంత్ ఒళ్ళో పడి

## కొత్తగాలి...

**బలిసిన అవినీతి రాజాల**
**నిండైన నల్లధనం రాణీల**
**రిజిష్టర్ మ్యారేజీకి**
**రాజకీయుల సాక్షి సంతకాలు**

*– తల్లాప్రగడ ప్రభాకర్,*
హైదరాబాద్

భోరుమన్నాడు నాండీ.

★ ★ ★

జూబ్లీహిల్స్, హైదరాబాద్. రోడ్ నెంబర్ ఇరవై ఐదులో ఒక పెద్ద భవనం. పెద్ద ప్రహరీగోడ అంతా దీపాలతో అలంకరించారు. భవనం ముందు షామియానా వేసుంది. కాంపౌండ్ లోపల కుర్చీలు వేసి, స్టేజ్ కట్టారు. వికాస్, శ్రీనాథ్ హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. అనంత్ అప్పుడే కారులో దిగాడు. భవనం బైట, గేటు పక్కగా, స్తంభాలకి, ఒకబోర్డ్ సిల్కు బట్టతో మూసి ఉంది. లోపల్నుంచి లక్కీ, సునీత, బిందు వచ్చారు.

సంపూర్ణ ఆరోగ్యంతో సునీత చక్కగా తయారయింది. తెల్లని పంజాబీ డ్రస్, ముత్యాలహారంతో మెరిసిపోతోంది. బిందు, లేత ఆకుపచ్చ షిఫాన్ చీరమీద ముదురు ఆకుపచ్చని ప్రింట్ ఉన్న బ్లౌజ్ వేసుకుంది. ఆకుపచ్చని పచ్చికలో తిరుగుతుంటే వనలక్ష్మిలా ఉంది. అసలే ముట్టుకుంటే కందిపోయే నాజూకుతనం.. అందులో షిఫాన్ చీర.. బిందు అందం వర్ణించడానికి కాళిదాసు కూడా సమయం తీసుకుంటాడేమో! లక్కీ, తన సహజ చురుకుదనంతో, అంతా తానే అయి తిరుగుతోంది.

అందరి కుటుంబ సభ్యులూ వచ్చి, కుర్చీల్లో కూర్చున్నారు. బాలయ్య, రేణుకల ఆనందం వారి వెలిగే మొహాల్లో, ఎవరూ చెప్పకుండానే తెలిసిపోతోంది.

వీధిలో కలకలం.. రాజావారి కార్లు వచ్చాయి. రాణీగారి చెయ్యి పట్టుకుని రాజావారు దిగారు. వెనకే నల్లని సూట్‌లో నాండీ.. పచ్చగా మెరిసిపోతున్నాడు. అప్పుడే గడ్డంకింద వస్తున్న వెంట్రుకలు అడ్డదిడ్డంగా పరుచుకున్నాయి.

మొహంలో అమాయకత్వం, నడకలో చురుకుదనం.. నాండీ ప్రత్యేకంగా కనిపిస్తున్నాడు. ఆ కదలికల్లో గ్రేస్.. రాజవంశ దర్జాని చూపిస్తోంది.

స్టేజ్ మీదికి రాజావారిని, రాణీగారినీ రమ్మని పిలిచాడు శ్రీనాథ్. విక్కీ ఇద్దర్నీ, వారి ముందు వినయంగా నడుస్తూ తీసుకెళ్ళాడు. రాజా ఈశ్వర్‌వర్మగారికి ఈ ప్రాజెక్ట్ సంగతి చెప్పగానే, తను సగం పెట్టుబడి పెడ్తానని చెప్పారు. కంప్యూటర్ ఫీల్డ్‌లోకి ప్రవేశించడం ఇదే ప్రథమం అతను. రియల్ ఎస్టేట్, ఫార్మాసూటికల్స్, గార్మెంట్స్ అతనికున్న ప్రధాన వ్యాపారాలు. ఇప్పుడు అనంత్ కోసమని ఇది కూడా చూద్దామనుకున్నారు.

శ్రీనాథ్ కేరళ నుంచి వచ్చేలోపుగా పూర్తిగా ప్రాజెక్ట్ గురించి అవగాహనకి వచ్చారు అనంత్, వికాస్. అనంత్ పెట్టుబడికి ప్రయత్నించడం, వికాస్ తన కుటుంబ సభ్యులతో చర్చించడం.. ఆఫీసుకి బిల్డింగ్ వెతకడం.. ఎంతమంది స్టాఫ్ కావాలో, ఎవరిని తీసుకోవాలో నిర్ణయించుకోవడం జరిగాయి.

"ఇదంతా చేసేస్తున్నాం.. ఒకవేళ శ్రీ ఒప్పుకోకపోతే? " వికాస్ సందేహించాడు.

"ఏముంది.. సింపుల్. ఎంప్లాయీలాగానే ఉంటాడు. సింగపూర్‌వాళ్ళు తీసుకుంటే ఎంత జీతం ఇచ్చేవాళ్ళమో అంత ఇద్దాం. అంటే ఫిఫ్టీ పర్సెంట్ పెరుగుతుంది జీతం. కానీ నాకు తెలిసున్నంత వరకూ కాదనడు శ్రీ. ఎందుకంటే ఇది సక్సెస్ అయితే ఆ జీతం పీనట్స్"

అనంత్ నమ్మకం వమ్ము చెయ్యలేదు సునీతా, శ్రీనాథ్‌లు. హైద్రాబాద్ రాగానే అనంత్‌తో శ్రీనాథ్ మాట్లాడాడు, మరునాటి నుంచీ ఆఫీసుకి వస్తానని.

"శ్రీ! నీకు వీలుంటే వెంటనే రాగలవా? చాలా ముఖ్యమైన విషయం"

సునీతని రేణుకకి అప్పగించి వెంటనే





వెళ్ళాడు శ్రీనాథ్.

వికాస్, అనంత్ కలిసి ప్రాజెక్ట్ రిపోర్ట్ అంతా చూపించారు.

"అంటే.. నువ్వు చేసింది వేరేవాళ్ళకి అమ్మడానికి. అందులో వాళ్ళకి వచ్చే లాభాల్లో మనది కొంతశాతం ఉంటుంది. ఇప్పుడు మనమే చేసుకుంటే మొత్తం ప్రాఫిట్స్ మనవే. రిస్క్ కూడా ఉంటుంద నుకో. సునీతతో కూడా ఆలోచించి నిర్ణయం తీసుకో. నువ్వు ఒప్పుకుంటే వచ్చే వారమే లాంచింగ్" అన్నాడు అనంత్.

'ఒప్పుకోకపోతే కూడా..' అని చెప్పలేదు అనంత్. అది వ్యాపార లక్షణం కాదు.

ఇప్పుడు అదే హడావుడి.. జూబిలీహిల్స్ ఇరవై ఐదో నంబర్ వీధిలో..

"ఏవీయస్ టెక్స్" సంస్థ ప్రారంభోత్సవం రాజా ఈశ్వర్‌వర్మగారిచే జరుగుతోంది. పురోహితుడు మంగళ శ్లోకాలు, ఆశీర్వచ నాలూ చదువుతుంటే గేటుపక్కన ఉన్న బోర్డుమీది పట్టు బట్టని రాజావారు, రాణీ గారితో కలిసి తొలగించారు. అందరూ చప్పట్లు కొట్టారు.

అనంత్, శ్రీనాథ్, వికాస్‌లు కొబ్బరికా యలు కొట్టారు.

అసలు రేణుక, శాంత, మాణిక్యంలతో కొట్టిద్దామని అనుకున్నాడు అనంత్.

కానీ శ్రీనాథ్ వద్దన్నాడు. "వద్దు అనంత్, ఎవరికీ సౌకర్యంగా ఉండదు. మీ అమ్మగారిని చూస్తే మా వాళ్ళకి బెదురు. ఆవిడ జమీందారీ బిడ్డ కదా!"

అనంత్ కూడా అదే మంచిదనుకు న్నాడు. రాణి ఎలాగూ ఎవరితోనూ కల వదు గదా?

ప్రారంభోత్సవం తర్వాత విందు భోజ నాలు. ఊర్లోని కొన్ని సాఫ్ట్‌వేర్ కంపెనీల యజమానులు, ఉద్యోగులు వచ్చారు. ఆహ్లాదంగా గడిచింది ఆ సాయంకాలం.

★ ★ ★

అనంత్ సూచించినట్లు పార్ట్‌నర్‌షిప్ తీసుకోవడానికి శ్రీనాథ్ చాలా ఆలోచిం చాడు. కుటుంబ సభ్యులనందర్నీ ఒకరోజు సమావేశపరిచాడు.

"సొంత వ్యాపారమా! చేసెయ్యి బేటా, మనకి నేలతల్లినీ, వానదేముడ్ని నమ్ము కోడం అలవాటే కదా? ఇప్పుడు కంప్యూట ర్‌ని నమ్ముకుందాం. అయినా మనకేం నష్టం లేదుకదా? నీ జీతం నీకిస్తమనే అంటున్నారు. ఇంకేముంది ఆలోచించడా నికి.." విన్న వెంటనే రేణుక తన అభి ప్రాయం చెప్పేసింది.

బాలయ్య మాత్రం "నిదానంగా అడు గెయ్యి బాబూ" అన్నాడు.

**కొత్తగాలి...**

**మనిషి జీవితంతో ముడిపడ్డ**
**ప్రేమ.. పెళ్లి వేరువేరు**
**ఇవి కలిసి ఉన్నట్టుగా నటిస్తాయి**
**రైలు పట్టాలలా..**

– యు. విజయశేఖరరెడ్డి,
కూకట్‌పల్లి, హైదరాబాద్

సురేష్, శాంతా ఏమీ మాట్లాడలేదు. అందులోని కష్టాలు వాళ్ళకి తెలుసు.

స్వంత కంపెనీ అంటే ఎటుపోయి ఎటొ చ్చినా తనకే నష్టం.. బాధ. సమయం గురించి ఆలోచించకుండా పనిచెయ్యాలి. మార్కెట్‌లో పోటీలనీ, ఎత్తులనీ అర్థం చేసుకోవాలి. ఉన్నవి చూసుకుంటూనే కొత్తకొత్తవి ఆలోచిస్తుండాలి.

అదే, జీతం తీసుకుని పనిచేస్తుంటే.. లాభం వస్తే జీతం, బోనస్ పెరుగు తుంది. నష్టం వస్తే.. ఇది కాకపోతే ఇంకొకటి. ముఖ్యంగా బాధ్యత చాలా తగ్గుతుంది.

అందులో మొదట్లో రాత్రింబవళ్ళు పని చెయ్యాలి. సునీత ఆరోగ్యం..? అంతసేపు తను వంటరిగా ఉంటే మళ్ళీ మొదటికొ స్తుందేమో!

ఇవన్నీ సురేష్ చెప్పకపోయినా, శ్రీనాథ్ తనే చర్చించాడు.

సునీత పూర్తిగా సహకరిస్తానంది. వ్యాపారమన్నాక రిస్క్ ఉండదా! తను, సంగీతం క్లాసులో చేరుతానంది. శమ్మం గుడి కచేరీ ఒక మధురానుభూతి ఆమెకు. అప్పట్నుంచీ, సగంలో వదిలేసిన సంగీతం పాఠాలు మళ్ళీ మొదలుపెట్టాలని ఉత్సాహంగా ఉంది.

మరి రాత్రిళ్ళు లేట్ అయితే..?

"నీతూ! అమ్మానాన్నల దగ్గిర ఉంటే నీకు లోన్లీగా ఉండదేమో.. నీకిష్టమైతే ఇక్కడుందాం. అమ్మ నిన్ను చూసుకుంటుంది. నాకు లేట్ అయినా భయం ఉండదు. లేకపోతే నీమీదే ఉంటుంది ధ్యాసంతా. ఇంటికంతా ఏసీ పెట్టిస్తాను" అన్నాడు శ్రీనాథ్.

"అలాగే శ్రీ! అత్తమ్మ దగ్గిర ఉండడానికి నాకేం? దూరమైందని కానీ లేకపోతే అప్పుడే ఉండేవాళ్ళం. మరి నీకు?"

"కారు, డ్రైవర్‌తో ఎలాగా ఉంటుంది. నేను వెళ్ళే టైములో పెద్ద ట్రాఫిక్ ఉండదు. ఇప్పుడు అర్ధగంట అవుతోంది.. అప్పుడు నలభై నిముషాలు.."

అలా అందరూ కలిసి కూలంకషంగా చర్చించాకే ఒక నిర్ణయానికి వచ్చారు.

"లాంచింగ్ ఫంక్షన్ గ్రాండ్‌గా జరిగింది" కార్లో కూర్చుని వెళ్తుంటే అంది రేణుక..

"బిడ్డలిద్దరికీ దిష్టి తియ్యాలె.. అందరి కళ్ళూ వీళ్ళమీదనే!" అందామె మళ్ళీ.

★ ★ ★

దసరా! పండుగ హడావుడి మొదలయింది. రేణుక ఆడపిల్లలిద్దర్నీ, అల్లుళ్ళతో సహా రమ్మని ఫోన్లు చేసింది.

"మరి నేను రావద్దా అమ్మమ్మా! నన్ను పిలవ్వేం..." రామలక్ష్మి కూతురు పింకీ, మూడేళ్ళది దెబ్బలాడింది. దానికి పెద్దమ్మ గడుసుతనం వచ్చింది. ఎప్పుడూ గలగలా మాట్లాడుతూ ఉంటుంది.

"నువ్వు లేకుండా వాళ్ళెక్కడికి వస్తరే పిల్లా? మామ పెద్ద అంచు పట్టుపరికిణీ కుట్టించిండు. మీ చిన్నమ్మవాళ్ళు అందరూ కలిసి రండి"

జయకి ఒక్కడే రెండేళ్ల కొడుకు, బంటీ.

తమ బిడ్డలిద్దరూ, ఒకరికొకరు తోడుగా ఒకతానే ఉన్నరు, కష్టానికి సుకానికీ అనేదే రేణుక, బాలయ్యలకి సంతోషం.

దసరాకి సునీత కుటుంబాన్ని కూడా పిలిచింది రేణుక. 'ఇక అందరం ఒకటే.. వాండ్ల అమ్మాయితో పండగ చేసుకోవాలని వాళ్ళకుండదా! అందరూ ఒక దగ్గర్నే ఉంటే పాయ!' అనుకుందామె.

సుజాత, వినోద్‌లు హైద్రాబాద్ వచ్చి నాలుగు నెలలయింది. ఇద్దరూ కేర్ హాస్పిటల్‌లో ఉద్యోగానికి చేరారు. బంజారాహిల్స్‌లోనే ఒక ఫ్లాట్ కొనుక్కున్నారు.

విజయదశమి వచ్చింది. తాము అమ్మావాళ్ళింట్లో ఉండడానికి నిశ్చయించుకోగానే, శ్రీనాథ్ ఇంటి వెనుక విశాలమైన హాలు కట్టించాడు. గదులు కూడా పెద్దవి చేసి, అన్ని గదుల్లో ఏసీ పెట్టించాడు. ఆధునికంగా ఉండేలా ముందు ఎలివేషన్ కూడా మార్చేశాడు.

"ఎంత బాగుందో? అప్పుడు మేం వచ్చిన ఇల్లేనా ఇదీ!" సుజాత ఆశ్చర్యం.

"మరి మారుతూ ఉండాలి కదమ్మా! అంతా మీ చెల్లెలు వచ్చాకనే" రేణుక, సాదరంగా ఇంట్లోకి ఆహ్వానిస్తూ అంది.

శాంతని, చెయ్యి పట్టుకుని మెట్లు ఎక్కించాడు సురేష్. కార్టిజోన్స్ వాడటం మొదలెట్టాక బాగా నడవగలుగుతోంది. కానీ మెట్లు ఎక్కడం మాత్రం కష్టమే శాంతకి.

జయ, రాము, అల్లుళ్ళు, మనవలు, మనవరాళ్ళతో సందడిగా ఉంటే రేణుకకి ఎంత సంతోషమో! అన్ని కార్లకీ పసుపు, కుంకం, అద్ది, బంతిపూల దండలు కట్టారు. ఆయుధపూజ చేయించారు.

బంటీకి ఒక ప్లాస్టిక్ సైకిల్ కొన్నాడు శ్రీనాథ్. వాడు అది కూడా తెచ్చి పూజ చేయించుకున్నాడు, ఇది నాదంటూ.

అరిశలు, బొబ్బట్లు, పులిహోర, గారెలు, రెండు కూరలు, పప్పు, పులుసులతో పండగ భోజనం ముగించారు. వంటామెని పిలిచింది రేణుక. తనే చెయ్యగలదు. కాయకష్టం చేసిన మనిషి, కానీ మనుమలతో గడపాలి కదామరి.

భోజనాలయ్యాక అందరూ హాల్లో కూర్చున్నారు విశ్రాంతిగా.

"కార్డ్స్ ఆడదామా? " సునీత సలహా.

"అల్లుళ్లకి తోట చూపించి వచ్చేస్తా తల్లీ. ఒక్కగంట.. ఆ తర్వాత ఆడుకోండి"

బాలయ్య, అల్లుళ్ళని తీసుకుని వెళ్ళాడు. అతనికి తోటంటే ఉన్న అభిమానం తెలిసిన అల్లుళ్ళు, మారు మాట్లాడక వెళ్ళారు.

ఏసీగాలి చల్లగా వస్తోంది. భుక్తాయాసం, తీర్చుకుంటూ అందరూ సోఫాలో దివాన్లమీద వాలారు. శ్రీనాథ్ అమ్మ పక్కన కూర్చున్నాడు. అతని భుజంమీద తలపెట్టి సునీత.

ఉన్నట్లుండి సుజాత అడిగింది "శ్రీ సునీతకి ఎలా ఉందిప్పుడు? మళ్ళీ ఏమీ ప్రాబ్లం రాలేదుకదా!"

సునీత నవ్వుతూ తలూపింది.

నిజంగానే సునీత చాలా బాగుంది. ఇంక మీగడ పాలూ, పెరుగులూ తగ్గించాలి అనుకుంటోంది.

"అసలు ప్రాబ్లం ఏంటి వదినమ్మా?" జయ అడిగింది.

శ్రీనాథ్ కంగారుగా చూశాడు 'డాక్టర్ అయ్యుండి నలుగుర్లో అడుగుతారా, ఇలాంటి సున్నితమైన విషయం?' అనుకుంటూ.

"ఫరవాలేదు శ్రీ! తగ్గిపోయాక మాట్లాడచ్చు. అది కూడా మంచిదే. సునీతకీ తెలియాలి కదా.. తను ఎందుకు అలా అయిపోయిందో అప్పుడు?" అంది సుజాత.

వినోద్ అవునన్నట్లు తలూపాడు.

"మా పెళ్ళి అవగానే అమ్మ సలహా ఇచ్చిందిట సునీతకి. నాక్కూడా తెలియదు. పిల్లలు పుట్టకుండా ఉండడానికి మాత్రలు వేసుకోవద్దమ్మా. త్వరగా పిల్లలు ఒకళ్ళో ఇద్దరో పుట్టే తను పెంచుతానని కూడా చెప్పిందట" అన్నాడు శ్రీనాథ్.

రేణుక భయంగా చూసింది. తను చెప్పింది నిజమే. దాని గురించా కోడలికి..?

శ్రీనాథ్ ఫరవాలేదన్నట్లు అమ్మ చెయ్యి నిమిరి, మొదలుపెట్టాడు.

"అది ఆవిడ అనుభవంతో చెప్పింది. మా పిన్నికి పిల్స్ పడక చాలా జబ్బు చేసింది. అది రేర్ అనుకోండి. కానీ పల్లెటూరి అమాయక స్త్రీకి తెలియదుకదా! మామూలుగా అందరి కోడళ్ళలాగే సునీత కూడా తేలిగ్గా తీసుకుంది. సునీతకి కూడా పిల్స్ పడినట్లు లేదు, అమ్మ భయపడినట్లే. వాంతులు, తల తిరగడం, బరువు పెరగడం, ఆహారం ఎక్కకపోవడం, అన్ని సైడ్ ఎఫెక్ట్స్ వచ్చాయి. అలాగే ఒక ఏడాది గడిపింది. అప్పుడు గుర్తుకు తెచ్చుకుంది అమ్మ చెప్పిన సంగతి. డాక్టర్ దగ్గరికి కూడా వెళ్ళాలనిపించలేదు. అంటే చిన్న చిన్న చికాకులు, ఇబ్బందులు కానీ పెద్ద సీరియస్‌గా తీసుకునే సమస్య కాదు. ఆ సమయంలో వదినవాళ్ళూ లేరుకదా!

వెంటనే పిల్స్ వాడడం మానేసింది. మానేసిన ఆర్నెల్ల వరకూ బాగానే ఉంది. అప్పట్నుంచీ డిప్రెషన్ మొదలైంది. జాబ్ మానేసింది. ఇంట్లో ఏమీ తోచక, ఏవేవో ఊహించుకోవడం, ఒక ఏడాది గడిచాక పిల్లల మీదికి ధ్యాస.. ఎందుకు ప్రెగ్నెన్సీ రావట్లేదు? పెద్దలమాట వినకపోవడం వల్లనే అని నమ్మకం ఏర్పడిపోయింది.

ఇద్దరం డాక్టర్ దగ్గరికి వెళ్ళి పరీక్షలు చేయించుకున్నాం. నార్మల్. అది తెలిశాక ఇంకా ఆందోళన. ఏ లోపం లేదుకదా! ఎందుకు రావట్లేదు? దీన్ని తెలుసుకునే సరికి చాలా రోజులు పట్టింది. జస్ట్ మేం కేరళ వెళ్లేముందు హాస్పిటల్‌లో ఉంది చూడండి.. అప్పుడే తెలిసింది.

ఇవన్నీ బాడీ కెమికల్స్ బాలన్స్ తప్పడం వల్ల జరుగుతాయని చెప్పారు డాక్టర్లు. అందుకే తనని ఒంటరిగా ఉంచద్దని నిర్ణయించుకున్నాం. సునీత కూడా సహకరించి నేను చెప్పినదానికల్లా ఒప్పుకుంది.

అబ్బబ్బా! అవి చాలా చెడ్డరోజులు. నీతుకి కళ్ళలోకి వచ్చేశాయి ప్రాణాలు. ఎంత భయపడ్డానో చెప్పలేను. ఎలాగయితేనేం బైటపడ్డాం. అప్పుడు హాస్పిటల్‌లోనే చెప్పారు.. అదే సమయంలో అబార్షన్ అయిందని"

సునీత చివ్వున లేచింది. "నాకు ఈ సంగతి చెప్పలేదేం శ్రీ?" పెదవులు వణుకుతుండగా అడిగింది.

## కొత్తగాలి...

**తెలియక చేసే అల్లరితనం పిల్లతనం**
**తెలిసి చేసే అల్లరితనం కుర్రతనం**
**కావాలని చేసే అల్లరితనం రాజకీయం**
**భరించక తప్పనితనం**
**సామాన్యుని జీవితం**

– జ్యోశే, ఒంగోలు

శ్రీనాథ్ తెల్లబోయాడు. సునీతకి ఆ సంగతి తెలియదని మర్చిపోయాడు.

సుజాత ఆదుకుంది ఆ సమయంలో. "అది మంచిదే నీతూ! సిస్టమ్ బాగానే ఉందని ప్రూఫ్. రేపు నా దగ్గరికి రా. ఎగ్జామిన్ చేసి ఏం ప్రాబ్లమో చూద్దాం. అవసరమైతే హార్మోన్స్ స్టార్ట్ చేద్దాం. అంతా సరిగానే ఉంటుంది. ఓకే.."

"మంచి కాఫీ పెట్టు నీతూ! నీ చేతి కాఫీ తాగి ఎన్నాళ్ళయిందో.." వినోద్ తేలిక చేశాడు వాతావరణం.

"కాఫీ అంటున్నట్లున్నారు.. మేంభీ వచ్చేశాం" లోపలికి వస్తూ జయభర్త సీతారామ్ అన్నాడు.

"అవునక్కయ్యా! మమ్మల్ని గుర్తు పెట్టుకోండి. మామయ్య తోట చాలా బాగుంది. పునాస కాయలు.. బరువెక్కువైపోయి, చెట్లన్నీ కిందికి వంగిపోతున్నాయి" రాము వాళ్ళాయన శంకర్, నాలుగు కాయలు సునీత చేతిలో పెడ్తూ అన్నాడు.

"ఒక్క పది నిముషాలు.. అక్కయ్య తెచ్చిన ఎలక్ట్రిక్ ఫిల్టర్ ఝూం ఝూం. డికాక్షన్ దిగిపోతుంది" సునీత వంటింట్లోకి వెళ్ళింది. వెనుకే జయా!

10



**ఒ**క్కసారి సీట్లోంచి ఎగిరి నుంచున్నాడు అనంత్.

"బిందూ! నువ్వు ఇక్కడ..? ఓహ్! ఎంత అదృష్టం!" బెల్ నొక్కి అటెండర్‌ని పిలిచి రెండు కాఫీ తెమ్మని చెప్పాడు.

"మీరు తలిస్తే ఈ అదృష్టం రోజూ ఉంటుంది" బిందూ నవ్వుతూ అంది. అనంత్ అయోమయంగా చూశాడు.

"ఇప్పుడు మీరేం పనిచేస్తున్నారో మర్చిపోయారా? నేను ఇంటర్వ్యూ అటెండ్ అవడానికి వచ్చాను. మీరు నన్ను ప్రశ్నలడిగి, నేను సరిగ్గా సమాధానాలు చెప్తే నాకు ఉద్యోగం ఇవ్వాలి"

"ఓహ్! నువ్వు కాండిడేటేనా! అప్లై చేసినట్లే తెలియలేదు. జర్నలిజమ్ వదిలేసి... సాఫ్ట్‌వేర్.. ఇది వచ్చా నీకు? "

"ఇలాగేనా ఇంటర్వ్యూ చేసేది.. కూర్చోపెట్టి సర్టిఫికెట్స్ చూసి, సబ్జెక్ట్‌కి సంబంధించిన ప్రశ్నలడిగి.."

"ఓకే.. ఓకే..! కూర్చోండి మిస్ హిమబిందూ! ప్లీజ్.." బిందు కూర్చున్నాక, అటెండర్ తెచ్చిన కాఫీ ఆమెకిచ్చి, తనూ తాగుతూ ఫైల్ చూశాడు.

"మై గాడ్.. యమ్.సి.ఏ బ్రదుకా కాలేజ్ ఫస్ట్. డిప్లమో ఇన్ జర్నలిజం.. కాక యస్ఏపి ట్రైనింగ్! మేడమ్ ఇవన్నీ ఎప్పుడు చేశారూ? హిందూ పత్రికలో ఎప్పుడు చేరారూ? ఇప్పుడు ఫీల్డ్ ఎందుకు మారుద్దామని అనుకుంటున్నారూ? మా కంపెనీలో చేరాలని మీకు ఎందుకు అనిపించిందీ? "

"మీరు ఒక ప్రశ్న తరువాత ఒకటి అడిగితే జవాబులియ్యగలను. నాది హ్యూమన్ బ్రైన్, కంప్యూటర్ కాదుకదా? " చిలిపిగా నవ్వుతూ అందామె.

"నాకిప్పుడు ఇరవై ఎనిమిదేళ్ళు. ఇంకా అన్ని కోర్సులు చెయ్యగల టైమ్ ఉంది. కానీ జనంపై దయతల్చి చెయ్యలేదు. అంటే నేను చేసినప్పుడల్లా ఒక నీడీ పర్సన్‌కి సీటు గోవిందా కదా? అందుకని. కొంతకాలం మైక్రోసాఫ్ట్‌లో చేశాక బోర్

కొట్టి హిందూలో చేరా. అది ఎంజాయ్ చెయ్యడం అయిపోయింది. ఇప్పుడు మళ్ళీ సాఫ్ట్‌గా ఉందామనిపించింది. మీది అప్‌క మింగ్ కంపెనీ.. ఎదగడానికి అవకాశం ఉంటుందని అప్లై చేశా. అదీ సంగతి"

అనంత్ నవ్వుతూ వింటున్నాడు.

"సారీ! మీరు బాస్ అన్న సంగతి మర్చి పోయి ఇలా అనేశాను. అంటే రాగానే మీ రిచ్చిన ట్రీట్‌మెంట్ అలా ఉంది మరి" అంటూ కాఫీకప్ తీసుకుంది బిందు.

"ఫరవాలేదు. ఒక్క నిమిషం.." ఇంట ర్‌కాం నొక్కి విక్కీని, శ్రీనాథ్‌ని పిలిచాడు.

"గుడ్ మానింగ్!" విక్కీ, బిందుని చూసి కళ్ళెగరేశాడు. శ్రీనాథ్ చిరునవ్వు నవ్వి కూర్చున్నాడు.

"మనం అడ్వర్టైజ్ చేసిన క్వాలిఫికేషన్స్ అన్నీ ఉన్నాయి. ఏం చేద్దాం?" బిందు ఫైల్ తిరగేస్తూ అన్నాడు అనంత్.

"నీకు ఎలా అనిపిస్తే అలా అనంత్" విక్కీ మొహమాటంగా అన్నాడు. అప్లై చేస్తున్నట్లు తనకి చెప్పనే లేదు. ఏం అంటాడు.

"మనకి కావలసిన రిక్వాయిర్‌మెంట్స్ ఉన్నప్పుడు, వికాస్ చెల్లెలు కదా అని, తీసు కోకపోవడం అన్యాయం అనంత్! రెండు కాకపోతే ఆరునెలలు ప్రొబేషన్‌లో ఉంచి తీసుకోవచ్చని నా ఉద్దేశం" శ్రీనాథ్ సరైన ఐడియా ఇచ్చాడు.

"నువ్వు చెప్పింది నిజం శ్రీ! బట్, బిందూ.. నువ్వు నీకు ఇచ్చిన జాబ్ మాత్రమే చెయ్యాలి. అది డాటా కలెక్షన్. మన ప్రాజెక్ట్ తెలుసుకదా! ప్రపంచంలో ఎన్ని కంపెనీలు గూగుల్ వంటి సెర్చ్ ఇంజన్స్‌ని అడ్వర్టైజ్‌మెంట్స్‌కి వాడుకుంటు న్నాయో, సెర్చ్ ఇంజన్స్‌లో పొజిషన్స్‌కి ఎంత కాంపిటీషన్ ఉందో.. అవి మారా లంటే ఎలాంటి మార్పులు చెయ్యొచ్చో. ఆ మార్పులు ఏ కంపెనీలకి ఉపయోగి స్తాయో.. ఇలా.. నీకు ఇద్దరు అనలిస్ట్‌లని ఇస్తాం. మీ ముగ్గురి జాబ్ కేవలం డాటా కలెక్ట్ చేసి, శ్రీకి రిపోర్ట్ పంపడం. దానిని మించి నీకు నిర్ణయాధికారాలుండవు. ఓకే. జీతం యాడ్‌లో చెప్పాంకదా! నీ పనివల్ల ఏమయినా లాభాలు, క్లయింట్స్ దొరికితే, పెంచుతాం. ఇప్పటికి ఇయర్లీ త్రీ లాక్స్"

"కుదరదు సార్! నాకు హిందూలోనే అంత వస్తుంది. ఫోర్ లాక్స్ ప్లస్, రెండు నెలల జీతం బోనస్, ప్లస్ ఇయర్లీ టెన్ పర్సెంట్ రైజ్ అయితే ఇప్పుడే చేర్తాను" నిర్మొహమాటంగా అంది బిందు.

విక్కీ ఇబ్బందిగా చూశాడు.

శ్రీ మెచ్చుకున్నట్లు చూశాడు. అంత నమ్మకమన్నమాట, ఆమెకు తన పనిపైన.

అనంత్ తను ఆరాధిస్తున్న అమ్మాయి అన్న సంగతి మర్చిపోయి, ఐదు నిమి షాలు పక్కా వ్యాపారస్తునిలా, లాభన ష్టాలు బేరీజు వేసుకున్నాడు. చివరగా అన్నాడు.."ఓకే! జాయిన్ నౌ"

★ ★ ★

సునీతని పరీక్ష చేసి, తెర పక్కనున్న బేసిన్‌లో చేతులు కడుక్కుంది సుజాత. డాక్టర్ కూర్చునే కుర్చీకి ఎదురుగా కూర్చున్న శ్రీనాథ్ లేచాడు.

సునీత, తెర వెనుక నుంచి నెమ్మదిగా నడుస్తూ వచ్చింది.

"కూర్చో శ్రీ! అంత ఆందోళన చెందా ల్సిందేమీ లేదు. అంతా నార్మల్‌గా ఉంది. ఈ వారంలో హాస్పిటల్‌లో చేరుద్దాం. ఒక చిన్న సమస్య ఉంది, అది తీరిపోతే.."

శ్రీనాథ్, సునీతా గాభరాగా చూశారు.

"అబ్బే! అలా చూడకండి. చాలా సింపుల్. డి అండ్ సి చేసి, క్లీన్ చేస్తాను. గర్భసంచి ద్వారం పెద్దదిగా ఉంది. అందుకే ప్రెగ్నెన్సీ వచ్చినా నిలవట్లేదు. కుట్లువేసి చిన్నది చేస్తాను. తర్వాత ఏ ప్రాబ్లం ఉండకూడదు. డిప్రెషన్

మందులూ, తలనొప్పి, నాసియా మందులూ ఏమీ వేసుకోవద్దు"

★ ★ ★

సుజాత సలహా ఇచ్చినట్లే మూడురోజుల తర్వాత హాస్పిటల్‌లో చేరింది సునీత. ఆపరేషన్ అవుతున్నప్పుడు రేణుక, బయట కుర్చీలో కూర్చుని మొక్కులు మొక్కేసింది. ఇంటికి వచ్చాక మంచం మీదనుంచి దిగనియ్యలేదు.

సుజాత అన్నట్లుగానే ఒక నెల గడవకుండానే నెల తప్పింది సునీతకి.

అందరి సంతోషానికీ అవధుల్లేవు. రేణుకైతే సుజాతని ఎత్తేసుకుంది.

"అత్తమ్మా!" కెవ్వున అరిచింది సుజాత. శాంతా, సురేష్ నవ్వుతూ చూస్తున్నారు.

"ఇంత మంచి వార్త చెప్పావు. ఏమియ్యగలము కోడలుపిల్లా!"

"అత్తమ్మా! ఎందుకైనా మంచిది, నీతూని బరువులు ఎత్తనియ్యద్దు ..ముఖ్యంగా ఐదునెల్లు నిండేవరకూ"

"బరువులు ఎత్తడమా? ఇక్కడి పుల్ల అక్కడ పెట్టనియ్యి. ఎంత అపురూపంగా చూసుకుంటానో మీరే చూస్తారు కదా!" రేణుక హుషారుగా అంది.

"అన్నీ మీరే చూసుకోవాలి వదినా. భగవంతుడు నాకు ఆరోగ్యాన్నివ్వలేదు" శాంత మొహంలో నిస్సహాయత.

"అదేంటి వదినమ్మా! మీకు బంగారాల్లాంటి కూతుళ్ళనిచ్చాడు. బాధపడకండి"

"అంతే బంగారం వంటి అల్లుళ్ళూ కూడా.." సురేష్ అంటుంటే ముసి ముసి నవ్వులు నవ్వింది రేణుక గర్వంతో.

★ ★ ★

బిందు వచ్చినప్పటి నుంచీ ఏవీయస్ టెక్స్ అంతా సందడే సందడి. చురుగ్గా తిరుగుతూ, అందర్నీ ఆటపట్టిస్తూ, నిముషం కూడా వృథా చెయ్యక పని చేస్తుంటుంది. ఏవీయస్ టెక్స్ ఇప్పుడిప్పుడే వెబ్ మార్కెట్‌లో స్థానం సంపాదించుకుంటోంది.

"గూగుల్‌లో అంతా గోలగోలగా ఉందిట" ఒకరోజు బిందు అనౌన్స్ చేసింది, నెట్ సర్ఫింగ్ చేస్తూ.

"దేనికి మేమ్?" అనలిస్ట్ అడిగాడు.

శ్రీనాథ్ కూడా ఆ గదిలోనే ఉంటాడు, ఎప్పటికప్పుడు బిందూ వాళ్ల రిపోర్ట్‌లు అధ్యయనం చేస్తూ.

"అదే, సెర్చ్‌లో వచ్చే యాడ్స్ గురించి. బ్రౌజర్‌లు కంప్లైంట్ ఇస్తున్నారుట. పక్కన ఈ కదిలే యాడ్స్ కళ్ళకి 'పెయిన్ ఇన్ ద ఐ బాల్‌లా' తయారయ్యాయని"

"ఇదో కొత్త ఐడియా మేమ్" నవ్వుతూ

## ఆహా! ఏమి రచన?

విజ్ఞానచంద్రికామండలి వెలువరించిన చారిత్రక నవలల్లో బహుమతి పొందిన 'విజయనగర సామ్రాజ్యం' గురించి గురజాడ హాస్యంగా విమర్శించారు.



"ఈ నవలలో వర్ణించిన యుద్ధవృత్తాంతం అబద్ధాలకు పెట్టింది పేరు. ఇందులోని రాజులు, సేనాధిపతులు ఒకేసారి యుద్ధరంగంలో పాల్గొంటారు. సేనానాయకులు తమ తమ కాపలా స్థలాలను విడిచిపెట్టి నవలాకారుడు ఎక్కడికి రమ్మంటే అక్కడికి, ఎప్పుడు పిలిస్తే అప్పుడు ప్రత్యక్షమవుతుంటారు. నాటకీయతకోసం రచయిత వారిని చీటికీ మాటికీ తన చిత్తం వచ్చిన రీతిలో అటూ ఇటూ తిప్పుతూనే ఉంటాడు. దాంతో సైనిక శ్రేణులు సైతం చెల్లాచెదరై ఒక వరసావాడీ లేకుండా చిందర వందరవుతాయి. రచయిత తన ఊహలతో ఆ సైన్యాన్ని పరుగులెత్తించాడు"

అన్నాడు ఇంకో అనలిస్ట్ కుర్రాడు.

"అవునయ్యా! ఒక మూవ్‌మెంట్‌ని చూడగలం క్లియర్‌గా. పోనీ ఇంకొకటి, రెండు కళ్ళున్నాయి కనుక. కానీ పది చూడాలంటే, ఏదీ కనిపించదు. అదే.. పెయిన్ ఇన్ ద ఐ.."

"కరెక్ట్‌గా చెప్పావు బిందూ" శ్రీనాథ్ రిపోర్ట్ చూస్తూ అన్నాడు.

"మన టీవీ ఛానల్స్‌లోలాగా. అవయితే కట్టి పడేస్తాం. ఈ బ్రౌజింగ్.. మనకి కావల్సింది దొరికే వరకూ తప్పదు కదా!" అప్పుడే వచ్చిన అనంత్ అందుకున్నాడు.

అందరూ లేవబోయారు.

కూర్చోమని చేత్తో సైగచేసి, అక్కడున్న బల్లమీద కూర్చున్నాడు అనంత్, అన్ని కంప్యూటర్స్ కనిపించేలాగ.

"అబ్బో! టీవీ ఛానల్స్ సంగతి మాట్లాడద్దు. న్యూస్ ఛానల్స్ అయితే రెండు, మూడు నాలుగు.. సగం స్క్రీన్ స్క్రోలర్స్‌తో నిండిపోతోంది. అసలు మెయిన్ న్యూస్, పక్కన క్లిప్పింగ్స్, కిందా పైనా స్క్రోలర్స్.. అన్నీ ఒక ఫ్రేమ్‌లో ఉన్నపుడు లెక్కపెడితే ఎనిమిదో, తొమ్మిదో ఉంటాయి. ఒక మూమెంట్లో మనిషి ఎన్ని చూడగలడని కూడా ఆలోచించడంలేదు. తలనొప్పి" నెత్తి కొట్టుకుంది బిందు.

"ఏదో చిన్నారులు బాగా పాడుతున్నారని, సరిగమపాలు చూస్తున్నామా! అందులో పాడేవాళ్ళ వెనుక ఇరవైమంది డాన్సులు, రకరకాల రంగుల డ్రస్సులు వేసుకుని. దాంతో ఆ పిల్లలు కనిపించక, ప్రేక్షకులు కళ్ళు చికిలించుకుని చూడ్డం.. అది కూడ కళ్ళకి గ్లకోమా తెప్పిస్తోంది. పాపం ఆ చిన్నారులు డిస్ట్రాక్ట్ కాకుండా ఎలా పాడుతున్నారో! ఐ పిటీ దెమ్" అనంత్ మాటలకి అంతా తలలు ఊపారు.

ఈవేళ అనంత్ తీరికగా ఉన్నట్లున్నాడు.. బల్లమీద స్థిరపడిపోయాడు.

"అవును. అందుకే నేను చూడ్డం మానేశాను. ఇంక ఆట-పాట, ఒకటి, రెండు, మూడు.. వంద వంటివి చెప్పక్కర్లేదు. యాక్" బిందు అనేసి నాలిక్కరుచుకుంది.

అనంత్ పకపకా నవ్వాడు.

"ఇంతకీ గూగుల్ కథేంటి? "

"అదే రెండు వర్గాలయిపోయారుట. కొంతమంది యాడ్స్ కావాలనీ, కొంతమంది వద్దనీ. మరి ఆ యాడ్సే కదా బిడ్డింగ్స్‌లో బిలియన్లు తెచ్చేది. వద్దంటే మానేస్తారేంటి? " బిందు నవ్వింది.

"నయం. సెర్చ్ ఇంజన్లు యాడ్స్ మానేస్తే... మనలాంటివాళ్ళ మాటేంటి.." బిందూని అనుకరిస్తూ అన్నాడు శ్రీనాథ్.

అందరి మొహాల్లో నవ్వు.. బిందూని భయంగా చూస్తూ అదిమిపెట్టుకున్నారు.

బిందు అవేం పట్టించుకోలేదు.

"కరెక్ట్ శ్రీ! ఎవరో వద్దంటే మానెయ్యడమే.. మన ఆట-జూనియర్ లాగ నిరంతర దీక్షతో సాగిపోవాలి కానీ! మరి మనకి సంతోషం కలిగించే గాసిప్ ఏమీ లేదా బిందూ? " అనంత్ అడిగాడు.

"హు! ఇదేమీ గాసిప్ కాదు.. ఓకే! అదర్ వెర్షన్.. అండ్ గుడ్ న్యూస్.. యాడ్స్ మీద క్లిక్‌లు బాగా పెరిగాయట.. అందులో మనం బిడ్ చేసిన హెర్బల్ ప్రాడక్ట్‌లకు"

"వెరీగుడ్. అది చాలా మంచి న్యూస్"

"మేమ్! ఈ క్లిక్‌ల గురించి నాకు అంత ఐడియా లేదు. కొంచెం చెప్తారా? " కొత్త కుర్రాడు అడిగాడు.. అనంత్ ఎదురుగా అడిగినందుకు భయపడుతూనే.

బిందు మొదలుపెట్టింది. అసిస్టెంట్లకి విజ్ఞానం పెంపొందించడం కూడా తన బాధ్యతే. అనలిస్ట్‌కి ఫరవాలేదని సైగ చేస్తూనే అనంత్ కుతూహలంగా చూస్తున్నాడు, ఏం చెప్తుందా? అని.

"గూగుల్, యాహూ వంటి సైట్లలో..




కంప్యూటర్ ఉపయోగించేవాళ్ళు, వాళ్లకి కావలసింది వెతుక్కుంటుంటే పక్కనే దానికి సంబంధించిందే ఒక ప్రొడక్ట్ యాడ్ వస్తుంటుంది. కుతూహలంకొద్దీ బ్రౌజర్లు, దానిమీదికి మౌజ్ తీసుకెళ్ళి నొక్కుతారు. అది ఒక క్లిక్ అవుతుంది. ప్రతి క్లిక్‌కీ కంపెనీ బిడ్డింగ్‌ని బట్టి, గూగుల్‌లాంటి సెర్చ్ ఇంజన్లకి ఇంతని డబ్బు కట్టాలి.

అంటే ఒక అడ్వర్టైజ్‌మెంట్‌ని ఎన్ని సార్లు నొక్కితే గూగుల్‌కి అంత డబ్బు. అదే నెలకి రెండు మిలియన్ల డాలర్లవరకూ ఉంటుందని అంచనా. నొక్కిన ప్రతీవారూ అందులో వచ్చే వస్తువుల్ని కొంటారని లేదు. పదిమంది నొక్కితే ఒకరు కొంటే గొప్ప. అందులోనే అమ్మేవారికీ, సెర్చ్ ఇంజన్ల కంపెనీలకూ లాభాలుండాలి.

ఆ క్లిక్‌లు అమ్మేవారి సంగతి ఎలా ఉన్నా యస్ఈ (సెర్చ్ ఇంజన్)లకి మాత్రం లాభాల్ని తెచ్చిపెడుతున్నాయి. కానీ మనలాంటి కంపెనీలకి ఎన్ని క్లిక్‌లకి అమ్మకాలు జరిగితే అంత లాభం. ఎందుకంటే ఎవరి ప్రొడక్ట్ అమ్మకం జరక్కపోయినా వాళ్ళు కాంట్రాక్ట్ రద్దుచేసే అవకాశముంది. మనకి పేపర్ క్లిక్ కాదు.. యస్ఈలకి లాగ. పేపర్ సేల్ అన్నమాట.

నేను గూగుల్‌లో గొడవ అని అదే సంగతి చెప్తున్నాను ఇందాకా.

ఈ అడ్వర్టైజ్‌మెంట్లతో సెర్చ్ చేస్తున్న పేజీ స్క్రీన్ రావడానికి ఆలశ్యమవుతోందని కొంతమంది గొడవ. గూగుల్‌కయితే ఆ ఇబ్బంది లేదు. వాళ్ళవి గిగాగిగా బైట్లు. కానీ ఇతర ఇంజన్లకి మాత్రం ఈ యాడ్స్ గొంతులో పచ్చి వెలక్కాయే.

కానీ యాడ్స్ తెచ్చే డబ్బు. అదీ వదులుకోలేం. అలా పోటీ ప్రపంచంలో జీవన ప్రక్రియ సాగిపోతూ ఉంటుంది. చిన్నాచితకా టెక్నాలజీల వంటి సంస్థలు పుట్టగొడుగుల్లా వస్తూనే ఉన్నాయి. అవి అన్నీ జాన్సన్ అండ్ జాన్సన్, ప్రాక్టర్ అండ్ గ్రాంబుల్ వంటి పెద్ద వ్యాపార సంస్థల యాడ్స్ కోసం పోటీపడుతూంటాయి" బిందు ఆగి మంచినీళ్ళు తాగింది.

అనంత్‌తో సహా అందరూ చప్పట్లు కొట్టారు.

"నువ్వు మన కంపెనీకి మంచి యస్సెట్ బిందూ!" అనంత్ మెచ్చుకుంటుంటే, బిందు బుగ్గలు ఎర్రబడ్డాయి.

★ ★ ★

సునీతకి సీమంతం ఏర్పాటు చెయ్యాలని

---

## సెప్టెంబరు - 2011
### చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. డా. కె. అనిత
 - గాంధీ మెడికల్ కాలేజ్, సికింద్రాబాద్
2. ఎం. సబిత
 - తణుకు, ప. గో. జిల్లా
3. వి. సీత
 - కరెన్సీనగర్, విజయవాడ
4. ఎ.ఎ. జయప్రకాష్
 - విద్యానగర్, హైదరాబాద్
5. ప్రమోద్
 - లోతుకుంట, సికింద్రాబాద్

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. వినోద్ / పవన్ | 6. డాఫ్నె డ్యూమారియర్ |
| 2. రాధ | 7. థియోడర్ డ్రీజర్ |
| 3. దుర్గారెడ్డి | 8. పి.వి. నరసింహారావు |
| 4. సూర్యారావు | 9. యు.ఆర్. అనంతమూర్తి |
| 5. సాంబశివరావు | 10. 1775–1783 |

అనుకుంది రేణుక. అదీ రెండుసార్లు.

ఒకసారి తమ చుట్టాలందర్నీ పిలిచి, కోడిని కోసి, బిరియానీ దావత్.

ఇంకొకసారి, సునీత బంధువులు అందరికీ భక్ష్యాలూ, పులిహోర, బూరెలూ, గారెలతో వెజిటేరియన్ భోజనాలూ.

"అమ్మాయ్! ముందు ఎవరికి పెడదాం? మనవాళ్ళని పిలిచినప్పుడు వదినమ్మనీ, అన్నయ్యనీ మాత్రం పిలుద్దామని అనుకుంటున్న. వాళ్ళయితే నాన్ వెజ్ ఉన్నా ఏమనుకోరు. మీ బంధువులు అందర్నీ పిలిచినప్పుడు కాటరింగ్‌కి ఇచ్చేద్దాం. ఏమంటవు? " సునీతని ఐదో నెల వచ్చాక అడిగింది రేణుక.

"మనవాళ్ళకి ఇక్కడ చేద్దాం అత్తమ్మా! హైదరాబాద్‌లో అమ్మా, అక్కా చేస్తామని అంటున్నారు" సిగ్గుగా అంది సునీత.

రేణుక అన్నట్లుగానే కోడల్ని కాలు కింద పెట్టనివ్వడంలేదు. పాలేరు జంట ఉండనే ఉన్నారు చేతికింద.

"అత్తమ్మా! ఏడోనెల వచ్చేవరకూ సీమంతానికి ఆగాల్సిందే. మీ ఆత్రం నాకు అర్థమైందికానీ తప్పదు. బిడ్డ బాగా పెరుగుతోందికానీ ఎందుకు రిస్క్, చెప్పండి" సుజాత ఆవిడ ఉత్సాహానికి ఆనకట్ట వేసింది.

ఐదో నెలలో స్కానింగ్ అయింది. బిడ్డ కదలడం మొదలుపెట్టాక అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

"ఫీటస్‌దేం ప్రాబ్లం కాదు శ్రీ! సునీత స్ట్రక్చర్‌లోనే ఉంది. అందుకనే తనని కేర్‌ఫుల్‌గా ఉండమనాలి. సాధ్యమైనంత వరకూ పడుకునే ఉండమనండి"

సుజాత ఇచ్చిన వార్నింగ్‌కి సునీతని కాలకృత్యాలకి తప్ప దేనికీ కదలనియ్యడం లేదు రేణుక.

మంచి మంచి ఆడియో సీడీలు పంపారు జయా, రామూ. టీవీ తమ గదిలోకి మార్పించాడు శ్రీనాథ్.

"చూసే ప్రోగ్రామ్స్, సెన్సార్ చేస్తే ఎలా శ్రీ! హారర్ సినిమాలు చూడద్దని అంటే.." సునీత గొడవ పెట్టింది.

"మన పాపాయి కోసమే! ఏ సమస్యలూ ఉండకూడదనే.." శ్రీనాథ్ సముదాయించి, చందమామ కథలు వినిపిస్తున్నాడు.

అలా ఏడోనెల వచ్చింది సునీతకి.

"రాము చిన్నచిన్న నాప్కిన్లూ, జుబ్బాలు బెడ్ కవరూ కుట్టి పంపింది. జయా, రామూ ప్రతీరోజూ ఫోన్లు చేస్తున్నారు.

సీమంతానికి రావడానికి తయారవుతున్నారు అందరూ!

★ ★ ★

ఏడోనెల వచ్చిన పదిహేను రోజులకి సీమంతం ముహూర్తం పెట్టారు, చిలుకూరు బాలాజీ గుళ్ళో ఉండే గురువుగారు.

"అత్తమ్మా! రెండుసార్లు సీమంతం పెట్టకండి. సునీత నీరసంగా ఉంది. అందర్నీ ఒకేసారి పిలిచి, భోజనాలు లేకుండా పేరంటం చెయ్యండి. అలా అయితే అలసిపోకుండా ఉంటుంది" ఏడో నెల రాగానే పరీక్ష చేసిన సుజాత చెప్పింది.

ముందు నిరాశ చెందినా, కోడలి ఆరోగ్యం, లోపల బేబీ క్షేమం దృష్ట్యా సరేనంది రేణుక.

శాంత దేనికీ ఏమీ మాట్లాడదు. ఆవిడకి డయాబిటిస్ కూడా. అంతులేని నీరసం. తనే ఒక గాజుబొమ్మలా వుంది. కూతురిని పురిటికి తీసుకు రావడమే కష్టం. మొదటిసారి పుట్టింటివాళ్ళు తీసుకెళ్ళాలి కనుక తప్పదు. ఇంకా సీమంతం కూడానా?

సునీత అత్తింటివారు మంచివారు కనుక సరిపోయింది. శాంత దేముడికి కృతజ్ఞతలు తెలుపుకోనిరోజు లేదు.

సీమంతం ముహూర్తం పెట్టినప్పట్నుంచీ, రేణుక హడావుడి మొదలయింది. ఇల్లంతా రంగులు, హాల్లో, వరం




డాలో ముగ్గులు వేయించింది.

వీధిలో గోడలకి, కిటికీలకీ, పెరట్లో.. బైట అన్నిచోట్లా ఎలక్ట్రిక్ దీపాల తోరణాలు పెట్టించింది. కార్డులు అచ్చు వేయించి ఇళ్ళకీ స్వయంగా వెళ్ళి పిలిచింది.

భోజనాలు పెట్టుకోలేదు కనుక దగ్గరగా ఉండేవాళ్ళనే పిలిపించి, ఫలహారాలే అయినా, పూరీ, కూర.. పులిహోర వంటివి చేయించి భోజనాలలాగానే ఉండేట్లు చూద్దామని అనుకుంది.

సీమంతంరోజు రానే వచ్చింది.

రాముా, జయా వచ్చారు, పిల్లల్ని తీసుకుని. అల్లుళ్ళకి సెలవు దొరకలేదంట. బారసాలకి వస్తామని చెప్పారు.

పొద్దున్నే సునీతకి నలుగు పెట్టి తల స్నానం చేయించారు. పురోహితుడు వచ్చి

ఆయుష్‌హోమం చేయించి, పూజ చేశారు.

పసుపు పచ్చని కంచిపట్టు చీరకి ఎరుపు బోర్డర్... జరీగీతలు ఉన్న చీరని సురేష్, శాంతా సెలెక్ట్ చేసి, జాకెట్ కూడా కుట్టించి తీసుకొచ్చారు. ఆ చీర కట్టుకుని, నగలన్నీ వేసుకుని గౌరీదేవిలా మెరిసిపోతోంది సునీత.

శ్రీనాథ్‌కి చెప్పి, నాలుగు బంగారు గాజులు, ఒక గొలుసు కొనిపించింది రేణుక.

భోజనాలయ్యి అందరూ విశ్రాంతి తీసుకుంటున్నారు. పేరంటాళ్ళు సాయంకాలం నాలుగు గంటలకి వస్తారు.

జయా, రామూ ముత్తయిదువులకి ఇవ్వవలసిన సామాన్లు.. గాజులు, పసుపు కుంకం, జాకెట్టు బట్ట, శనగలు వేసిన ప్లాస్టిక్ డబ్బా, లడ్డూలు సంచుల్లో కడుతున్నారు.

సునీత అప్పుడే నిద్ర లేచింది.

"అత్తమ్మా! కాఫీ.." అంటూ మంచం మీదనుంచి లేవబోయింది. అంతే..

"అమ్మా!" అని పెద్దగా కేకేసి, కిందపడిపోయింది.

రేణుక, జయ, రాము పరుగెత్తుకుని వచ్చారు. అదే సమయానికి సుజాత కారు వచ్చి ఆగింది.

కారు శబ్దం విని, జయ గబగబా వచ్చి సుజాతని గదిలోకి తీసుకెళ్ళింది.

కిందపడిన సునీత, బాధతో 'అమ్మా అమ్మా!' అని అరుస్తూనే ఉంది.

సునీత పల్స్, బేబీ పరిస్థితి... ఆమె కండిషన్ అన్నీ చూసింది సుజాత. పరీక్ష చేసి.. అంది..

"అర్జెంటుగా హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. ఆపరేషన్ చేసి బిడ్డని బైటికి తియ్యాల్సిందే. కమాన్.. వినూ! కార్ తిప్పండి. మనం తీసుకుని వెళ్దాం. శ్రీనాథ్ వాళ్ళు తర్వాత వస్తారు. నొప్పులు వస్తున్నాయి. మావి అడ్డుకుపోయినట్లుంది. సునీతని నెమ్మదిగా నడిపిద్దాం. పదండి.." హడావుడి పెట్టేసి, వెనక సీట్లో దుప్పట్లు వేసి సునీతని కదలకుండా కూర్చోమని చెప్పి కారు ఎక్కించింది.

వినోద్ కారు స్టార్ట్ చేస్తుండగా వచ్చారు, శ్రీనాథ్, వికాస్, లక్కీ. ఆ రోజు ఆఫీస్‌లో అర్జెంట్ పని ఉంటే శ్రీనాథ్ వెళ్ళాడు.. సీమంతం టైమ్‌కి వస్తానని చెప్పి.

"ఏమయింది వదినా? " గాభరాగా కారు దిగాడు శ్రీనాథ్.

"అర్జెంట్. ఆపరేషన్ చేసి బిడ్డని బైటికి తియ్యాలి శ్రీ! నువ్వు సునీత పక్కకి కూర్చో మిగిలినవాళ్ళు తర్వాత రండి. కమాన్, స్టార్ట్"

శ్రీనాథ్ కారు ఎక్కడం, సర్రున దూసుకుపోవడం ఒకేసారి జరిగాయి.

నిర్ఘాంతపోయి చూస్తున్నారు అక్కడున్న వారందరూ. ఏం జరిగిందో తెలుసుకునే లోపే సునీత హాస్పిటల్‌కి వెళ్ళిపోయింది.

రేణుక, శాంత నిల్చుండిపోయారు, కళ్ళలో నీళ్ళు కారుతుండగా.




**సు**జాత, వినోద్ పనిచేసేది అదే హాస్పిటల్.. కారు ఆగీ ఆగగానే 'స్ట్రెచర్!' అని అరిచింది. ఆగమేఘాల మీద స్ట్రెచర్ వచ్చేసింది.

తిన్నగా ఆపరేషన్ థియేటర్ దగ్గరికి తీసుకెళ్ళి, నర్సులకి సునీతడ్రస్ మార్చి

తయారు చెయ్యమని చెప్పి, తను డ్రస్ మార్చుకోవడానికి డాక్టర్ల గదిలోకి వెళ్ళింది.

వినోద్, శ్రీనాథ్ ఫార్మాలిటీస్ అన్నీ పూర్తిచేసి, డబ్బు కట్టేసి థియేటర్ దగ్గరికి వెళ్ళారు. వినోద్ కూడా సర్జన్ డ్రస్ వేసుకుని లోపలికి వెళ్ళాడు.. శ్రీనాథ్ భుజం మీద, భయం లేదన్నట్లు తట్టి.

కొంచెం సేపట్లో వచ్చేశారు, రేణుక, శాంత, విక్కీ, లక్కీ. మిగిలిన వాళ్ళని ఇంటి వద్ద ఉండి చూసుకోమంది రేణుక. వచ్చిన పేరంటాళ్ళకి తాంబూలం ఇమ్మని చెప్పింది. వండిన పిండివంటలు.. గుడి దగ్గర ముష్టివాళ్ళకి ఇచ్చేయచ్చు నిదానంగా.

ముందు కోడలి పరిస్థితి ఎట్లుందో! అందరూ ఆదుర్దాగా బైట ఉన్న కుర్చీల్లో కూర్చుని, కళ్ళు మూసుకుని ఎవరి దైవాన్ని వాళ్ళు ప్రార్థించుకుంటున్నారు.

"సునీత బాగా ఉంది. ఏ ప్రాబ్లమ్ లేదు. గర్భసంచీ బలహీనంగా ఉంది. అందుకనే ప్రీమెచ్యూర్ డెలివరీ అయింది" ఒక గంట గడిచాక, సుజాత బైటికి వచ్చి చెప్పింది.

అందరూ నిట్టూర్చారు.

"మరి పాప.." రేణుక అడిగింది సందేహంగా. అందరూ సునీత గురించే అడుగుతున్నారు కానీ, పాపని మర్చిపోయారు.

"ఆడపిల్ల. బాగానే ఉంది. ఇన్‌క్యుబేటర్‌లో పెట్టాం. పీడియాట్రీషియన్ వచ్చి చూస్తున్నారు. కొన్ని రోజులు అందులో ఉంచాలనుకుంటాను. ఫీమేల్ చైల్డ్ కనుక ఏ ప్రాబ్లం ఉండకపోవచ్చు. తట్టుకునే శక్తి వాళ్లకి ఉంటుంది. ఒక్క అరగంట ఆగండి. ఇద్దర్నీ చూడవచ్చు"

అందరూ 'హమ్మయ్య' అనుకుని లేచారు.

శ్రీనాథ్ సెల్ మోగింది. అనంత్ అడిగాడు ఆదుర్దాగా.. "ఎలా ఉంది శ్రీ! మేము ఇప్పుడే మీ ఇంటికి వచ్చాం"

"ఫరవాలేదు. సిజేరియన్ చేసి బిడ్డని బైటికి తీశారు. ఇద్దరూ బాగానే ఉన్నారు. సారీ అనంత్.. నీకు ఫోన్ చెయ్యాలని తట్టలేదు బుర్రకి. అనవసరంగా అంత దూరం..? "

"డోన్ట్‌వర్రీ శ్రీ! ఆ పానిక్‌లో ఏం తోస్తుంది.. నేను అర్థం చేసుకోగలను. నేను, బిందూ వస్తున్నాం"

ఒకేసారి అందరి ఫోన్లూ మోగుతుంటే.. నర్స్ వచ్చి వారించి వెళ్ళింది. అందరూ హాస్పిటల్ బైటికి వచ్చి ఫోన్లు తీశారు.

★ ★ ★

## కొత్తగాలి...

**కనిపించని దేవుళ్లని**
**కొలిచే గొప్ప సంస్కృతి**
**కని పెంచే తల్లిదండ్రులను**
**కాలదన్నే హీన సంస్కృతి**

– నెమలిదిన్నె రమణారెడ్డి,
పోలవరం, ప్రకాశం జిల్లా

అనంత్ మనసు దాని స్థానంలో ఉండటం లేదు. అసలు మనస్సుకి స్థానం ఎక్కడా? దానికి భౌతిక ఉనికి ఉందా.. ఆత్మలో ఉంటుందా.. తన వేదాంతానికి తనకే నవ్వొచ్చింది అనంత్‌కి.

రోజూ బిందుని చూడాలని అనిపిస్తుంది. కానీ, సంకెళ్ళు వేసినట్లు దూరం నుంచి చూస్తుంటే.. గుండెలో బాధ తన్నుకొస్తుంటుంది.

గుండె అంటే గుర్తుకొచ్చింది, మనసు గుండెలో ఉంటుందని ఎందుకంటారో! అందుకే గదా మరి బిందుని చూడగానే గుండె వేగంగా కొట్టుకుంటుంది. ఆమె

ఒక్కరోజు రాకపోతే గుండెలోనే చిల్లు పడినట్లుగా ఉంటుంది. ఏదో కొత్త సాఫ్ట్‌వేర్ కనుక్కున్నట్లు ఆనందపడిపోయాడు అనంత్.

ఎన్నాళ్ళు ఇలా విరహగీతాలు పాడుకుంటూ? అడుగుదామంటే కాదంటుందేమో అని భయం. ఇప్పుడైతే కనీసం ఊహల్లోనైనా..

అసలు తన తల్లిదండ్రులకి కొడుక్కి పెళ్ళి చెయ్యాలని ఉండదా? ముప్ఫై ఏళ్ళు నిండిపోయాయి. ఎవరూ అమ్మాయిని చెప్పడానికి వచ్చినట్లు కూడా దాఖలాలు లేవు. జమీందార్ల కుటుంబాలు ఇప్పుడు ఎక్కడో కాని కనిపించట్లేదు. చాలామంది చితికిపోయారు.

తండ్రి చూద్దామా అంటే దేశాలు పట్టుకుని తిరుగుతాడు. ఎంతసేపూ డబ్బు, వ్యాపారం. తల్లి.. ఆమె గురించి ఆలోచించడం కూడా వేస్ట్. ఇన్ని రోజులూ... బిందు కనిపించే వరకూ.. తనకి కూడా పెళ్ళిమీద గాలి మళ్ళలేదు.

ఇప్పుడు తన వయసువాళ్ళే.. విక్కీ, శ్రీనాథ్ తండ్రులయ్యారు. తను మాత్రం?

ఇంట్లో ఒక పాపాయి ఉంటే ఎంత బాగుంటుంది? మళ్ళీ నవ్వొచ్చింది అనంత్‌కి. అందుకే అంటారు కాబోలు.. ఆలు లేదు చూలు లేదు కాని.. అని.

## కొత్తగాలి... 

**ఏ పార్టీ గద్దెనెక్కితే**
**ఏముంది గర్వకారణం..?**
**అన్ని పార్టీలు చేసే జాతర**
**మంచికి పాతర**

– పట్ల యాదగిరి,
*గుండాల, నల్గొండ జిల్లా*

మధ్య తరగతివాళ్ళు, తమ ఇంటికేసి రావడానికే భయపడతారు. ఇంక సంబంధాలు కూడానా! హైసొసైటీ ఆడపిల్లల్ని వెతుక్కుని, వెంటబడి.. నెలలు నెలలు వాళ్ళ చుట్టూ తిరిగితే కానీ పెళ్ళి మాట మాట్లాడ్డానికే లేదు.

అనంత్ స్వభావం అటువంటిది కాదు. ఎలా ఈ సమస్య పరిష్కరించుకోవడం?

ఒకవేళ బిందు ఒప్పుకుంటే ఏం చెయ్యాలి?

లాప్‌టాప్ ముందేసుకుని కూర్చున్నాడు. తనకి ఉన్న అప్పులు, తనకే ఉన్న వ్యాపారాలు, ప్రతీ సంవత్సరపు టర్నోవర్.. బాంక్ బాలన్స్, తాతగారు తనకి ఇచ్చిన ఆస్తులు.. అన్నీ లెక్కలు వేసుకున్నాడు.

షేర్ల సంగతి వదిలేశాడు. అవి అంకెలు చూసుకోడానికీ, సున్నాలు అటూ ఇటూ జరపడానికీ తప్ప ఎందుకూ పనికిరావు, ఎమర్జెన్సీకి మాత్రమే.

తల్లిదండ్రులు కాదంటే తను వేరే వెళ్ళి, ఇప్పట్లాగ బతకగలడా? లేదా?

ఇంతపెద్ద పాలెస్ అక్కర్లేదు. ఇల్లు ఎంత పెద్దదయితే, హృదయాలు.. అవే మనసులు అంత ఇరుకవుతాయని స్వానుభవం మీద తెలుసుకున్నాడు.

కుటుంబ సభ్యులతో మాట్లాడాలంటే, ఇంటర్‌కమ్ వాడనక్కర్లేనంత ఇల్లు చాలు. కొంచెం గొంతు పెంచితే ఒకరిని ఒకరు వినగలగాలి.

అటువంటి బంగ్లాలు రెండు.. తనకీ, తమ్ముడికీ తాత అత్తాపూర్‌లో కట్టించారు.

దర్జాగా పెళ్ళాం పిల్లల్ని పోషించుకోగలడు. అనంత్‌కే నవ్వొచ్చింది, తన ఆలోచనలకి. ఏవో సినిమా డైలాగులు వస్తున్నాయి. ప్రేమ అంటే అంతేనేమో మరి.

ఇప్పుడు కింకర్తవ్యం?

ఏ వ్యాపారం మొదలు పెట్టినా పోటీదారులని అధిగమించి అతి త్వరలో ఊహకి

# మనసున ఉన్నదీ...



★ అంపశయ్య నవీన్ చిత్రించినట్లే 'అవాస్తవికుడు' నవలలోని నాయకత్వం విఫలం కాక తప్పదు. కలుపుగోలుతనం ఉన్న నాయకత్వాలే వర్ధిల్లుతాయి. అవాస్తవిక ప్రిన్సిపాల్ రాజీనామా చేసిన ఖాళీలో మరో ఇద్దరు ప్రిన్సిపాల్స్ వచ్చి, సమస్యలను అర్థం చేసుకుని, అందరి మనసులనూ చూరగొని కాలేజీని అభివృద్ధి చేసినట్లు 'వాస్తవికులు' పేరుతో మరో నవలను రచయిత రాయాల్సిందిగా మనవి.

– **నండూరి నాగేశ్వరరావు,** హైదరాబాద్

★ సెప్టెంబరు 'చతుర'లోని 'అవాస్తవికుడు'లో విద్యార్థులు, లెక్చరర్ల నిర్లక్ష్య వైఖరిని బాగా చిత్రించారు. సహనం, సమయస్ఫూర్తి కొరవడిన ప్రిన్సిపాల్ గురించి రాశారు. ఆగ్రహావేశాలు, అధికారిననే అహంగల వ్యక్తి ఎలా పతనమయ్యాడో చూపించారు. వెంకటేశ్వరరావుకు ఒక కూతురు ఉందని చెప్పినా ఆమె కథలో ఎక్కడా రాదు. అలాగే ఆయన ప్రిన్సిపాల్‌గా వచ్చిన తర్వాత కాలేజీ అభివృద్ధికమిటీ ఏర్పాటు చేసినా, గొడవలు జరుగుతున్నప్పుడు కనిపించక పోవడం విచారకరం.

– **ముండూరు అప్పలనరసింహం,** బెంగళూరు

★ అంపశయ్య నవీన్ 'అవాస్తవికుడు'లో కాలేజీని బాగా తీర్చిదిద్దాలనుకున్న ప్రిన్సిపాల్ చివరకు ఏకాకిగా మిగిలి, అంతులేని వ్యథతో వెళ్లిపోవడమనేది మంచివారికి పడుతున్న దుర్గతిని వెల్లడించింది. ముక్కుసూటిగా, నిబంధనల మేరకు ప్రవర్తిస్తే ఏమవుతుందో వివరించారు. మంచినవల వేసినందుకు అభినందనలు.

– **మధుసూదన్,** హన్మకొండ

★ భిన్న మనస్తత్వాలు గల సమాజాన్ని మార్చడమనే పని ఎంతకష్టమో 'అవాస్తవికుడు' నవల తెలియజేసింది. అలాగే అనువాద కథ 'పక్షులు' చాలా భిన్నంగా ఉంది. 'హాహా.. అమెరికా' ద్వారా అగ్రరాజ్యానికి సంబంధించిన ఎన్నో సంగతుల్ని తెలుసుకుంటున్నాం.

– **కె.వి. శ్రీనివాస్,** మల్కాజ్‌గిరి, హైదరాబాద్

★ ఓ విద్యాసంస్థను తీర్చిదిద్దాలనుకున్న ప్రిన్సిపాల్‌కు, లెక్చరర్లకు మధ్య జరిగిన సంఘర్షణ 'అవాస్తవికుడు' ఆద్యంతం ఆకట్టుకుంది. 'కొత్తగాలి' కవితలు స్పార్క్‌తో కూడుకున్నాయి. 'స్మితం' వినోదాత్మకంగా ఉంది.

–**భాగ్యశ్రీ రాజేష్,** పాన్కల్

మించిన లాభాలని కళ్ళజూసే అనంత్.. వందమంది పైగా ఉద్యోగులకి లక్షల్లో జీతాలిస్తున్న అనంత్.. ఎటువంటి క్లయింట్‌నయినా ఒక్క అరగంట డిమాన్‌స్ట్రేషన్‌తో తనవైపు తిప్పుకోగలిగిన అనంత్.. ఆలోచిస్తున్నాడు.

తన మనసుని గెలిచిన అమ్మాయిని, తను ఎలా గెలవడమా? అని. ఎలా తన జీవితంలోకి ఆహ్వానించగలనా? అని.

"ఐ లవ్ యూ" వంటి మాటలు చెప్పడం అసలే రాదు. పైగా బాస్ తన మీద అడ్వాంటేజ్ తీసుకున్నాడని అనుకుంటే మొదటికే మోసం.

బిందు అందమయిందనే కాదు. గలగల పారే సెలయేరు లాంటి తన స్వభావం కూడా బాగా నచ్చింది. ప్రతి రోజూ చైతన్యంతో నింపగల మనస్తత్వం నచ్చింది.

ఏదో చెయ్యాలి. దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు అనంత్.

"అనంత్! ఫోన్ తియ్యి.." తన గొంతే.. సెల్‌లో. ఉలిక్కిపడి తీశాడు.

"ఒక్కసారి ఆఫీస్‌కి రాగలవా అనంత్?" ఫోన్లో విక్కీ గొంతు!

అనంత్ లేచి బట్టలు మార్చుకుని, బయటికి వెళ్ళి, కారు తీశాడు.

★ ★ ★

అనంత్ ఆఫీసుకి వెళ్ళేసరికి, శ్రీనాథ్, వికాస్ ఆందోళనగా చూస్తున్నారు, నల్లగా ఉన్న కంప్యూటర్ స్క్రీన్‌లకేసి.

"అన్ని సిస్టమ్స్ క్రాష్ అయిపోయాయి

అనంత్" తలుపు తీసిన చప్పుడు విని, శ్రీనాథ్ వెనక్కి తిరిగి చిన్నగా అరిచాడు.

"ఎప్పుడు? " అనంత్, వికాస్ పక్కనే కూర్చుని అడిగాడు.

పానిక్ అయితే ఉపయోగమేం లేదు. నిదానంగా ఆలోచించాలి.

ఆ రోజు ఆదివారం. ఆఫీసులో వీళ్ళు ముగ్గురూ తప్ప ఎవరూ లేరు. అర్జంట్ రిపోర్ట్స్ తయారు చెయ్యాలని శ్రీనాథ్, వికాస్ వచ్చారు. సింగపూర్‌లో ప్రజెంటేషన్‌కి వెళ్ళాలి. అక్కడ ఒక కంపెనీ రమ్మని పిలిచింది. ఈ రిపోర్ట్స్ చెయ్యలేకపోతే, ఏమీ చెయ్యలేరు. కోటి రూపాయలు పైన లాభాలు పోతాయి.

"మేము ఆఫీసుకి వచ్చేసరికి అంతా చీకటిగా ఉంది. స్విచ్ వెయ్యగానే లైట్లు వెలిగాయి కాని పెద్ద చప్పుడు వినిపించి, యూపీయస్‌లో నుంచి పొగలు వచ్చాయి. అంతే.. అన్ని స్క్రీన్లు నల్లగా అయిపోయాయి. కొత్త యూపీయస్ కనెక్ట్ చేసి చూశాం.. లోపల హార్డ్‌వేర్ దెబ్బతిన్నట్టుంది. ఈ కొత్త ప్రాజెక్ట్‌కి బ్యాక్ అప్ ఇక్కడున్న టేబుల్ టాప్‌లలోనే చేశాం.. ఇంకా పూర్తి అవలేదు కదా అని. అయినా అన్ని కంప్యూటర్లూ ఫట్ అయినట్లున్నాయి" వికాస్ విచారంగా అన్నాడు.

"గూగుల్ నోట్‌పాడ్‌లో సేవ్ చేశాం కదా!"

"మిగిలినవి అన్నీ. కానీ.."

"సరే హార్డ్‌వేర్ ఇంజనీర్‌ని పిలుద్దాం. రెండు మూడు గంటల్లో బాగు చేస్తాడు కదా!" అనంత్ పూర్తి చెయ్యకుండానే..

"గుడ్‌మార్నింగ్ సార్!" అంటూ హార్డ్‌వేర్ అతను వచ్చాడు, తన టూల్ కిట్ తీసుకుని.

శ్రీ, విక్కీలని మెచ్చుకుంటున్నట్లు చూసి, తన గదిలోకి వెళ్ళాడు అనంత్.

వచ్చినతను మూడు గంటలు పైగా కష్టపడ్డాడు. కంప్యూటర్లు అన్నీ రకరకాల శబ్దాలు వీనుల విందుగా చేశాయి. అనంత్ ఉత్సాహంగా తన గదిలో నుంచి వచ్చాడు. అంతవరకూ తన లాప్‌టాప్ మీద పని చేసుకుంటున్నాడు అతను.

అప్పుడే ఫోన్.. నొక్కి చెవి దగ్గిర పెట్టుకుని, "చెప్పు నాండీ!" అన్నాడు అనంత్.

"అన్నా! ఇవేళ ఆదివారం. మనం లంచ్‌కి బైటికి వెళ్దామనుకున్నాం కదా!" నాండీకి పరీక్షలు అవుతున్నాయని, ఎప్పట్లాగా పొద్దున్న కలవలేదు.

"సారీ బాబా! ఆఫీస్‌లో ఎమర్జెన్సీ వచ్చింది. పోనీ ఇక్కడికి వస్తావా? పక్కనే మంచి రెస్టారెంట్ ఉంది..."

"తప్పకుండా. డాడీ కారు కూడా ఉంది. వచ్చేస్తున్నా"

"ఎనీ లక్ విక్కీ? " సెల్ ఆర్పేసి, వికాస్‌ని అడిగాడు అనంత్.

"పాతవి అన్నీ వచ్చాయి, కాని నిన్నటిది మాత్రం.. మా లాప్‌టాప్‌లలో తీసి ఉంచుకోవలసింది. సారీ అనంత్"

అనంత్ మొహం ఎర్రగా అయిపోయింది. కానీ ఏమీ అనలేదు. ఇంత ఇర్రెస్పాన్సిబుల్‌గా ఉంటే ఎలా? ఎప్పుడూ ఈ విధంగా జరగలేదు. బాడ్ లక్.

"విక్కీ!" బిందు పరుగెత్తుకుని వచ్చింది.

"నిజమేనా! సిస్టమ్‌లు క్రాష్ అయ్యాయిట. లక్కీ చెప్పింది. హాయ్ అనంత్.. శ్రీ నువ్వు కూడా! మేజర్ బ్రేక్‌డౌన్ అన్నమాటే"

"నువ్వెక్కడ్నుంచి వస్తున్నావు? నేను బయల్దేరేటప్పుడు చూశా.. వస్తావేమో అడుగుదామని.." విక్కీ మొహం నెత్తురు చుక్క లేనట్లు పాలిపోయింది.

"మా ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాలే. ఇంతకీ ఏమయింది? అందరూ ఎందుకలా ఉన్నారు? సిస్టమ్స్ బాగుపడలేదా? " ఆదుర్దాగా అడిగింది బిందు.

వికీ ఏం జరిగిందో వివరించాడు. బిందుకి కూడా ఈ ప్రాజెక్ట్‌లో భాగం ఉంది. దానికి కావలసిన డాటా అంతా తనే సేకరించింది.. వేల సైట్‌లు బ్రౌజ్ చేసి, సర్ఫింగ్ చేసి.

"ఇంక సింగపూర్ ట్రిప్ కాన్సిల్ అయినట్లే బిందూ! డాటా లేకుండా ప్రెజెంటేషన్ ఏమిస్తాం? నీ మూడు నెలల హార్డ్ వర్క్.." పోయింది అన్నట్లుగా చేతులు గాల్లో తిప్పాడు శ్రీనాథ్.

"మిగిలిన అన్ని ప్రాజెక్ట్‌లు బాగానే ఉన్నాయి కదా! అవి మనకి డబ్బులు ఇస్తున్నవి మరి!" నవ్వుతూ అంది. అన్నాక, ముగ్గురి మొహాలూ చూసి జోక్స్ వేసే సమయం కాదని, సర్దుకుని మళ్ళీ అంది..

"సారీ! మీరు అంత బాధపడనక్కర్లేదు. నా లాప్‌టాప్‌లో మొత్తం ఉంది. నిన్న సాయంత్రం వెళ్తూ వెళ్తూ, ఈవేళ ఇంట్లో స్టడీ చెయ్యొచ్చని కాపీ చేసుకున్నాను. రేపు, శ్రీకి ఇంకొంచెం డాటా ఇద్దామని."

"వావ్! నిజంగానా బిందూ! నువ్వు చాలా గ్రేట్‌రా. గాడ్ సెంట్ లాగా వచ్చావు. కమాన్. లెటజ్ సెలెబ్రేట్. అందరం లంచ్‌కి వెళ్దాం, తాజ్‌కృష్ణాలో. రండి.." అనంత్ బిందుని మరింత ఆరాధనగా చూస్తూ అన్నాడు.

అనుకోకుండా అంత చనువుగా అనంత్ పొగుడుతుంటే బిందు బుగ్గలు ఎర్రబడిపోయాయి. తనేం పెద్ద చేసింది.. జాబ్‌లో భాగంగా చేసింది, అంతే. ఒక్కోసారి అనుకోకుండా చేసినది చీమంత అయినా, కొండంత ఫలితం వస్తుంది.

"అంత పెద్ద హోటల్‌కా! నా డ్రెస్" తన కేసి చూసుకుంది బిందు. నిజంగానే వేసుకున్న నూలు పంజాబీ డ్రెస్ బాగా నలిగిపోయింది. క్రాష్ వార్త వినగానే ఏమీ చూసుకోకుండా పరుగెత్తుకుని వచ్చేసింది.

అనంత్ ఆలోచిస్తున్నాడు.

"అన్నా! వచ్చేశా.." నాండీ సుడిగాలిలా వచ్చి అనంత్ వీపు మీద పడ్డాడు. అనంత్ 'అన్నా' అనే పిలుపు వినగానే తయారుగా ఉన్నాడు కనుక సరిపోయింది.

"ఓకే! మీరు, తాళాలు వేసుకుని, తాజ్ కృష్ణాకి వెళ్ళి కూర్చుని మొదలు పెడ్తూ ఉండండి.. నేను, బిందూ అలా వెళ్ళి ఒక డ్రస్ కొనుక్కొస్తాం. బిందు డిజర్వ్స్ స్పెషల్ గిఫ్ట్ ఎనీవే"

అన్నట్లుగానే నీరూస్‌కి తీసుకువెళ్ళి, ఐదు వేలకి మంచి డ్రస్ కొనిచ్చాడు అనంత్. నాండీ కూడా ఆ డ్రెస్ సెలక్షన్‌లో పాల్గొన్నాడు.

"ఇంత ఖరీదయింది ఎందుకు అనంత్..?" అంటూనే అనంత్ కోప్పడితే

## విమర్శకుల నోళ్లకు మూత!



చెన్నైలో జరగాల్సిన ఆంధ్ర సాహిత్యపరిషత్ కార్యనిర్వాహక సభను 1915లో పెద్దలు బెజవాడకు మార్చారు. దీనిపై అసంతృప్తితో 'ఈ వేదికను ఇలా హఠాత్తుగా బెజవాడకు డేకించినవారు, రేపు ఉత్తర ధ్రువానికీ డేకిస్తారు' అని ఒకాయన విమర్శించాడు. మరో నవ నాగరికుడు 'అయినా మా గుంటూరుకేం తక్కువ? అక్కడెందుకు ఈ సభ జరపరాదు?' అని ప్రశ్నించాడు.

దానికి గురజాడ 'చేసినదానికెల్లా అడ్డుచెప్పడవేనా తెలివికి చిహ్నాం? బెజవాడలోనో, ఆకాశం మీదో ఎక్కడో ఒకచోట సభ పెడుతున్నారని సంతోషించరాదా? ఈ సభ పెట్టకపోతే మీరు చేసేదేమిటి? ఇన్నాళ్లూ మీరేం చేశారు?' అని హాస్యంతో విమర్శకుల నోళ్లు మూయించారు.

లోపలికి వెళ్ళి వేసుకొచ్చింది బిందు. గులాబీ, ఎరుపు రంగుల కలయికలో అడ్డ కుచ్చిళ్ళు అతికి ఉన్న పొడవాటి స్కర్ట్, మాచింగ్ బ్లౌజ్. ఆమెకి బాగా నప్పింది. బిందూ కూడా గులాబీ రంగులోకి మారి పోయింది.

"బ్యూటీఫుల్!" అన్నాడు నాండీ, అటూ ఇటూ స్టెప్పులు వేస్తూ.

అనంత్ కళ్ళలో చూపించాడు తన మెప్పు అంతా. ఇలా అయినా బిందూతో కొంచెం ముందుకి వెళ్ళే అవకాశం వచ్చింది. క్రాష్ అయిన కంప్యూటర్లకి కోటి కృతజ్ఞతలు!

## కొత్తగాలి...

**ఒకడు చాకు**
**మరొకడు బ్లేడు**
**వేరొకడు యాసిడ్డు**
**'లవ్' ట్రయాంగిల్లు!**

*– మండ రిత్విక్ భరద్వాజ,*
*సికింద్రాబాద్*

★ ★ ★

"ఎవరా వస్తున్నది..? దీపికా పడుకోనేనా..? నయనతారనా? నా చెల్లెలు ఇంత అందంగా ఉంటుందా? నమ్మలేక పోతున్నా!" విక్కీ లేచి నుంచుని చిన్నగా చప్పట్లు కొట్టాడు.

అనంత్ పక్కన నడిచి వస్తుంటే.. ఇద్దరూ ఈడూజోడుగా చూసేవాళ్ళకి కన్నుల విందుగా ఉన్నారు.

శ్రీనాథ్, అనంత్ మొహంలో భావాలు గమనిస్తున్నాడు.

తప్పకుండా ఏదో ఉంది. అనంత్ కళ్ళలో ఆ వెలుగులు, ఎర్రబడి డ్రెస్ రంగులో కలిసిపోయిన బిందూ బుగ్గలు.. చెప్పకనే చెప్తున్నాయి, వాళ్ళ మూగ ఊసుల కథలు.

తల తిప్పకుంటూ నాండీ చెప్తున్న కబుర్లు వింటున్నట్లు ఉన్నారే కానీ, ఇద్దరూ వేరే లోకంలో ఉన్నారు.

వికాస్‌ని చూశాడు శ్రీనాథ్. తమ ప్రాజెక్ట్ సురక్షితంగా ఉందన్న సంతోషం తప్ప ఇతర విషయాలు గమనించే స్థితిలో లేడతను.

ఏదయితేనేం మంచిదే కదా! అనంత్ సెటిల్ అవుతాడు. అసలు ఇంతకాలం ఎందుకు చేసుకోలేదో! ఊ అంటే క్యూలో ఉంటారు కదా.. మరి బిందూవాళ్ళు సరి తూగ గలరా? శ్రీనాథ్‌కి నవ్వొచ్చింది. ఎంత వరకూ వెళ్ళిపోయాడు.. అనంత్ ఆలోచించకుండా ముందుకెళ్తాడా?

"శ్రీ! ఏం ఆర్డర్ ఇమ్మంటావు? హలో" అనంత్ గట్టిగా పిలుస్తుంటే అతన్ని చూసి నవ్వాడు శ్రీనాథ్. మెనూ చూసి ఒక్కొక్కళ్ళని వాళ్ళకి కావలసినవి కనుక్కుని ఆర్డర్ ఇచ్చాడు అనంత్.

నాండీ, సిబిఐటీలో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. తన కాలేజ్ గురించి చెప్పిందే చెప్తున్నాడు. రాణి మూడు నెలలే ఆదివారాలు నాండీకి ఫ్రీ అంది కాని, ఆ రోజు నాండీని కోప్పడినప్పుడు అనంత్ చేసిన బోధలకి, ఆదివారం పూర్తిగా వదిలేసింది. నాండీకి పదిహేడు నిండుతాయి.. ఇంకా కోచ్ వస్తున్నాడు. డయటీషియన్ సలహాతో విటమిన్ల డోస్ పెంచి, ఇంకా బలమైన ఆహారం ఇస్తున్నారు.

తెల్లవారున నాలుగు గంటల నుంచీ, రాత్రి పది గంటల వరకూ విశ్రాంతి లేకుండా వర్క్ అవుట్‌లు, డాన్స్‌లు.. అన్నీ మామూలే. అందుకనేనేమో నాండీ శరీరం టైటానియమ్ తీగలా బలంగా ఉంటుంది. ఇప్పుడు ఒళ్ళు నొప్పులు కూడా తగ్గాయి.

ఏమయినా సరే పద్దెనిమిది నిండే సరికి నాండీకి హృతిక్ రోషన్ బాడీ రావాలని పంతం మీద ఉంది రాణీ. శ్రీకీ, విక్కీకీ మాత్రం నాండీని చూస్తుంటే, తమకి కూడా అటువంటి తమ్ముడుంటే బాగుండు ననిపిస్తుంది. కలిసినప్పుడల్లా ఎంతో ఆప్యాయంగా ఉంటారు వాళ్లు నాండీతో.

బిందు ఎందుకనో మామూలుగా ఉండ లేకపోతోంది. శ్రీనాథ్ ఎప్పుడూ ఎక్కు వగా మాట్లాడడు. అనంత్ సరే సరి.. ఒక నిశ్చయానికి వచ్చిన వాడిలాగ నిశ్చింతగా ఉన్నాడు. మొహంలో, కళ్ళలో ఎప్పుడూ ఉండే పట్టుదల ఇంకా పదిరెట్లు పెరిగి నట్లు కనిస్తోంది.

సంభాషణ అంతా నాండీ, విక్కీ నడిపి స్తున్నారు.

"అన్నా! ఇంతకీ సింగపూర్ ఎవరెవరు వెళ్తున్నారూ? " నాండీ అడిగాడు.

నిజమే! నాండీ అడిగే వరకూ దాని గురించి ఆలోచించనే లేదు. ఎప్పుడు ప్రెజెంటేషన్ ఉన్నా అనంత్, విక్కీ వెళ్తారు. ఈ సారి శ్రీనీ, బిందూనీ పంపితే.. ఎందుకయినా మంచిదని తాము నలుగురికీ వీసాలు తీసుకుని రెడీగా ఉంటాడు అనంత్. తన ఇతర వ్యాపారాలలో కానీ, ఇందులో కానీ అక్కడే ఎక్కువ మంది క్లయంట్స్ ఉన్నది.

"నువ్వు ఏమీ అనుకోకపోతే బిందూని తీసుకుని వెళ్ళు అనంత్. అసలు ఈ ప్రాజ క్ట్‌లో తనే ఎక్కువ కష్టపడింది. పైగా తను చాలా బాగా ప్రెజెంట్ చేస్తుంది" వికాస్ అన్నాడు అమాయకంగా.

శ్రీనాథ్ ఉలిక్కిపడి చూశాడు బిందు కేసి.

బిందు బుగ్గలు మరింత ఎర్రబడ్డాయి.

"గుడ్ ఐడియా విక్కీ! నేనూ, బిందు వెళ్తాం. శ్రీ! హోటల్ బుకింగ్స్, టికెట్స్ చూడమని ట్రావెల్ ఏజెంట్‌కి చెప్తావా? బిందూ! ఏమంటావు? నీకు ఇష్టం లేక పోతే రానక్కర్లేదు."

నమ్మలేకపోయింది బిందు. నిజంగా తను సింగపూర్‌కు.. ఇష్టం లేకపోతే అక్కర్లేదా.. అదేంటీ? అనంత్ బాస్. తను వెళ్ళమంటే నో అని ఎలా చెప్తుంది? అయినా.. ఇంత మంచి అవకాశం.. వదులు కుంటుందా! ఏదో పెళ్ళి సంబంధా లంటే.. తనకి నచ్చక కానీ!

"ఓకే అనంత్. నేను వస్తాను. రిపోర్ట్ శ్రీ ఇస్తాడా? "

"ముగ్గురం ఆఫీస్‌కి వెళ్ళి డిస్కస్ చేద్దాం. ముందు పైలట్ ప్రెజెంటేషన్ ఇవ్వాలి నువ్వు. అది రేపు. రాత్రి ప్రిపేర్ అవు" అన్నాడు అనంత్.

అనంత్ ఆనందం పట్టలేక పోతు న్నాడు. తను నిర్ణయం తీసుకోవడమే మిటి.. వెంటనే బిందుతో మూడు రోజులు గడిపే అవకాశం.. ఓహ్ థాంక్ గాడ్.

"ప్చ్! నాకు హాలిడేస్ ఉంటే నేను కూడా వచ్చేవాడ్ని" నాండీ విచారంగా అన్నాడు.

★ ★ ★

సింగపూర్ ట్రిప్ బాగా జరిగింది.

హోటల్ చాలా బాగుంది. అనంత్ గది పన్నెండో అంతస్తులో ఉంది. ఎగ్జిక్యూటివ్ సూట్ బుక్ చేయించాడు శ్రీనాథ్. బిందు

### కొత్తగాలి...



**వికెట్లు**
**పడ్డప్పుడు**
**బౌలర్ చేసేదే**
**వికెటాట్టహాసం..!**

**– భమిడిపాటి,**
చందానగర్, హైదరాబాద్

గది రెండో అంతస్తు.. మామూలు ఏసీ రూము. ఇలా ఎందుకు చేయించావని దెబ్బలాడాడు అనంత్, హోటల్‌కి రాగానే.

"ప్రోటోకాల్ పాటించాలి బాస్" అనేశాడు శ్రీనాథ్.

అనంత్ ఏ మాత్రం తొందర పడలేదు. ఆఫీసు విషయాలు తప్ప ఇంకొక సంగతి మాట్లాడలేదు. బిందు ప్రజెంటేషన్ బాగా ఇచ్చింది. క్లయింట్ ఇంప్రెస్ అయి, కాంట్రాక్ట్ ఇచ్చేశాడు.

ఒక రోజు లోకల్ టూర్ తీసుకుని చూడ వలసినవి చూశారు.

తన కాలేజ్ కబుర్లు, హిందూలో పని చేసినప్పటి అనుభవాల్ని బిందు పంచుకుంది. అలాగే కుటుంబ విషయాలు కూడా. టీనేజ్ వచ్చినప్పట్నుంచీ తల్లిదండ్రులు తమతో ప్రతీ విషయమూ ఎలా చర్చించే వారో.. తమ అభిప్రాయాలకి ఏ రకంగా విలువనిచ్చేవారో, పరిమితిలోనే స్వేచ్ఛ.. సాయంత్రం చీకటి పడకుండా ఇల్లు చేరి తీరాలనే నిబంధన, మామూలు మధ్యతరగతి కుంటుంబాలలో ఉండే ఆప్యాయతలు.. అన్నీ చెప్పింది అనంత్‌కి.

తాతగారికీ తనకీ ఉన్న అనుబంధం అనంత్ వివరించాడు.

తన ఇంటి విషయాలు.. తల్లిదండ్రుల జీవన విధానం వివరించాడు. అన్నీ దాచకుండా చెప్తే మంచిది కదా?

"ఎలా ఉన్నా.. ఎన్ని అభిప్రాయ భేదాలు ఉన్నా.. ఎవరి ప్రాధాన్యతలు వారికి ఉన్నా, మా పేరెంట్స్ ఇద్దరికీ ఒకరంటే ఒకరికి చాలా ఇష్టం. డాడీ ఉన్నంత సేపూ మమ్మీ ఒక్క నిముషం వదలదు. డాడీ కూడా అంతే. ఉన్న రెండు రోజులూ ప్రతీక్షణం కలిసే ఉంటారు.

నాండీ పుట్టే వరకూ తాతగారే నాకు కంపనీ. తరువాత వాడితో గడిపేవాడిని. ఆటలూ, కాలేజీ చదువూ.. తరువాత వ్యాపారం. డాడీ వ్యాపారంలో మంచి సలహాలు ఇస్తారు. నాకు సోషల్ లైఫ్ అనేది లేదు. శ్రీ, విక్కీ వచ్చాక కొంచెం కొంచెం స్నేహంలో ఉండే మాధుర్యం తెలిసింది" తన గురించి చెప్పుకున్నాడు అనంత్.

బిందు శ్రద్ధగా వింది.

"డబ్బు ఉంటే సమస్యలు, ఒంటరితనం ఉండవని అనుకుంటాం. ఎందుకంటే ఏదయినా కొనుక్కోవచ్చని. కానీ అది తప్పని ఇప్పుడే తెలిసింది" బిందు అర్థం చేసుకున్నట్లుగా అనంత్‌ని చూస్తూ అంది.




**కొ**త్తపల్లిలో తమ ఇంటి మిద్దె మీద ఒక హాలు, రెండు గదులు వేశాడు శ్రీనాథ్. ఇంటి ముందు పెద్ద షామియానా వేశారు. వీధి సగం పైగా కుర్చీలతో నిండిపోయింది.

ఇల్లు గృహప్రవేశం, చిన్నారి రేణు మొదటి పుట్టినరోజు కలిపి చేస్తున్నారు.

సునీత సిజేరియన్ ఆపరేషన్ అయ్యాక తేరుకోవడానికి రెండు నెలలు పట్టింది. పాపాయిని పదిహేనురోజులు ఇంక్యుబేటర్‌లో ఉంచి ఇచ్చారు, జాగ్రత్తలు చెప్పి.

జయా, రామూ ఒక నెల ఉండి అమ్మకి సహాయపడ్డారు. ముఖ్యంగా పాపాయికి దూదితో మెత్తని పక్కలు వెయ్యడం.. గదిలో ఉష్ణోగ్రత మారకుండా ఉండేట్లు చూసుకోవడం.. పాపాయికి అమ్మ దగ్గర

పాలు తాగడంవచ్చే వరకూ ఇంక్ పిల్లర్‌తో చుక్కలు చుక్కలుగా పాలు పొయ్యడం.. సునీతకి పథ్యం.. పసుపు నీటి స్నానం.. అన్నీ ఎంతో జాగ్రత్తగా చేశారు. ఇద్దర్నీ గాజు బొమ్మల్లాగా చూసుకున్నారు.

మూడు నెలలు అయ్యేసరికి తల్లీ, పాపాయీ తేరుకుని మామూలుగా అయ్యారు.

రేణుక ఆనందానికి హద్దుల్లేవు. జయా, రాములకి చీర, సారెలు ఇచ్చి సంతోషంగా పంపించారు శ్రీనాథ్, సునీత.

బారసాల మాటే ఎత్తలేదు రేణుక. సీమంతానికి అట్లా అయినప్పట్నుంచీ, ఫంక్షన్లు అంటే భయం వేస్తోంది ఆవిడకి.

చిన్ని రేణు అప్పుడే నడిచేస్తోంది. బుడి బుడి అడుగులు వేస్తూ తాతయ్యనీ, నానమ్మనీ ఆట పట్టిస్తూ ఉంటుంది. సోఫా వెనకాల దాక్కుని వెతక మంటుంది. తాతయ్య అక్కడ తప్ప అన్ని చోట్లా వెతికి కనపడలేదంటాడు. అప్పుడు వచ్చి పకపకా నవ్వుతుంది.

సునీతే ఈ గృహప్రవేశం ఫంక్షన్ ప్రతిపాదించింది

రేణుకకి మనసులో ఇష్టం ఉన్నా పైకి గంభీరంగా ఉంది. 'అప్పుడు అంత హడావుడి చేస్తే అట్లయింది.. పిల్లలు మంచిగా ఉండాలి కానీ.. ఇవన్నీ ఎందుకు?' అని కొట్టిపడేసింది, చెల్లెలు ఫోన్‌లో అడిగితే.

పాపాయికి పేరు పెట్టడం కూడా చిలుకూరు బాలజీ గుళ్ళో సింపుల్‌గా చేశారు. వాళ్ళ రెండు కుటుంబాలు మాత్రమే..

పేరు ఏం పెట్టారా అని అందరూ ఉత్సుకతతో చూస్తుంటే సునీత, శ్రీనాథ్ చెవిలో చెప్పింది. శ్రీనాథ్ ఆశ్చర్యంగా చూశాడు. అతని పెద్దకళ్ళలో దాచినా దాగని ఆనందం.

'రేణుక' అని బియ్యంలో రాయగానే, రేణుక పట్టలేని సంతోషంతో సునీతని పట్టేసుకుంది, కళ్ళలో నీరు కారుతుండగా.

సునీత పీటల మీది నుంచి లేచి అత్తమ్మ, మామయ్యల కాళ్ళకీ నమస్కరించింది, శ్రీనాథ్‌ని తీసుకుని. చిన్ని రేణు పెద్దమ్మ ఒడిలో నవ్వులు చిందిస్తోంది.

"అత్తమ్మా! మీరు నాకూ, పాపాయికీ మళ్ళీ జన్మనిచ్చారు. మీ మనుమరాలికి మీ పేరు పెట్టడం కూడా గొప్పేనా? ఇంకో నలుగురు అమ్మాయిలు పుట్టినా అదే పేరు పెడ్తాను" సునీత నవ్వుతూ అంటుంటే చప్పట్లు కొట్టారు, జయా, రామూ.

"మా అన్న పెద్దింటి పిల్లని ప్రేమిస్తున్నాడని తెలియగానే, మేమందరం ఎంత భయపడ్డామో వదినా! నువ్వు మాకు దొరకడం నిజంగా మా అదృష్టం"

సురేష్, శాంతల హృదయాలు ఉప్పొంగాయి ఉద్వేగంతో!

"బారసాలకి కూడా ఎవరినీ పిలవలేదు.. అందుకనే మన వాళ్లందరికీ రేణుని పరిచయం చేసినట్లూ ఉంటుంది, గృహప్రవేశం కూడా.. చేసినట్లుంటుంది" అంది సునీత.

పెళ్ళికి పిలిచినంతమంది కంటే ఎక్కువే పిలిచారు. కానీ మొత్తం వెజిటేరియనే అని పట్టుబట్టింది రేణుక.

"మీ బంధువులు, మా చుట్టాలు అని లేకుండా అందరూ మనవాళ్ళే. అందరూ తినగలిగేవే పెడదాం"

అక్షయావాళ్లకి కేటరింగ్ ఇచ్చేశారు. పెరడు అంతా అలంకరించి.. కుర్చీలు వేశారు. పైన డాబా మీద భోజనాలు.

చాలా గ్రాండ్‌గా జరిగింది ఫంక్షన్. అందరు చుట్టాలూ కలసి మెలసి తిరిగారు. మాజిక్ షో పెట్టించాడు శ్రీనాథ్.

వికాస్ పేరెంట్స్ వచ్చారు, కానీ అనంత్ మాత్రం నాండీని తీసుకుని వచ్చాడు.

అప్పుడు అనంత్ బిందు అందరి దృష్టి ఆకర్షించారు, విడివిడిగా.

అందరిదీ ఒకటే ప్రశ్న..

ఎంతం చక్కగా ఉన్నారో.. ఎవరు వారు? సింగపూర్ నుంచి వచ్చినప్పట్నుంచీ బిందు మామూలుగా ఉండలేకపోతోంది.

అనంత్ ఎంతో డిగ్నిఫైడ్‌గా, హుందాగా ప్రవర్తించాడు. కానీ ఆ కళ్ళు.. ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్లు అనిపించింది.

లేకపోతే తన భ్రమో! మొదట అతన్ని చూసినప్పుడు అతని దగ్గర పని చేస్తున్నప్పుడు ఏమీ అనిపించలేదు. కానీ రాను రాను.. అతని కళ్ళలో భావాలు..

ఛ! అంతా తన ఊహే. గట్టిగా మాట్లాడితే తనకే అతనంటే ఇష్టం ఏర్పడుతోందేమో!

అదెలా కుదురుతుంది? వాళ్ళు జమీందారులు.. ఎక్కడా తమకీ వాళ్ళకీ పొంతన లేదు. ఆశలు పెంచుకుంటే నిరాశ చెందడం ఖాయం.

కానీ.. తన మనసే చెప్పిన మాట విననంటోంది.

అతని దగ్గరే పని చేస్తూ, రోజు అతన్ని చూస్తూ.. మామూలుగా ఉండడం అసాధ్యం. అందుకనే ఉద్యోగానికి రిజైన్ చెయ్యాలని నిశ్చయించుకుంది. తనకి ఉద్యోగాలని చీరలు మార్చినట్లు మార్చడం అలవాటే కనుక, ఇంట్లో వాళ్ళకి ఏమీ అనుమానం రాదు.

అనంత్‌కే.. ఏమని చెప్పాలి?

అసలు జీవితంలో ఎవర్ని చూసినా చలించని ఈ మనసు అనంత్‌ని చూస్తే.. అందుకోలేని ఎత్తులో అతనున్నాడని దానికేం తెలుసు పాపం!

ఎవర్కైనా తెలిసిందంటే.. తప్పకుండా హేళన చేస్తారు. అర్థం చేసుకునే వాళ్ళయితే సానుభూతి చూపిస్తారు.

తనకి అవేవీ వద్దు. తన అభిమానాన్ని పణంగా పెట్టే పని ఎప్పుడూ చెయ్యదు.

ఇప్పటి వరకూ ఆ విధంగానే నడిచింది. ఏ ఉద్యోగమైనా తనకి బోర్‌కొట్టి మానేసింది కానీ, ఎవరితో గొడవపడికాదు. వాళ్ళు వద్దంటే కాదు.

చాలా సందిగ్ధావస్థలో ఉంది బిందు.

మర్నాడు ఆఫీసులో మీటింగ్ ఉంది.. అందరూ కొత్త ప్రాజెక్ట్ పని ఏ విధంగా ఆర్గనైజ్ చెయ్యాలా అని ఆలోచిస్తున్నారు. తనే అందులో ఇంపార్టెంట్ పర్సన్. ఇప్పుడు రిజైన్ అంటే తప్పకుండా అంతా కనుబొమ్మలు పైకి లేపి చూస్తారు.

అయినా తప్పదు. ఇప్పటి వరకూ బోలెడు సంబంధాలు చూసేవారు కదా ఇంట్లో.. ఈ మధ్యని ఎవరూ రావట్లేదే. ఎవరైనా వచ్చి, పెళ్ళి కుదిరితే బాగుండును. గొడవ వదిలి పోతుంది.

వచ్చిన వాళ్లందరినీ కాదంటోందని విసుగెత్తి ఎవరూ రావట్లేదని తెలియదు బిందుకి.

అయినా తన కలల రాకుమారుడు త్వరలోనే రాబోతున్నాడు కదా!

బిందు పడుతున్నదంతా అనవసర ప్రయాస అని తెలియదు పాపం.

★ ★ ★

బిందు మధన పడుతున్న సమయంలో...

అనంత్, వికాస్‌తో గ్రాండ్ కాకతీయాలో భోజనం చేస్తున్నాడు.

అనంత్ తనని లంచ్‌కి పిలిస్తే ఆశ్చర్యపోయాడు వికాస్. శ్రీ కూడా వస్తున్నాడా అంటే లేదన్నాడు.

నిజంగానే తామిద్దరే. బిందు ఏమయినా మిస్ బిహేవ్ చేసిందా సింగపూర్‌లో. అది అల్లరి పిల్ల. పైగా తొందర ఎక్కువ. పొరపాటున ఏమయినా అంటే ఏకేస్తుంది. బిందుని తీసేస్తున్నానని చెప్ప

డానికేమో! ఏ జాబ్‌లోనూ పట్టుమని పదినెలలు చెయ్యదు.. తింగరి పిల్ల.

"విక్కీ! బిందుకి ఇంతవరకూ పెళ్ళి సంబంధాలు ఎందుకు చూడలేదు? ఐ మీన్.. మీవాళ్ళు తొందరగా చేసేస్తారు కదా!" అనంత్ ప్రశ్నకి బిత్తరబోయాడు వికాస్.

అయితే.. తన ఊహే కరెక్ట్. సింగపూర్‌లో ఏదో దెబ్బలాటయి ఉంటుంది. అదే అడిగాడు.

"ఛా! అదేం లేదు విక్కీ! ఊరికేనే అడిగాను. జస్ట్ క్యూరియాసిటీ.. అంతే"

"మా నాన్నగారికి అదే బాధ అనంత్. ఎన్నో సంబంధాలు వచ్చాయి. ఏదీ తనకి కావలసినట్లు లేదని తిప్పేసింది. పోనీ ఎటువంటి సంబంధం కావాలో.. తనకి ఎలాంటి ఆశలున్నాయో ఏమీ చెప్పదు. గట్టిగా అడిగితే.. 'నాకే తెలియదు' అంటుంది. చక్కటి పిల్లే కాని తగని గర్వం అని మా సర్కిల్‌లో ఇప్పటికే పేరు వచ్చేసింది. తన జాబ్ తను చేసుకుంటూ హ్యాపీగా ఉన్నానంటుంది. అంతకంటే ఇంకేం లేదు" చెప్పాడు విక్కీ.

"అయితే నేరుగా పాయింట్‌కి వచ్చేస్తున్నా. నాకు బిందుని ఇవ్వడానికి మీకేమయినా అభ్యంతరమా? తనకి ఇష్టమైతేనే అనుకో!"

అనంత్ మాటలని వింటూ తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు విక్కీ.

"ఏమంటున్నావు అనంత్! నే వినేది నిజమేనా? "

"అవును. నాకు మొదట మీ ఇంటికి వచ్చినప్పుడే ఆమెమీద ఇష్టం కలిగింది. నా ఇష్టం ఒకరూపు చెందకముందే బిందు మన ఆఫీసులో చేరింది. రోజు రోజుకీ ఆమె మీద అభిమానం పెరుగుతోంది. సింగపూర్‌లో అడిగేద్దామని అనుకున్నాను. కానీ పెద్దవాళ్ల ద్వారా అడిగితేనే మంచిదనిపించింది"

వికాస్‌కి ఇంకా నమ్మబుద్ధి కావట్లేదు.

"నిజంగానా అనంత్! యు మీన్ ఇట్! మరి మీ ఇంట్లో ఒప్పుకుంటారా? మేం వచ్చినప్పుడు అవమానిస్తే? సినిమాల్లో చూపించినట్లు జీవితంలో అవదు అనంత్. సమాన వియ్యం, సమాన కయ్యం అంటారు అందుకే"

"మీ ఇంట్లో అడుగు, ముఖ్యంగా బిందుని. మీ పేరెంట్స్‌కి కూడా అభ్యంతరం లేకపోతే, మా వాళ్ళ సంగతి నేను చూసుకుంటాను. మామూలుగా ఓకే అంటారా సరే. లేకపోతే మీరే చేసెయ్యండి"

వికాస్ ఇంకా షాక్‌లోనే ఉండిపోయాడు.

"ఇంకా విను.. మా ఇంట్లో నుంచి నేను వెళ్ళిపోయినా, ఇప్పుడున్నట్లే ఉండగలను.. అంటే ఫైనాన్షియల్‌గా. మా తాతగారు నాకు ఇచ్చిందీ, నేను సంపాదిస్తున్న దాంతో మేం హ్యాపీగా ఉండగలుగుతాం"

"కమాన్ అనంత్. నువ్వు మా ఎంప్లాయర్‌వి. నీ యస్సెట్స్ ఎంతో నాకు తెలియవా? గూగుల్ సెర్చ్‌కి వెళ్ళి, నీపేరు కొడ్తే.." ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

"విక్కీ! నేను మళ్ళీ పొద్దున్నే ఫోన్ చేస్తా. సరే అంటారనే అనుకుంటున్నా. ఇంకొక సంగతి.. ఇది నో అయినా మన బిజినెస్ ఏమీకాదు. దానికీ, దీనికీ సంబంధం లేదు. మనం మామూలుగా ఏవీయస్ కంపెనీ పార్టనర్స్‌మే. ఓకే.."

★ ★ ★

"అరే! ఏమయింది? బిందూ.. ఎందుకు అలా మూడీగా ఉన్నావు? చూస్తున్నా కదా! సింగపూర్ నుంచి వచ్చినప్పట్నుంచీ ఏదో మార్పు కనిపిస్తోంది. వంట్లో బాగా లేదా? లేక ఎవరైనా రాకుమారుడు.."

"లక్కీ! ప్లీజ్ ఆపు" బిందు తల నొక్కు

కుంది ఎడం చేత్తో.

రాత్రి ఎనిమిది గంటలయింది. అందరూ భోజనాలకి కూర్చున్నారు.

అవధానిగారి ఇంట్లో ఎప్పటి నుంచో అదే ఆచారం. రాత్రి మాత్రం అందరూ కలిసి భోజనం చెయ్యాలని.

"అయ్యో! తల నొప్పిగా ఉందా? మజ్జిగా అన్నం తినేయ్. ఝండూబామ్ రాస్తాను" అంటున్న మాణిక్యంకేసి, పాలిపోయిన మొహంతో చూసి, మాట్లాడకుండా తినసాగింది బిందు.

అందరూ ఆశ్చర్యంగా చూశారు.

అదే మామూలుగా అయితే, ఝండూ బామ్ అంటే అంతెత్తు ఎగురుతుంది బిందు. అది పెట్టేమంటకి తలనొప్పి గుర్తుకురాదు.. పెద్దగీత, చిన్నగీత లాగ.. అంతే, అంటుంది.

వికాస్ మౌనంగా చెల్లెల్ని గమనిస్తున్నాడు. ఇప్పుడే కాదు ఈ మధ్యన బిందు మూడీగానే ఉంటోంది.

ఒకవేళ అనంత్ తనకి సగమే చెప్పాడా? బిందుని అడిగి, కాదని అన్నాక తనని అప్రోచ్ అయ్యాడా? అందరిలాగ అతన్నికూడా.. అలా చేస్తే మటుకు, బిందు అంత మూర్ఖురాలు ప్రపంచంలో ఉండదు.

ఏదయినా ఇప్పుడు తేల్చక తప్పదు.

బిందు మాట్లాడకుండా గబగబా తినేసి, తన గదిలోకి వెళ్ళబోయింది.

"కొంచెం ఆగి పడుకోవచ్చు. మీ అందరితో మాట్లాడాలి. కాసేపు కూర్చో బిందూ! వచ్చేస్తున్నా"

అందరూ విక్కీని కుతూహలంగా చూశారు.

బిందు నిరాసక్తంగా సోఫాలో కూర్చుని, టీవీ ఛానల్స్ మారుస్తోంది, మ్యూట్‌లో పెట్టి. ఏదో పెళ్ళి సంబంధం అయుంటుంది. అంతకంటే ఏముంటుంది. నిజమే.. తన వయసుకి నాలుగైదేళ్ళ క్రితమే పెళ్ళయిపోవాలి. అమ్మా, నాన్న బెంగ పెట్టుకోడంలో తప్పేముంది? వచ్చినవాళ్ళందరికీ తను నచ్చుతూనే ఉంది. తనకే ఎవరూ.. తన స్వభావానికి సరిపోవట్లేదని అనిపిస్తుంటుంది.

"ఒకట్రెండుసార్లు చూడగానే ఎలా తెలుస్తుంది? మరీ బడాయి కాకపోతే? మీ పేరెంట్స్ మంచి వాళ్ళు కనుక నీ ఆటలు సాగుతున్నాయ్. మొన్న వచ్చిన ఆస్ట్రేలియా సంబంధం ఎంత బాగుంది? అబ్బాయిని నేను కూడా చూశాను కదా!" ఇంటి పక్కనే ఉన్న స్నేహితురాలు వాయించింది.

"బాగా ఉన్నాడే! కాని అంత మందిలో కూర్చుని చిర్రున చీదాడు. కర్చీఫ్‌లోనే అనుకో!" వికారంగా పెట్టింది మొహం బిందు.

"వ్వాట్?" కళ్ళు పెద్దవి చేసి ఆశ్చర్యంగా చూసింది ఫ్రెండు.

"జలుబు చేస్తే చీదడం తప్పేనా?"

"అది కాదు. బాత్రూంలోకి వెళ్ళి చెయ్యాల్సినదీ.. అంతా కొత్తవాళ్ళ ముందు.."

"నీకు ఈ జన్మలో పెళ్ళి కాదే! ఎవరైనా ఒప్పుకుని నువ్వు చేసుకున్నా.. వాడు అయిపోతాడు. ఈసారి ఎవరొస్తున్నారో నాకు ముందు చెప్పు. నేను వెళ్ళి

---

## కొత్తగాలి...

**కళ్ళు - చూస్తాయి**
**చెవులు - వింటాయి**
**పాపం నోరు - జారుతుంది**

– యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

---

చెప్తాను, తుమ్మద్దనీ, గోళ్ళు కొరకద్దనీ.. ” కోపంగా అంటూ వెళ్ళిపోయింది ఆ అమ్మాయి.

అప్పుడు దాని మొహం చూడాలి.. అంత విచారంలోనూ నవ్వొచ్చింది.

రేపట్నుంచి అనంత్‌ని చూడలేను. ఎలా తీసుకుంటాడో.. నేను జాబ్ మానేస్తే! అందరూ స్టన్ అయిపోతారు. సరైన కారణం కూడా తన దగ్గర లేదు. ఈ జాబ్ బాగా నచ్చిందని ఎప్పుడు డబ్బా కొట్టేదాన్ని.

కాళ్ళు ముడుచుకుని సోఫాలో ఒక మూలగా కూర్చుంది. బిందు అంత నిస్సహాయంగా, ఏమీ చెయ్యలేనట్లు.. ఏదో పోగొట్టుకున్నట్లు ఉండటం అప్పటి వరకూ ఎవరూ చూడలేదు.

వెనుక నుంచి వచ్చి ఎవరో తల నిమిరారు.. ఇంకెవరు.. అమ్మే అయుంటుంది. వెనక్కి వాలి కళ్ళు మూసుకుంది.

“నేనే. అమ్మ కాదు.. ఎందుకో చాలా వర్రీ అవుతున్నావు. నాకు చెప్పవా? ” లక్కీ పక్కనే వచ్చి కూర్చుంది.

బిందు పక్కకి తిరిగి చూసింది. లక్కీ కళ్ళు స్నేహంగా పలకరిస్తున్నాయి. వికాస్ బల్లమీది సామాన్లన్నీ వంటింట్లో పెట్టి చేతులు కడుక్కుని వచ్చాడు.

అందరూ అందరి మొహాలు కనిపించేలా కూర్చుని చూస్తున్నాడు.

“ఈ రోజు అనంత్ లంచ్‌కి పిలిచాడు” విక్కీ మొదలు పెట్టాడు, టీవీ కట్టేసి. మ్యూట్‌లో ఉన్నా అందరూ దానికేసే చూస్తుంటారని.

“అందులో వింతేముందీ.. ఎప్పుడూ వెళ్తూనే ఉంటారు కదా!” లక్కీ అడిగింది తేలిగ్గా.

“మేమిద్దరమే” అన్నాడు విక్కీ.

బిందు ఆశ్చర్యంగా చూసింది. కొత్త ప్రాజెక్ట్‌కి తనని తీసేసి విక్కీకి అప్పచెప్తున్నాడా?

“మీరనుకుంటున్న కారణం ఏదీకాదు. అతనికి మన బిందుని పెళ్ళి చేసుకోవాలని ఉందిట”

అసంకల్పితంగా అందరూ లేచి నుంచున్నారు. బిందు నిలబడలేనట్లు సోఫా కోడుని పట్టుకుంది వంగి.

“కూర్చోండి. అనంత్‌కి ముప్ఫైఏళ్ళు నిండాయి. మేమిద్దరం ఒకే ఏజ్. ఇంత కాలం పెద్దవాళ్ళు పట్టించుకోక పోవడం వల్లా, తనకి నచ్చిన అమ్మాయి తారసపడకా పెళ్ళి చేసుకోలేదుట. బిందుని మనింట్లో చూసినప్పట్నుంచి అతనికి ఇష్టం ఏర్పడిందిట”

“మరి ఇంతవరకూ ఎందుకాగాడూ? ” లక్కీ ఆరా తీసింది.

“అనంత్‌ది జంప్ చేసే స్వభావం కాదు. నిదానస్తుడు. మొదట బిందుకి తనంటే ఎటువంటి అభిప్రాయమో తెలుసుకోవాలనుకున్నాడు. ఇటువంటి విషయాల్లో బిడియస్తుడు కనుక ముందుకి వెళ్ళలేకపోయాడు.

తరువాత.. పెద్దవాళ్ళు ఒప్పుకోకపోతే.. కనీసం ఒక కుటుంబమైనా యస్ అనాలని అతని ఆశ. తన ఫ్యామిలీ మీద ఆ ఆశ లేదు. మనమైనా సపోర్ట్ ఇవ్వాలని, ఇవ్వగలరా అని అడిగాడు. అఫ్‌కోర్స్ బిందుకి ఇష్టమైతేనే.

వాళ్ళ వాళ్ళు పూర్తిగా వ్యతిరేకిస్తే తను స్వతంత్రంగా బతకగలనా అని చూసుకున్నాడు.. ” అది వినగానే అందరి మొహాల్లో నవ్వు..

“నిజమే! మనకి నవ్వు వచ్చేట్లుగానే ఉంటుంది. కానీ అతను ఒక జీవన విధానానికి అలవాటు పడ్డాడు. భవిష్యత్తులో, ఈ పెళ్ళి చేసుకున్నందువల్ల ఇది కోల్పోయానని అనుకోకూడదని.. అదే విధంగా బిందూని కూడా ఆలోచించుకోమన్నాడు.

తర్వాత.. మనందరం బాగా ఆలోచించుకోవలసింది.. మనం సపోర్ట్ చేస్తున్నామంటే డబ్బుకి ఎర వేస్తున్నామని అందరూ అంటారు. అటువంటి విమర్శలని ఎదుర్కోగల ధైర్యం ఉండాలి. ముఖ్యంగా అనంత్ పేరెంట్స్ నుంచి అవమానాలు ఎదుర్కోవలసి రావచ్చు. అనంత్ అవేమీ జరక్కుండా చూసుకుంటానని అన్నాడు.. కానీ చెప్పలేం"

"మరి కులం? వాళ్ళు రాజులనుకుంటా.. మనం బ్రాహ్మిన్స్.." మాణిక్యం అంది సందేహిస్తూనే. ఇప్పటి పిల్లలకి ఇవేం అక్కర్లేదు కానీ..

"అదీ పాయింటేనమ్మా. వాళ్ళు మాంసాహారులు. మాకు అదేం సమస్య కాదు.. మేం బైటికి వెళ్ళినప్పుడల్లా తింటూనే ఉంటాం. కానీ మన వాళ్ళలో నుంచి కామెంట్స్ వస్తాయి. అదే అనేది.. డబ్బు కోసమే అని అందరూ అంటారంటే.. కానీ అనంత్ నాకు నాలుగు సంవత్సరాలు పైగా తెలుసు. అటువంటి మంచి మనిషిని ఎక్కడో కానీ చూడం.

బిందూని కంటికి రెప్పలా చూసుకుంటాడు. ఎందుకంటే తన ఉద్యోగుల సమస్యలకే అతను ఎంత సానుభూతిగా స్పందిస్తాడో కళ్ళారా చూశాను. ఇంక రూపం.. మీరు చూశారు కదా.. సినిమాల్లో చూసే యువరాజులాగ ఉంటాడు"

"ఇంతకీ అమ్మాయిగారు ఏమంటుందో!" పక్కనే కూర్చున్న లక్కీ, బిందు మొహం పైకెత్తింది.

బిందు మొహం ఎర్రగా అయిపోయింది. తను రేపు ఎందుకు రిజైన్ చేద్దామనుకుందో.. అదే సమస్య ఇప్పుడు మబ్బులు విచ్చుకున్నట్లు విచ్చుకుంటుంటే.. ఆనందం అంతా మొహంలో కనిపించేస్తోంది.

ఎవరికీ ఏ సందేహం రాలేదు.

"అవునూ అనంత్‌కి ఎంత ఆస్తి ఉంటుం దనంటావూ? అంటే డబ్బూ.. ఎర.. ఏదో అంటున్నావు కదా.." అవధానిగారు అడిగారు, ఎంత సొంత కంపెనీ ఉంటే మాత్రం తనో డిజీయమ్ అనే భావంతో.

"సుమారు ఐదువందల కోట్లు"

అవధానిగారు కరెన్సీ చెస్ట్‌లో కూడా అంత డబ్బు చూడలేదు ఒక్కసారి.

**13**



"**వి**క్కీ! ఎలా ఉన్నారు అందరూ?"

విక్కీ నిద్ర మంచం మీద నుంచే ఫోన్ తీసి, టైమ్ చూశాడు. ఆరు అవడానికి ఇంకా పది నిముషాలు ఉంది.

అందరూ రాత్రి మాట్లాడుకుని మంచీ చెడూ చర్చించుకునే సరికి ఒంటిగంట దాటింది.

"నాకూ ఇష్టమే" బిందు బోలెడు సంతోషాన్ని లోపలే దాచుకుని బింకంగా అంది.

అందరూ గట్టిగా నిట్టూర్చారు.. 'హమ్మయ్య!' అనుకుంటూ.

లక్కీ పసికట్టింది. 'ఈ దొంగపిల్ల కూడా ప్రేమలో పడిందికానీ పోజు కొడ్తోంది' అని. తర్వాత ఆట పట్టిస్తుంటే, బిందూ ఉడుక్కుంది, కళ్ళలో నవ్వు దాచుకుంటూ, దాచుకోలేక అవస్థ పడుతూ.

"హల్లో" మత్తుగా అన్నాడు వికాస్, బొంగురు గొంతుతో.

"సారీ విక్కీ! నిద్ర లేపేసినట్లున్నాను. నీకు తెలుసు కదా.. ఏదయినా ప్రాబ్లం బగ్ చేస్తుంటే నాకు నిద్ర పట్టదని"

"అబ్బే! అదేంలేదు అనంత్. ఆఫీసుకి ఏడు గంటలకి వచ్చేస్తా. అక్కడ మాట్లాడుకుందాం" అంటూ బాత్రూంలో దూరాడు విక్కీ.

ఫోన్ పెట్టేసి, దానికేసే చూస్తు ఉండిపోయాడు అనంత్.

ఏదో చెప్పకూడదూ! మళ్ళీ సస్పెన్స్. పూర్తిగా ఓకే అనుకోకముందు సంగతి వేరు కానీ, ఇప్పుడు ఎప్పుడెప్పుడా అని ఉంది.

కళ్ళముందు బిందు నుంచున్నట్లు ఉంది. తమ సంసారం ఎలా ఉంటుందో ఊహించుకుంటేనే ఒళ్ళు జల్లు మంటోంది. ఇదే సినిమాలో అయితే ఏ బ్యాంకాకో వెళ్లిపోయేవారు ఊహల్లో. తను ఉహల్లో కాదు, నిజంగా తీసుకెళ్తాడు.

అనంత్ మొహం ఆనందంతో విచ్చుకుంది. పెదవుల మీద చిరునవ్వు. తలుపు మీద టక్ టక్..

"ఎవరూ.." అనంత్ పూర్తి చెయ్యకుండానే నాండీ వచ్చేశాడు.

"గుడ్ మార్నింగ్. రాత్రి సరిగ్గా నిద్రపోలేదు కదూ! నువ్వు అటూ, ఇటూ తిరుగుతున్న చప్పుడు నాకు వినిపించింది. నాకు ఎగ్జామ్స్‌లే."

అనంత్ చిరునవ్వు నవ్వి కూర్చోమని పక్కకు జరిగాడు.

"ఏమయింది? వదిన పోట్లాడిందా?" ముందుకు వంగి అన్న మొహంలోకి చూస్తూ అన్నాడు నాండీ.

స్ప్రింగ్‌లా లేచి నాండీని ఒక్క నెట్టు నెట్టాడు, పిల్లోతో కొడ్తూ.

నాండి ఊరుకోలేదు. ఎదురు దాడికి దిగాడు. కొంచెం సేపయ్యాక అలిసిపోయి ఇద్దరూ కూలబడ్డారు.

"నేను కనిపెట్టలేదనుకున్నావా? నీరూ

స్‌కి వెళ్లినప్పుడే పసి కట్టేశాను. ఇందాక నీమొహం చూసి ప్రొసీడ్ అయిపోయావని తెలిసి పోయింది"

"టెలిపతీ ఉందేంరా నీకు? ఇప్పటి వరకూ బిందూకే తెలీదు"

"టీనేజి ఉంది. మాకు ఇట్లాంటివి ఫస్ట్ రియాక్షన్‌లోనే తెలిసిపోతాయి"

"కాఫీ చెప్పు" అనంత్ బాత్రూంలోకి వెళ్తూ అన్నాడు.

నాండీ ఇంటర్‌కం నొక్కి, జాన్‌కి చెప్పాడు.

"చిన్న బాబూ! కాఫీనా.." గుసగుసగా అడిగాడు జాన్.

"ఓహ్! అక్కడ మమ్మా ఉందా! కాఫీనే, రెండు. అన్న గదికి తీసుకురా" తనూ అంతే గుసగుసగా అన్నాడు నాండీ.

అనంత్ స్నానంతో సహా అన్ని పనులూ ముగించి రావడానికి పావుగంట పట్టింది.

జాన్ కాఫీతో, టిఫిన్ కూడా తెచ్చాడు.

"ఎర్రగా కాల్చిన బ్రెడ్‌కి బాగా వెన్న పట్టించి, నాలుగు గుడ్లతో ఆమ్లెట్, సాస్.. ఇడ్లీ, కొబ్బరి పచ్చడి, అన్నీ అమర్చి ట్రేని బండి మీద పెట్టి తోసుకుంటూ వచ్చాడు.

అన్నీ బల్లమీద సర్ది వెళ్లిపోయాడు జాన్.

"వావ్ యమ్మీ బ్రేక్ ఫాస్ట్.." నాండీ చూసీ చూడగానే వాటి మీద పడ్డాడు.

అనంత్ కూడా రెండు ఇడ్లీలు తినేసి, కాఫీ తాగి, తయారయిపోయాడు.

"బై నాండీ. సెవెన్‌కి విక్కీని కలవాలి, ఆఫీసులో" ఆఫీస్‌ని ఒత్తి పలుకుతూ అన్నాడు అనంత్, షూస్ వేసుకుంటూ.

"గుడ్ ఐడియా, ఆఫీసులో అయితే ఎవరికీ అనుమానం రాదు. వదిన్ని కూడా రమ్మనక పోయావా? "

నాండీ తెలివి గురించి ఆశ్చర్యపోవడం మానేశాడు అనంత్.

"అదే నాకు తెలీదురా! తను ఒప్పుకుంటే మన ఇంట్లో ఎలా టాకిల్ చెయ్యాలో అస్సలు అర్థం కావట్లేదు" డొంక తిరుగుడు ఎందుకని సూటిగా అన్నాడు అనంత్.

"తప్పకుండా ఒప్పుకుంటుంది. వదిన కళ్ళలో కూడా స్టార్స్ అండ్ స్పార్క్స్.. నీకు కనిపించలేదేమో కానీ!"

ఆశగా చూశాడు అనంత్.

"నో వర్రీస్ అన్నా! విక్కీ అన్న గుడ్ న్యూస్‌తో వస్తున్నాడు. బీ హ్యాపీ.. ఓహ్.. ఇప్పుడు బావ అనాలి కదూ! ఫరవాలేదులే.. అలవాటు చేసుకుంటా"

"ఏయ్! నా టెన్షన్ అర్థం చేసుకోవేరా?

## కొత్తగాలి...

**'బండ'**
**రాయితీ కొండెక్కి**
**అయింది**
**గుదిబండ**

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

పోనీ అక్కడ ఓకే అనుకుందాం.. మన ఇంట్లో? "

"ఊఁ, మన ఇంట్లో.. ఇంకా పాలు తాగే పాపాయివా? "

"అదేంటిరా, ఇంక ఆపు"

నాలుగు బ్రెడ్ టోస్ట్‌లు ఆమ్లెట్‌తో తిని, నాలుగు ఇడ్లీలు వేసుకుంటున్న నాండీని భీతావహంగా చూశాడు అనంత్.

"డయటీషియన్ ఇచ్చిన తిండి అన్నా! తినక తప్పదు. మజిల్స్.. వదిలితే మమ్మా క్లాస్ పీకుతుంది"

"డయటీషియనా.. వాడి హెడ్డా! ఇడ్లీలు, కమోడ్‌లో తోసెయ్యి. పెద్దయ్యాక చాలా ప్రాబ్లమ్స్ వస్తాయి, బకాసురుడిలా తింటే.

నీకు పాతికేళ్లు దాటాక మజిల్స్ వస్తాయి. ఇలా తింటే ఈలోపు ఫాట్ పేరుకుం టుంది"

"ఫరవాలేదు అన్నా! మమ్మా లిపోసక్షన్ చేయిస్తుంది" తేలిగ్గా అన్నాడు నాండీ.

అనంత్ నిస్సహాయంగా చూసి, ఇడ్లీలు లాక్కుని బాత్రూంలో ఫ్లష్ చేసి వచ్చాడు.

అంతలో టైమ్ చూసి, ఒక్క ఉదుట్న లే చాడు అనంత్.

"ఆల్ ద బెస్ట్ అన్నా! మనింటి సంగతి పట్టించుకోకు. స్పెషల్‌గా నీకు 'చెప్పిన మాట వినవు' అనే మంచి క్వాలిఫికేషన్ ఎలాగా ఉంది. ఏమయినా చెయ్యచ్చు. గో ఎహెడ్.. లక్కీ ఫెల్లో"

వెనక్కి తిరిగి తమ్ముడ్ని ఊరడించాలని ఉన్నా, ఇంకొకరి తోడు ఉంటే ఇంకా సుల భంగా ఇంటి పరిస్థితులు మార్చవచ్చని ముందుకు ఉరికాడు అనంత్.

★ ★ ★

"హాయ్ విక్కీ! సారీ లేటయింది. నాండీ వదల్లేదు.." వాక్యం పూర్తి చెయ్యకుండా అలా చూస్తుండి పోయాడు.

తలుపు తీస్తున్న చప్పుడు విని, అప్పుడే తన ఛాంబరు లోనుంచి వస్తోంది బిందు.

కను చూపు మేరలో విక్కీ లేడు.

తెల్లని పంజాబీ డ్రస్‌లో, లేత రంగు రాజస్థానీ డిజైన్ ఉన్న తెల్లని చున్నీ కప్పు కుని, మేఘాల్లోంచి దేవతలా వస్తోంది బిందు.

ఏవీయస్ టెక్స్‌లో డ్రస్ కోడ్ ఉంది. తెలుపు. శరీరం పూర్తిగా కవర్ చేసుకో వాలి. మగ వారికి టై, ఫుల్ హాండ్స్ షర్ట్ తప్పదు. ఆడవారు, పంజాబీ సూట్, అదీ నూలుదే వేసుకోవాలి. టై రంగులు మారి నట్లే చున్నీ డిజైన్‌లు కూడా మార్చుకో వచ్చు. ఇది బిందూ ఇచ్చిన సలహానే.

"ఆడపిల్లలు కూడా పాంట్లూ షర్ట్‌లూ ఎందుకూ.. మన దేశంలో మన డ్రస్ కోడే.." అనంత్‌కి కూడా నచ్చింది.

ఈ రోజు బిందుని చూస్తుంటే, తెలుపు మనసుకి ఎంత ఊరట కలిగిస్తోందో తెలి సింది అనంత్‌కి. చిరునవ్వు నవ్వాడు.

అసలు ఈ విక్కీ ఎందుకు రాలేదూ.. తన నోరు మూతబడిపోయింది ఎందు కో.. ఏం మాట్లాడాలి! ఎలా మొదలు పెట్టాలీ? అనంత్ ఇబ్బందిగా పెట్టాడు మొహం.

"హాయ్ అనంత్!" బిందు హుషారుగా అంది. ఇప్పుడెందుకూ బిడియం..

"అంతా ఓకేనా!" టెన్షన్‌గా అడిగాడు. తిన్నగా బిందునే అడగాల్సి వచ్చినందుకు విక్కీని తిట్టుకుంటూ.

"ఏదంతా? " చిలిపిగా అడిగింది బిందు.

అసంకల్పితంగా చెయ్యి చాపాడు. రెండు అంగల్లో వచ్చి, రెండు చేతులతో అనంత్ చేతిని పట్టుకుంది బిందు.

అయ్యయ్యో! ఒక్క గులాబీ పువ్వయినా తేవాల్సింది. వచ్చే ముందు, వీడ్కోలు చెప్పిన తన తోటలోని గులాబీలు గుర్తుకొ చ్చాయి అనంత్‌కి.

అప్పుడు అతని కంటబడింది.. బిందు తలలోని ఎర్రగులాబీ.

సంకోచించకుండా పిన్ను లాగి, గులా బీని బైటికి లాగి, మోకాళ్ళ మీద కూర్చుని, అందిస్తూ అడిగాడు..

"నన్ను పెళ్లి చేసుకుంటావా? "

జుట్టు దగ్గరికి వస్తున్న అనంత్ చేతిని అయోమయంగా చూస్తున్న బిందు, అతని ఉద్దేశ్యం గ్రహించి, తేరుకుని రెండు చేతులు చాపి, "యస్" అంది.

ఆ చేతుల్ని పట్టుకుని లేచి నిల్చున్నాడు అనంత్.

అదే సమయానికి ఆఫీసులో బిలబిలా అందరూ వస్తున్న ధ్వనులు వినిపిం చాయి.

బిందు తన ఛాంబర్‌లోకి పోయింది.




ముందుగా లోపలికి వచ్చిన విక్కీ షేక్ హాండ్ ఇచ్చాడు..

"కంగ్రాచ్యులేషన్స్ డూడ్!"

వెనుకే శ్రీనాధ్.

"శ్రీ! నీక్కూడా.."

"పొద్దున్న విక్కీ ఫోన్ చేస్తే. నాకు ఏమీ ఆశ్యర్యం వెయ్యలేదు అనంత్. ఈ న్యూస్ ఎప్పుడో అప్పుడు వస్తుందని నాకు తెలుసు. ఇన్‌ఫాక్ట్.. మనం.."

"తాజ్‌కృష్ణాకి వెళ్లినప్పుడు..."

ముగ్గురు ఒకేసారి అన్నారు. బిందూ కూడా లోపల్నుంచి వచ్చి చేరింది, హాయిగా నవ్వుకోడానికి.

"ఆ సంగతి ఇందాకే నాండి చెప్పాడు. కళ్లు పనిచేస్తున్న వాళ్లెవరికైనా మీ సంగతి ఆ రోజు తెలిసిపోతుందని"

★ ★ ★

ఆనంత్ ఊహించినట్లుగానే వాళ్ళింట్లో పెద్ద గొడవ అయింది.

"అనంత్! నువ్వు ఎప్పుడూ నా మాట వినవు. కానీ తాతగారి ఆశలు కూడా లెక్క చెయ్యవని అనుకోలేదు" రాణీ సెంటిమెంటుతో కొట్టాననుకుంది.

"తాతగారు ఉంటే ఐదేళ్ళ క్రితమే నాకు పెళ్లి చేసేవారు. అప్పుడు ఈ సమస్యే ఉండేది కాదు"

రాజాగారూ, రాణి కూడా ఏమీ మాట్లాడలేకపోయారు.

నిజమే! ఈ సంగతి పూర్తిగా మర్చిపోయాము. ఇప్పుడెలా.. బ్రాహ్మల అమ్మాయిని, అదీ టికాణా లేని వాళ్ళ పిల్లని, తన కింద పనిచేసే అమ్మాయిని చేసుకుంటానంటున్నాడు. ఎలా ఆపడం?

"నిజమే అనంత్. ఇప్పుడు చూస్తాం. ఇన్ని రోజులు పట్టించుకోనందుకు, మన వంశ ప్రతిష్ఠ పాడుచెయ్యకు" రాజావారు నచ్చచెప్పడానికి ప్రయత్నం చేశారు.

"మీరు కూడా ఇలా మాట్లాడుతున్నారా నాన్నగారూ? ప్రపంచ దేశాలన్నీ తిరిగారు. ఎందర్నో చూశారు. ఇంకా కులాల మూలాన పెళ్ళిళ్ళు మానెయ్యాలని అనుకుంటున్నారా? అమ్మాయి, అబ్బాయి ఒకరికొకరు నచ్చడం ముఖ్యం. అర్థం చేసుకోవడం అవసరం. అప్పుడే పదికాలాల పాటు నిలబడుతుంది ఆ సంసారం".

"పోనీ కులం వదిలేసినా.. బొత్తిగా వాళ్ళ స్టేటస్.."

"మిడిల్ క్లాస్! అందుకనే బిందు నాకు నచ్చింది. హిపోక్రసీ లేదు. 'మేము ఇద్దరం కలిసి జీవించగలం' అని నాకు నమ్మకం కలిగింది. అదే మమ్మీఫ్రెండ్స్ పిల్లలతో నాకు మాట్లాడ్డానికీ మనసొప్పేది కాదు.

ఈ అమ్మాయిని కూడా రెండు సంవత్సరాలు చూశాక, తన పద్ధతులు నచ్చాక, తనే కావాలనుకున్నాను. డబ్బు.. మనకి లేదా? ఇంకా సంపాదించగల సత్తా ఉంది. మనకి అనుకూలంగా ఉండే అమ్మాయి కావాలి కానీ, అంతస్తు ఉన్న అమ్మాయి కాదు. ఇదే నా నిర్ణయం అమ్మా! నాన్నగారూ.. మీకు ఇష్టమైతే చెప్పండి.. మన పద్ధతుల్లో జరుగుతుంది. లేకపోతే గుళ్ళో చేసుకుంటా"

తుపాకీ గుండులా వదిలాడు మాట.

"సరే, అయితే నువ్వు అంతలా చెప్తుంటే మేమెందుకు కాదని చెడ్డవాళ్లమవాలి. వాళ్లని రమ్మను. ముహుర్తాలు పెట్టిద్దాం"

"నిశ్చితార్థం వేరే, పెళ్ళి వేరేకి నాకు టైమ్ లేదు. వచ్చే నెలలో సింగపూర్ వెళ్తున్నాం. ఒక సంవత్సరం ఉంటాం అక్కడ. ఈ లోగా పెళ్లి అయిపోవాలి"

ఇటువంటి స్థితి రాజావారికి రావడం ఇదే ప్రథమం. వ్యాపారస్తులు కదా! చకచకా నిర్ణయాలు తీసేసుకున్నారు.

"అయితే వాళ్ళనే ముహూర్తం పెట్టేసి,

## కొత్తగాలి...

**ఉండొచ్చు**
**రెండేసి అవయవాలు**
**ఉండొచ్చేమో**
**రెండు యాబైలు**
**డవుటే, రెండు షష్టిపూర్తులు**

– *యస్. రజని, రాయపూర్, ఛత్తీస్‌గఢ్*

లగ్న పత్రిక తీసుకుని రమ్మను. నేను ఎల్లుండి సాయంత్రం హాంగ్‌కాంగ్ వెళ్తున్నా. కళ్యాణ మండపం కూడా వాళ్లనే బుక్ చేసుకొమ్మను, వాళ్ళిష్టం వచ్చిన చోట. మన వాళ్ళు ఐదారు వందల మంది ఉంటారు"

"అంత తగ్గించనక్కర్లేదు నాన్నగారూ! వాళ్ళు మరీ అంత లేనివాళ్ళు కాదు. రెండువేల వరకూ, మన సర్కిల్లో అందర్నీ పిలవండి. గ్రాండ్‌గా చేస్తారు పెళ్ళి"

రాణీ ప్రేక్షకురాలిగా ఉండి పోయింది.

★ ★ ★

మర్నాడే విక్కీవాళ్ళింటికి వెళ్లారు, అనంత్, శ్రీనాథ్, సునీత, రేణూ. నాండీ కాలేజ్ నుండి వచ్చేశాడు.

రేణూకిప్పుడు మూడేళ్లు. చిలకలా కబుర్లు చెప్తుంటుంది.

సునీతనీ, లక్కీనీ తీసుకుని అనంత్ కళాంజలీకి వెళ్లి కొన్నాడు చీర. లక్కీ ఒక్క రోజులో కుట్టించింది బ్లౌజ్.

"మా నాన్నగారు ఊర్లో లేరు అత్తయ్య గారూ! అందుకని మేమే వచ్చాం. ఇదే నిశ్చితార్థం"

ఇలా జరుగుతుందని ఊహించిందే కనుక ఎవరూ పెద్దగా అనుకోలేదు.

అపుడే పురోహితుడ్ని కూడా పిలిచి, పీటల మీద కూర్చోపెట్టి, ఆశీర్వచనం చెప్పించారు.

రేణు హడావుడి చెప్పక్కర్లేదు. వికాస్ కొడుకు బన్నీ ఏడాదివాడు..వాడ్నివద లకుండా ఎత్తుకొని తిప్పింది. పర్పుల్ రంగు డిజైనర్ చీరలో బిందు మెరిసిపో తోంది. ఇరవైఏళ్ళ అమ్మాయిలా ఉం టుంది బిందు.

"అమ్మకి కోడల్ని చూసే అదృష్టం లేదు" అనుకున్నారు, అనంత్, నాండీ.

ఆరోజు పొద్దున్నుంచీ అడుగుతున్నాడు అనంత్, రాణీని రమ్మని.

"అమ్మా! నేను ఇష్టపడ్డ అమ్మాయితో సుఖంగా ఉంటాను. ఇవేళ ముహూర్తం పెట్టాడానికి పురోహితుడు వస్తున్నారు వాళ్ళింటికి. వచ్చి కోడల్ని చూడమ్మా.. చూసి ఆశీర్వదించమ్మా!" అంటే, మొహం తిప్పుకుని అక్కడ్నుంచి వెళ్లిపోయింది.

ఆఖరి ప్రయత్నంగా వచ్చే ముందు కూడా అడిగాడు. మౌనమే సమాధానం.

మూడువారాల తరువాత పొద్దున్న తొమ్మిది గంటలకి కుదిరింది ముహూర్తం.

"అంతా మీ పద్ధతిలోనే చెయ్యండి మామయ్యగారూ. కాకపోతే మాకు తల పాగా ఉంటుంది. వంశ పారంపర్యంగా వచ్చింది. అది పెట్టుకోవాలి"

"రాజుల పెళ్ళిళ్ళు చాలా చేయించాను.. అలాగే చేద్దాం" అన్నారు అయ్యవారు.

"విక్కీ! మా బంధువులు, స్నేహితులూ రెండు వేలమంది ఉంటారు. మా పద్ధతిలో జరగాలంటే చాలా అవుతుంది. కేటరింగ్ నేను మాట్లాడి ఫిక్స్ చేస్తాను. కళ్యాణ మండపం నువ్వు బుక్ చెయ్యి. అంటే ఖర్చు.. ఫిఫ్టీ ఫిఫ్టీ అన్నమాట" నవ్వాడు అనంత్.

అన్ని రోజులుగా.. పెళ్ళి కుదిరినప్ప ట్నుంచీ వెంటాడుతున్న సమస్య తీరిపో యింది.

పెళ్లి నోమా కళ్యాణ మండపంలో జరి గింది, అంగరంగ వైభవంగా.

రాణీకి, పదిహేనువేలు ఖరీదు చేసే పట్టుచీర కొన్నారు ఆడ పెళ్ళివారు. చీర పెట్టేటప్పుడు, దానిమీద పెట్టమని, ఒక చిన్న బాక్సు ఇచ్చాడు అనంత్. అందులో వజ్రాల సెట్ ఉంది. అవి చూసిన రాణీ మొహం ప్రసన్నంగా అయింది.

పెళ్ళికూతురి చీరలన్నీ అనంతే కొన్నాడు. రాజావారు వచ్చాక వారి వంశాచారం ప్రకారం ఇంటికోడలికి పెట్టే జవహరీ అంతా కొనేశారు.

అవధానిగారూ, మాణిక్యం శక్తి వంచన లేక వియ్యాలవారికి మర్యాదలు జరిపారు.

విక్కీ, శ్రీనాథ్ అంతా తామే అయి తిరిగారు. లక్కీ.. ఎక్కడ చూసినా తనే కనిపించింది.

పెళ్ళయ్యాక రాజావారి భవనంలో వారం రోజులున్నారు అనంత్, బిందూ.

రాణీ ముక్తసరిగా ఉన్నా కోడలితో స్నేహంగానే ఉంది. బిందు వీలున్నప్పుడల్లా మాట కలిపేందుకు ప్రయత్నించింది.

నాండీని పట్టుకోలేక పోయారు ఎవ్వరూ. భవనమంతా సందడే సందడి.

అనంత్‌కీ, బిందూకి వీడ్కోలు చెప్పడానికి ఏవీయస్ టెక్స్ ఉద్యోగులు అందరూ వచ్చారు ఎయిర్‌పోర్ట్‌కి. సింగపూర్‌లో ఫ్లాట్, ఫర్నిచర్ బుక్ చేసేశాడు శ్రీనాథ్, ఏజెంట్ ద్వారా.

బుంగమూతి పెట్టుకుని, కళ్ళలోంచి రావడానికి సిద్ధంగా ఉన్న నీళ్ళని ఆపుకుంటున్న నాండీని గాఢంగా కౌగలించుకుని అన్నాడు అనంత్..

"ఎంతా? వన్ ఇయర్‌లో వచ్చేస్తాం. రోజూ వెబ్‌కామ్‌లో మాట్లాడుకుంటూ చూసుకుందాం.. ఓకే.."




బాలయ్య తోటలో అటూ ఇటూ తిరుగుతూ ప్రతి మొక్కనీ పలుకరిస్తున్నాడు.

రేణుని తీసుకుని నాయనమ్మ వచ్చింది అప్పుడే.

"నానమ్మా! మాలచ్మి ఊగట్లేదు. నేనంటే కోపం వచ్చిందేమో. చూడు.. ఒక్క కాయ కూడా నాకు అందనియ్యడం లేదు."

"అదేంటి చిట్టితల్లీ! నీమీద కోపం ఎందుకొస్తుంది? ఎండ ఎక్కువగా ఉంది కదా! కదుల్తే నీకు వేడి తగుల్తుందని, గొడుగులా ఉండి పోయుంటుంది" బాలయ్య దగ్గరగా వచ్చి మాలచ్మిని కొమ్మకొమ్మకీ చూస్తూ అన్నాడు.

"చీడగానీ పట్టలేదు కందా.." అనుకుంటూ. చెట్టు అంతా శుభ్రంగా ఉంది. ఎండకి ఆకులు వడలిపోయినట్లున్నాయి కానీ.

"మరి కాయలు..?" రేణుకి ఇంకా సందేహమే.

"కాయలు పైకి వెళ్ళినయ్. మరి నీలాగనే మాలచ్మి కూడా ఎదుగుతోంది కదా! అందుకని. నేను ఎత్తుకుంటే నీకు అందుతాయి."

బాలయ్య ఎత్తుకుని, రేణు కాయ కోసేందుకు సహాయం చేశాడు.

మాలచ్మి మధ్యలో ఒక వెడల్పు కొమ్మ మీద ఒక మెత్తని వేసి రేణు కూర్చోవడానికి ఏర్పాటు చేశాడు బాలయ్య.

గౌరమ్మచెట్టుకి బలమైన తాళ్ళతో ఉయ్యాల కట్టి ఆ ఉయ్యాలకి కూడా దిండుతో మెత్తని సీటు పెట్టాడు.

రేణు రోజుకి ఒక అరగంటైనా అందులో ఊగాల్సిందే.

"తాతయ్యా! మరి నేను స్కూలు కెళ్తే మాలచ్మినెట్లా చూడ్డం?"

రేణుకి చిరెక్ స్కూల్లో సీటు వచ్చింది. మొయినాబాద్ నుంచి కూడా పిల్లల్ని తీసుకు వెళ్ళడానికి బస్‌లు వేశారు.

"స్కూలు నుంచి వచ్చాక తీసుకొస్తాం. ఆదివారం అంతా ఇక్కడ్నే ఉందాం.

సరేనా? " రేణుక గ్లాసులో బొండం నీళ్ళు తెచ్చి తాగిస్తూ అంది.

రోజూ మనుమరాలితో తోటలో గడపడం ఎంతో ఇష్టం బాలయ్యకి.

వీలున్నప్పుడు సునీత కూడా వస్తుంటుంది. శ్రీనాథ్ పూర్తిగా తమ కొత్త ప్రాజెక్టులో మునిగిపోయాడు. విక్కీ అక్కడున్న అనంత్ కంపెనీలు అన్నింటికీ జీయం. ఇద్దరికీ వాళ్ళజీతం కాక సంవత్సరానికి పాతిక లక్షలు లాభాలు వస్తున్నాయి.

'ఇంక తోటకి వెళ్ళి కష్టపడద్దు నాన్నా!' అంటే వినడు బాలయ్య.

"పోలేని స్థితి వస్తే అప్పుడెట్లాగ పోలేను. ఇప్పట్నుంచీ మంచం ఎక్కి కూర్చోవాల్నా బేటా? " అని వాదిస్తాడు.

సునీతకి మెహిదీపట్నంలో ఒక మంచి సంగీతం టీచర్ దొరికింది. ఆవిడ దగ్గరికి వెళ్ళి నేర్చుకుంటోంది. సర్టిఫికేట్ కోర్స్ పాసయింది.

రేణు కూడా మొదలుపెట్టింది. ముద్దు ముద్దుగా స్వరాలు పాడుతుంటుంది.

ఆ రోజు.. సునీత కూడా తోటకి వచ్చింది. రేణుని ఉయ్యాల ఊగిస్తోంది.

"నాన్న.. నాన్న" అంటూ ఉయ్యాల లోంచి దూకబోయింది రేణు.

"ఇప్పుడు నాన్నెక్కడొస్తాడు.. పడిపోతావురా!" సునీత వారిస్తున్నా వినకుండా గింజుకుంటోంది.

"నీతూ!" శ్రీనాథ్ నిజంగానే వచ్చి సునీత వెనుక నుంచుని పిలుస్తున్నాడు.

"శ్రీ! అదేంటి.. ఈ టైమ్‌లో ఇక్కడ.. ఏంటలా ఉన్నావు? ఒంట్లో బాగలేదా? "

బాలయ్య, రేణుక కూడా వచ్చి నిశ్శబ్దంగా నిలబడ్డారు.

"ఏమయింది..? " సునీత గుండె దడదడా కొట్టుకోడం మొదలుపెట్టింది.

"మీ అమ్మగారికి సీరియస్‌గా ఉందిట. హాస్పిటల్‌లో చేర్పించారు. వదిన, అన్నయ్య చూసుకుంటున్నారు. నిన్ను తీసుకురమ్మన్నారు" పాఠం అప్పచెప్పినట్లు చెప్పాడు శ్రీనాథ్.

"అంతేనా లేక..? " అనుమానంగా అడిగింది.

"ఇందాకే.." అంటూ వెక్కుతున్న సునీతని దగ్గరికి తీసుకుని గుండెలో పొదివి పట్టుకుని ఓదార్చసాగాడు శ్రీనాథ్.

రేణు బిత్తరపోయి చూస్తూ కిందకి దూకబోతుంటే పట్టుకుంది రేణుక.

★ ★ ★

"ఒక విధంగా చూస్తే మంచిదే అనిపిస్తుంది నీతూ! అమ్మ ఒక నెల నుంచీ కదల్లేక పోతోంది. పనమ్మాయి వచ్చీ, రాకా.. నాన్న చెయ్యలేక పోతున్నారు. మనిళ్ళకి రమ్మంటే రారు. అమ్మ కూడా చాలా బాధపడింది. అన్ని జాయింట్సూ నొప్పే. అన్ని మందులకీ ఇమ్యూన్ అయిపోయింది బాడీ" సుజాత ఓదారుస్తోంది చెల్లెల్ని.

శాంత పోయి పదిరోజులయింది. సురేష్ బాగా నీరసించి పోయాడు.

రాత్రిళ్ళు ఒక గంట కూడ లేవకుండా పడుకోలేదుట. ఏదో ఒకటి శాంతకి అమర్చడం.. వేళకి మందులూ, ఆహారం.. మంచం మీద ఉండే మనిషికి చేసే సేవల గురించి వివరాలు చెప్పక్కర్లేదు కదా!

'ఎంతో సేవ చేశారు భార్యకి. ఎన్నదగిన మనిషి' అని ఎవరైనా అంటే మాత్రం కోపం వచ్చేస్తుంది సురేష్‌కి.

"నేను చేసిందేముంది.. భార్యా భర్తలన్నాక ఒకరికొకరు చేసుకోరా? అదే నేను మంచం పడితే ఆవిడ చెయ్యదా? అది కూడా గొప్పేనా? " అంటూ అరగంట తింటాడు అలా అన్న వాళ్ళ బుర్ర.

మనసులోనే నమస్కారం చేశారు, కూతుళ్ళూ అల్లుళ్ళూ.

ఇప్పుడు సురేష్‌ని ఒంటరిగా ఎలా వదలడం? పెద్ద సమస్యే వచ్చింది.

సుజాతకి హాస్పిటల్ పనే కాకుండా ఎమర్జెన్సీలూ, నైట్ డ్యూటీలూ. ఇద్దరూ డాక్టర్లవడంతో ఇంట్లో ఉండేది తక్కువ. స్వీటీ తరువాత ఒక అబ్బాయి. రేణు కంటే ఆర్నెల్లు చిన్న. పిల్లలిద్దరూ స్కూలు అవగానే నానమ్మ ఇంటికి వెళ్ళిపోతారు. ఇంటికి వచ్చేటప్పుడు వెళ్ళి తీసుకొస్తుంది సుజాత. ఒక్కొక్కసారి అక్కడే భోజనాలు చేసి వస్తారు.

అందుకని సుజాత ఇంటికి వెళ్ళినా సురేష్‌కి ఒంటరితనమే.

పైకి హుషారుగా కబుర్లు చెప్తున్నాడు కానీ కళ్ళలో నిరాసక్తత కనిపిస్తోంది.

## కొత్తగాలి...

**ప్రేమించమంటూ**
**కాళ్లావేళ్లా పడతాడు**
**పెళ్లయ్యాక**
**కాళ్లదగ్గర పడుండమంటాడు**

– కె. యన్నార్ నమ్మి,
నెగ్గిపూడి, ప. గో. జిల్లా

పద్నాలుగో రోజున అందరూ వెళ్ళిపోయే సమయం వచ్చింది.

సుజాత, సునీతలు దిగులుగా ఉన్నారు అటువంటి స్థితిలో తండ్రిని వదిలి వెళ్ళాలని. వాళ్ళిద్దరూ చర్చించుకున్నారు. కానీ ఇంకెవరికీ చెప్పలేదు, తండ్రి గురించిన సమస్య..

"పోనీ నేను శ్రీనాథ్‌ని అడగనా.. ఇంట్లోనే ఉంటాను కనుక నాన్నని చూసుకోగలుగుతాను" సునీత మాటలకి సుజాత తటపటాయించింది.

"ఎలా.. మీది జాయింట్ ఫ్యామిలీ. మీ అత్తగారూ వాళ్ళూ ఏమనుకుంటారు?" సుజాత కొట్టిపడేసింది.

శ్రీ మాత్రం ఆ విషయం ఆలోచిస్తున్నట్లు లేదు.

కానీ అది సమస్యే కాదని తేలిపోయింది ఒక్క క్షణంలో..

మధ్యాహ్నం భోజనాలయ్యాక, రేణుక హడావుడిగా వెళ్ళింది, సురేష్ దగ్గరికి.

"అన్నయ్యా! మీరింకా ఇలానే ఉన్నారే. చెప్పండి, ఏమి తీసుకెళ్ళాలో, నేను సర్దేస్తా"

"ఎక్కడికమ్మా?"

"అట్లడుగుతావేంటన్నయ్యా! మనింటికి. మీరు ఒక్కరూ ఇక్కడేం చేస్తరు? మనం దరం కలిసి ఉంటే మంచిగా మనుమరాలితో ఆడుకుంటుండచ్చు. బోలెడు గదులు కట్టించిండు మీ అల్లుడు. మేం మాత్రం ఏం చేసుకుంటాం. మనిషికి వండుకోవడానికి ఎంత కావాలె. పదండి పదండి"

రేణుక మాట్లాడుతుంటే అందరు నోళ్ళు తెరుచుకుని చూస్తున్నారు.

సునీతకి కళ్ళలోంచి నీళ్ళు ఆగకుండా వచ్చేస్తున్నాయి.

చాలా సాధారణమైన విషయంలా తేల్చి పడేసింది రేణుక. బాలయ్య అయితే గదిలోకి వెళ్ళి పుస్తకాలు క్రమంలో పెట్టేస్తున్నాడు.

ముందరే అనుకున్నట్లు శ్రీనాథ్ మినీ లారీ తెచ్చేశాడు.

"ఇదేంటి శ్రీ! చెప్పనేలేదు" సంభ్రమంగా అంది సునీత.

"చెప్పేందుకేముంది? మామయ్యని ఒంటరిగా ఎలా వదుల్తాం? ఇందులో చెప్పడానికీ, చర్చించడానికీ ఏముంది?"

సురేష్ మాత్రం అభ్యంతరం పెట్టాడు.

"ఆడపిల్ల ఇంటికి వచ్చి ఉండడమేంటమ్మా! నేను కాలక్షేపం చెయ్యగలను. శాంత ఉన్నప్పుడు చేసుకోలేదా?"

"అప్పుడు వేరన్నయ్యా! లేవలేని మనిషైనా.. ఒకరికొకరు. ఇప్పుడెట్ల కుదురుతుంది? మీరు రాకుంటే మేమందరం

ఇక్కడ్నే ఉంటం"

రేణుక మాటలకి అంత దుఃఖ వాతావ రణంలోనూ నవ్వు వచ్చింది అందరికీ.

సురేష్ అయిష్టంగానే బయలుదేరాడు.

సుజాత భారం తీరినట్లు తేటపడ్డ మొహంతో టాటా చెప్పింది.

రేణు సంబరం చెప్పక్కర్లేదు.

"నిజంగా తాతయ్య మనింట్లో ఉంటారా? బోలెడు స్టోరీస్ చెప్తారా?" ప్రశ్నలు వేస్తూనే ఉంది దారిలో.

సునీత పదివేల ఒకటోసారి దేముడికి కృతజ్ఞతలు తెలుపుకుంది, ఇటువంటి కుటుంబంలో తనకి స్థానమిచ్చినందుకు.

★ ★ ★

నాండీకి కొద్ది నెలల్లో పద్దెనిమిదేళ్ళు నిండుతాయి.

ఇంక పొడుగు పెరగడం ఆగిపో యాడు. రాణీ మాత్రం సినిమా ధ్యాస వదల్లేదు.

నాండీకి అన్ని ఎక్సర్‌సైజ్‌లూ బాగా అలవాటయిపోయాయి. మంచినీళ్ళు తాగి నట్లు చేసేస్తున్నాడు. తైక్వాండోలో పాఠాలు చెప్పే స్థితికి వచ్చాడు. తను నేర్చుకున్న స్కూల్లోనే శని ఆదివారాలు కూడా ఒక క్లాసు తీసుకుంటున్నాడు.

అనంత్ చెప్పినట్లు తినడం కొంత తగ్గించాడు, మమ్మా చూడకుండా. జాన్ కూడా సహకరిస్తున్నాడు.

అయినా యాబ్స్ రావట్లేదని రాణీ మథనపడ్తూనే ఉంది.

ఒకసారి ప్రసిద్ధ నిర్మాత సురేష్‌వర్మ గారు కాలేజ్‌కి వచ్చారు..

తను తీసే సినిమాకి ఫ్రెష్ ఫేస్ కావాలని. అతని ఊహలో ఉన్న హీరో కోసం, నగరంలోని కళాశాలలే కాకుండా విజయ వాడ, వైజాగ్ కూడా వెళ్ళి చూస్తున్నాడు.

అప్పుడప్పుడే టీనేజీ నుంచి యవ్వనంలో అడుగు పెడ్తున్న హీరో.. సగం విదేశీ, సగం భారతీయ రక్తం. మళ్ళీ స్పష్టంగా తెలుగు మాట్లాడగలిగి ఉండాలి.

కొన్ని వేలమందిని ఇంటర్వ్యూ చేశారు. ఎవరూ నచ్చలేదు.

సరిగ్గా ఆయన వచ్చిన సమయానికి కాలేజ్ డే జరుగుతోంది. అందులో నాండీది డాన్స్ ప్రోగ్రామ్.

చూడగానే ఇతని కోసమే వెతుకుతు న్నట్లు అనిపించింది..

ఐదు సంవత్సరాలు వచ్చినప్పట్నుంచి సినిమాలో నటించడమే ధ్యేయంగా నేర్చు కున్న డాన్స్ మరి. శరీరంలో ఎముకలే లేనట్లు మెలికలు తిరిగి పోతోంది బాడీ.

స్టేజ్ మీద ఉన్న నాండీకి ఆడియన్స్‌లో ఎవరున్నారో తెలీదు.

ప్రోగ్రామ్ అవగానే కబురు చేశారు, సురేష్‌వర్మగారు.

రాణీ అంతకు ముందు ఇచ్చిన పార్టీలకి ఆయన కూడా వెళ్ళేవారు. కానీ నాండీని గుర్తు పట్టలేదు. నాండీ గుర్తుపట్టాడు కానీ తనెవరో చెప్పలేదు.

మమ్మాకి తెలుస్తే ఇంకేమైనా ఉందా! చదువు పూర్తిగా మానెయ్యమంటుంది.

"అబ్బే! నాకు యాక్షన్ రాదు సార్. ఏదో కాలేజ్‌డేకి వేసిన గంతులు డాన్స్ అంటారేమిటి? సారీ సర్."

"రెమ్యూనరేషన్ చాలా ఉంటుంది నందగోపాల్! మీరు ఎన్ని ఇయర్స్ జాబ్ చేస్తే వస్తుంది?" సురేష్‌వర్మ ఆశ చూపించబోయాడు.

"వద్దండీ. మా ఇంట్లో కూడా ఒప్పు కోరు. ప్లీజ్ ఏమీ అనుకోకండి"

ఇంట్లో తెలిస్తే.. మమ్మా.. ఇంకేం లేదు. అన్ని రోజులుగా ఆవిడ ఎదురు చూస్తున్న ఛాన్స్‌ని ఒక్కక్షణంలో తన్నే శాడు.

నాండీ మొహంలో విజయ గర్వం తొంగిచూసింది. తనకి గుర్తున్నప్పట్నుంచీ

ఎన్ని కష్టాలుపడ్డాడూ.. ఎంత మిస్ అయ్యాడు!

నిరాశగా వెనుతిరిగాడు, సురేష్‌వర్మ, ప్రఖ్యాత నిర్మాత, దర్శకుడు.




"తాతయ్యా! ఇంకొంచెం స్పీడ్‌గా" రేణు అరుస్తోంది, ఉయ్యాలలో కూర్చుని.

ఇప్పుడు ఇద్దరు తాతయ్యలు, తనతో ఆడుకోవడానికి. తోటలో ఉన్నంతసేపూ ఊగచ్చు.

"తాతయ్యా! స్టోరీ.." అంటూ వస్తుంది, పడుకునే ముందు. సురేష్, రోజూ చంద మామ చదివీ, చిన్నపిల్లల ఇంగ్లీష్ పుస్త కాలు చదివీ, తయారుగా ఉంటాడు.

రోజూ కొత్త కథ చెప్పాల్సిందే మరి. పొరపాటున ఒకసారి చెప్పింది చెప్తే.. అప్పుడు చెప్పావుకదా అంటూ తనే ఆ కథ మొత్తం చెప్పేస్తుంది.

సురేష్‌కి కొత్తపల్లి వచ్చినప్పట్నుంచీ రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి. అసలు తన ఇల్లు వదిలి వేరేచోట ఉంటు న్నాననే స్పృహే లేదు.

తెల్లవారకుండానే రేణుక లేచేస్తుంది. ఆ వెంటనే బాలయ్య. కాఫీలు తాగే సమయా నికి, సురేష్ కూడా వచ్చేస్తాడు పెరట్లోకి. సురేష్‌కి, శ్రీనాథ్ బెడ్‌రూం ఇచ్చారు. ఇల్లు మార్చినప్పుడు అన్ని గదులూ ఒకే సైజ్‌కి చేయించాడు శ్రీనాథ్. సునీత మేడమీదికి మార్చేసింది వాళ్ళ సామాన్లన్నీ. అక్కడైతే రేణుకి వేరే చిన్న గది. పెద్ద హాలు, ఆడు కోవడానికి.

పగలు విశ్రాంతికి, కింద ఇంకో గది ఉండనే ఉంది. అందుకనే సురేష్‌కి, వియ్యంకులవాళ్ళకి ఇబ్బంది కలిగిస్తున్నా ననే భావమే రాలేదు ఎప్పుడూ.

చెట్ల సందులోంచి ఉదయిస్తున్న సూర్యుడ్ని చూస్తూ, కబుర్లు చెప్పుకుంటూ, చిక్కని పాలతో చేసిన కాఫీ తాగుతుంటే.. అన్ని రోజులు పడిన శ్రమని మర్చిపోతు న్నాడు సురేష్.

అతను కొంచెం విచారంగా ఉంటే చాలు "అన్నయ్యా! ఇది విన్నారా.." అంటూ ఏవో కబుర్లు చెప్తుంటుంది రేణుక.

మూడు రకాల పేపర్లు తెప్పిస్తాడు శ్రీనాథ్.

'అన్ని పేపర్లలో ఒకటే ఉంటుంది కదా.. ఎందుకు?' అంటే వినడు. దాని వలన పొద్దున్న పదిగంటల వరకూ కాల క్షేపం. మరీ ఎండలు ఎక్కువగా ఉన్న ప్పుడు, వానలు పడ్డప్పుడు తప్ప, పెరట్లోనే కూర్చుని పేపర్లు చదువుతాడు సురేష్.

అన్ని విశేషాలూ బాలయ్య, రేణుకలతో చర్చిస్తుంటాడు. సురేష్ వచ్చాక బాల య్యకి బైట ప్రపంచంలో ఏం జరుగు తోందో తెలుస్తోంది.

ఒక పేపర్లో, ఒకనేత దేముడు. రైతులకి ఇంత చేశాడు, భూములు ఇచ్చాడు, బీదవా రికి ఇళ్ళు కట్టించాడు, జలయజ్ఞం చేశాడు అని ఉంటుంది. ఇంకో పేపర్లో.. సరిగ్గా దానికి వ్యతిరేకం.

"ఒక్కళ్లయినా నిజాయితీగా జరిగింది జరుగుతున్నది రాయరేంటి బావగారూ! పొరపాటున కూడా వీళ్లు కోప్పడే పనిలేదు, వాళ్ళు మెచ్చుకునే పనిలేదు" అంటూ నవ్వు తాడు బాలయ్య.

"ఏందో.. బావ, బావమరుదులిద్దరు

ఎవర్ని చూసి నవ్వుకుంటున్నారూ.." అంటూ రేణుక మళ్ళీ కాఫీ తెస్తుంది.

కొత్తపల్లి వచ్చాక సురేష్ మొహం బాగా తేరుకుంది. అతనికి బీపీ, షుగర్ వంటివేం లేవు. కాకపోతే జబ్బుభార్యని చూసుకోవ డంలో అలసిపోయాడు. ఆ అలసట అంతా వచ్చిన కొత్తలో బాగా కనిపించేది.

రోజూ తోటకి వెళ్ళడం తప్పదు. వియ్యంకుళ్ళు ఇద్దరూ కలిసి మధ్యాహ్నం కునుకు అయ్యాక వెళ్తే, మళ్ళీ చీకటి పడ్డాకే రావడం. ఇప్పుడు బాలయ్యని రోజంతా అక్కడ ఉండనియ్యట్లేదు శ్రీనాథ్. ఒక పూట చాలంటున్నాడు.

మధ్య మధ్య సుజాత కుటుంబం.. రెండు రోజులు సెలవు దొరికితే జయా, రాములు రావడం..

సురేష్‌కి ఒంటరితనం దరికి రావట్లేదు.

★ ★ ★

"ఇంక పదిహేనిరవై రోజుల్లో కాయ తీసెయ్యచ్చు బావగారూ! పక్వానికొచ్చే స్తయ్" బాలయ్య తృప్తిగా చెట్ల నిండుగా ఉన్న కాయల్ని చూస్తూ అన్నాడు.

"మార్కెట్లో ఇప్పుడే కనిపిస్తున్నయ్.. మగ్గిన పళ్ళు. మన తోటే ఆలస్యం చేసిన ట్లుంది" తోటలో పూసిన మల్లెపూలు మాలకడ్తూ అంది రేణుక.

రేణుకకి ఇప్పుడిప్పుడే కొద్దిగా వయసు కనిపిస్తోంది. మరీ బరువు పనులు చెయ్య లేకపోతోంది. వంట పూర్తిగా సునీత మీద వదిలేసింది.

"అన్నయ్యకి నువ్వు చేస్తే నచ్చుతుంది. నేను కాయగూరలు తరిగియ్యడం, వంటిల్లు సర్దడం అన్నీ చేస్తా"

ఒక్క పొయ్యిమీద పెట్టడం, దింపడం తప్ప, వంటింట్లో పనంతా తనే చేస్తుంది. పనివాళ్ళు ఉండనే ఉన్నారు. ఇంట్లో నీచు వండడం మానేశారు.

చాలా రోజుల వరకూ సురేష్‌కి తెలియలేదు. తెలిశాక దెబ్బలాడాడు.

"చెల్లెమ్మా! నా కోసం మీ అలవాట్లు మానుకోవద్దు"

లేదన్నయ్యా! ఇంక మేం కూడా అరిగిం చుకోలేకపోతున్నాం. శ్రీనాథు పెళ్ళయినప్ప ట్నుంచీ మానేశాడు. పాపకి పెట్టడం కూడా వాళ్ళకి నచ్చట్లేదు." రేణుక అంతే.. అతికినట్లు చెప్పేస్తుంది.

తోటలో ఉంటే మరీ బాగుంటుంది సురేష్‌కి. తోట చుట్టూ ముళ్ళ కంచె.. కంచెకివతల వరుసగా వేపచెట్లు.. తోటలో గాలి పీలిస్తుంటే, ప్రాణం లేచొచ్చినట్లుగా ఉంటుంది.

బాలయ్య ఇరవైరోజులు.. అని అంటూనే ఉన్నడు, కాంట్రాక్టర్ కారు తోట ముందు వచ్చి ఆగింది.

"ఈయన ఇప్పుడొచ్చినాడేంది.. ఇంకెవరి కైనా ఇచ్చేస్తనని భయమేమో! అట్ల మాట తప్పేవాన్ని కాదని ఇన్ని దినాలైనా తెలియ లేదా? " బాలయ్య నవ్వుతూ అన్నాడు.

అంతలో లోపలికి రానే వచ్చాడు గుత్తే దారు. "బాలయ్యా! కాయ తీస్కపోనా? బైట్నున్న రేటే ఇస్త" బాలయ్య ఇంకా చిన్న కారు రైతే అనుకుంటున్నాడు. కాలక్షేపా నికి తోట పెంచుతున్నాడని తెలిసినట్లు లేదు.

"ఇప్పుడేనా..? " ఆశ్చర్యంగా అన్నాడు బాలయ్య. అప్పుడంటే, గాలివాన వచ్చి కానీ మంచిగా ఉన్న తోటని పాడుచేసి కసిగందుల్ని అమ్మడమేందో అర్థంకాలేదు.

"నువ్వు ఊ అంటే అర్ధగంటలో లారీ తోలిస్త"

"రేపు ఫోన్ల చెప్త దొరా! మా వాన్ని కూడ అడిగి"

"నీఇష్టం. పక్క తోటవాళ్ళు రెడీగ ఉన్నరు. మరి అది ఖాయం చేసేస్తే నీకు నష్టం.. చూస్కో!" కంట్రాక్టర్ తోటని చూస్తూ, నిరాశని తెలియనియ్యకుండా

అన్నాడు.

ఆ చుట్టుపక్కల బాలయ్య తోటలోని కాయల్లా ఎక్కడా ఉండవు. ఒక్కోకాయ డబల్ రేటు వస్తుంది.

"ఫర్లేదు దొరా! రేపు ఫోన్ చేస్త. మీకు కావాలంటే తీసుకుందురు, నేను అమ్మితే"

సురేష్ చిరునవ్వుతో వింటున్నాడు సంభాషణంతా.

అమాయకంగా కనిపిస్తున్నాడు కానీ ఎటువంటి బ్లాక్‌మెయిల్‌కీ లొంగట్లేదు బాలయ్య.

రెండు మూడు సార్లు చెప్పి వెళ్ళిపోయాడు కంట్రాక్టర్.

అన్నింట్లోను గలగలా మాట్లాడుతూ వేలు పెట్టే రేణుక, కంట్రాక్టర్ ఉన్నంత సేపూ నోరు మెదపలేదు.

"బావగారూ! దొరదొర అంటూనే అతనికి ఛాన్సియ్యలేదే!" నవ్వాడు సురేష్.

"ఎవురంతటోళ్ళు వాళ్ళు. ఇంకా దొరేంది.." రేణుక నిష్ఠూరంగా అంది.

"ఏదోలేవే! వాని సాయం కూడ ఉంది కద మనకి" బాలయ్య తేల్చేశాడు.

"అదీ నిజమేనమ్మా! నిండు కుండ తొణకదు చూడు.. బావగారు అలాగ" సురేష్ మనస్ఫూర్తిగా అన్నాడు.

"బావగారూ! ఈ సాలు రేటు బాగా పెరుగుతుందనుకుంటా. అందుకనే వచ్చేసిండు గుత్తేదారు. అయినా ఈ కసిగందుల్ని తీస్కపోయి ఏం చేస్తారో.." సాలోచనగా అన్నాడు బాలయ్య.

"కోల్డ్ స్టోరేజ్‌లో పెట్టి బ్యాచీలుగా ముగ్గిన రంగు తెప్పిస్తారు. పసుప్పచ్చని పళ్ళు వచ్చేశాయనుకుని జనం కొనేస్తారు. ఇది ఎప్పట్నుంచో జరుగుతున్నదే కదా"

సురేష్ మాటలు అర్థం అవలేదు, బాలయ్యకీ రేణుకకీ.

"కావులో వేసి పండించడానికి, కాయ పక్వానికి రావద్దా? "

"అక్కర్లేదు. గ్యాస్ పంపుతారు, గదిలో కావలసిన ఉష్ణోగ్రత మెయిన్‌టైన్ చేస్తూ. అప్పుడు కృత్రిమంగా పండిపోతాయి. అంటే పండినట్లు కనిపిస్తాయి"

"అవును బావగారూ! గాలివానకి కాయ అంతా పోయినప్పుడు.. కొన్ని పళ్ళు కొన్నా అవ్విట్లో అస్సలు రుచే లేదు. కచ్చా కాయ తింటున్నట్లే ఉంది. పైగా లోన అంతా కుళ్ళిపోయింది. మన కాయలున్నప్పుడు కొనంగందా! మనవే పండబెడ్తం" బాలయ్య గుర్తుకు తెచ్చుకొని అన్నాడు.

"అదే.. కృత్రిమంగా పండించడం వల్ల అలా వస్తాయి"

"అదెట్లా? గ్యాసేంది అన్నయ్యా? "

రేణుక మాల కట్టి, కొంచెం తల్లో పెట్టుకుని, మిగిలింది కోడలికి ఆకులో కట్టి దాచింది.

> ## కొత్తగాలి...
>
> **అందరి తలల మీద**
> **రంగురంగుల మొక్కలు**
> **మొలిపించింది వర్షం!**
>
> – కె. లావణ్య,
> హైదరాబాద్

"పళ్ళు స్వతసిద్ధంగా ముగ్గేటప్పుడు ఇథిలిన్ అనే గ్యాస్‌ని విడుదల చేస్తాయి. అదే గ్యాస్‌ని పండే పళ్ళ కావులోకి పోనిస్తే, పళ్ళు త్వరగా ముగ్గడం కనుక్కున్నారు శాస్త్రవేత్తలు. పచ్చికాయలు కావు పెట్టి పంపుతే కూడా ముగ్గుతున్నాయి. రుచి రాలేదనుకోండి.

అప్పుడు వ్యాపారస్తులకి కొత్త ఐడియాలు తట్టాయి. విదేశాల్లో ఇథిలిన్ గ్యాస్ పంపి ముగ్గించడం మొదలుపెట్టారు. నవ

నవలాడుతూ, గట్టిగా, నోరూరించేలాంటి పళ్ళు.. కాలంకంటే ముందే అందరికీ దొరకడం మొదలెట్టాయి"

"అదా సంగతి.. అందుకనే చెట్టుకి కనిపించగానే కొనుక్కునేందుకు వస్తున్నారు" బాలయ్యకి అర్థం అవుతోంది.

"అది విదేశాల్లో. అక్కడ ఖర్చుకి వెనుకాడరు కనుక. కానీ మనకి ఇథిలిన్ గ్యాస్ చాలా ఖరీదు. అందుకని దానికి బదులు కార్బైడ్ కనుక్కున్నారు"

"మరి దానికి ఖర్చు తక్కువా? "

"రెండు ఉపయోగాలున్నాయి. ఒకటి ఖర్చు చాలా తక్కువ. రెండు గ్యాస్ అంటే సిలిండర్లు.. దాచడానికి ఎక్కువ చోటు.. వంటి గొడవలున్నాయి. కాల్షియం కార్బైడ్ అయితే పొడి కాని, ఉండలు కానీ దొరుకుతాయి. అవి కాయల మధ్యలో పడేస్తే, ఆ వేడికి కార్బైడ్, అసిటిలిన్ అనే గ్యాస్ని విడుదల చేస్తుంది. అది ఇథిలిన్ లాంటిదే.. కాయని త్వరగా.. పచ్చిదైనా సరే.. ముగ్గిస్తుంది.

చవగ్గా ఇష్టం వచ్చినప్పుడు కాయల్ని ముగ్గించగలుగుతున్నామని ఆనందంగా వ్యాపారస్తులు లాభాలు చేసుకుంటున్నారు" విచారంగా అన్నాడు సురేష్.

"అందులో బాధేంది అన్నయ్యా! మంచిదే కదా.."

"ఎంతో బాధమ్మా! సినిమాల్లో చిన్న పిల్లలచేత పెద్ద పెద్ద డైలాగులు చెప్పిస్తుంటే కలిగే బాధ. చూడలేని విధంగా చంటిపిల్లలచేత క్లబ్బు డాన్సులు, పోటీల పేరుతో చేయిస్తే కలిగే బాధ. దేన్నికైనా సహజంగా పరిపక్వత రావాలి.

అలా కృత్రిమంగా పండిన కసిగందులు, ఫ్రక్టోజ్ అనే తియ్యని పదార్థాన్ని తయారు చెయ్యలేవు పూర్తిగా. అది సహజసిద్ధంగా పండిన పండ్లలోనే ఉంటుంది. తేలిగ్గా జీర్ణమైపోతుంది. ఈ కచ్చిగాయలు తింటే అరగవు తొందరగా. అందుకే కడుపునొప్పి వస్తుంది. పైగా తొందరగా కుళ్ళిపోతాయి. కుళ్ళినట్లు పైకి అస్సలు తెలీదు"

బాలయ్య అవునన్నట్లు తలూపాడు.

"ఇవన్నీ ఒక ఎత్తు.. కాల్షియం కార్బైడ్ అసిటిలిన్ గ్యాస్ తయారు చేసేటప్పుడు, కొన్ని విషపదార్థాల్ని కూడా తయారుచేస్తుంది. వాటివల్ల ప్రజల ఆరోగ్యానికి ఎంతో ముప్పు. మీరు ఎప్పుడైనా చూశారో లేదో.. కొన్ని పళ్ళు తింటే వెంటనే గొంతులు పట్టేస్తాయి"

"నిజంగా అన్నయ్యా! లాభాలకోసం ప్రజల ప్రాణాలకి ముప్పొచ్చినా లెక్కలేదు గుత్తేదార్లకి. ఎంత మోసం? " రేణుక గుండె బాధతో మూలిగింది.

"నేను కాయ, తోటమీద అమ్మనే అమ్మను. రైతు బజారుకి తోలిస్తా. ఈ గోల తెలీక, ముంగల కొచ్చాడ్లే అని కంట్రాక్టర్కిస్తన్నా!"

బాలయ్య నిర్ణయం విని ఎంతో సంతోషించాడు సురేష్.



నాండీకి చాలా హ్యాపీగా ఉంది. అన్నయ్య వచ్చే వారం వస్తున్నాడు. తనకి ఇంజనీరింగ్ రెండో సంవత్సరంలో ఎయిటీ పర్సంట్ వచ్చింది.

అన్నింటికంటే ముఖ్యం.. సురేష్వర్మకి

## కొత్తగాలి...



**నేను ఒక్క మాటంటే**
**తానో పది మాటలంటుంది**
**నాకు లెఖ్ఖలు తెలియకనా..!**
**ఇంట్లో ప్రపంచయుద్ధం**
**బాగోదని..**

– పెన్మెత్స సూరిబాబు, హైదరాబాద్

నో అని చెప్పడం. తనకి ఇష్టమైన పనిచేస్తుంటే ఎంత ఆనందం వస్తుందో అప్పుడు బాగా తెలిసింది నాండీకి. కళ్ళు చిట్లించి, మొహం ముడుచుకుని వెళ్ళిపోతున్న వర్మ గారు గుర్తుకొచ్చినప్పుడల్లా ఎంతో హాయిగా ఉంటుంది.

హుషారుగా ఈల వేస్తూ జిమ్‌కి వెళ్లాడు. ఉబికివచ్చిన కండలు లేకపోయినా బలంగా ఉన్న శరీరాన్ని అద్దంలో చూసుకున్నాడు.

తనకి ఎంత బలం ఉందో పుట్టించిన బ్రహ్మ కూడా కనుక్కోలేడు.

అదే సమయంలో రాణీ హేమాంబరీ దేవికి చిరాగ్గా ఉంది. వారంరోజుల్లో నాండీకి పద్దెనిమిదేళ్ళు నిండుతాయి. తను అనుకున్నది ఏదీ సరిగ్గా అవట్లేదు.

ఎంత కష్టపడింది? ఎన్ని ఆశలు పెట్టుకుంది! ఎన్ని కోట్లుంటే ఏం లాభం, తన చిన్న కోరిక నెరవేర్చుకోలేకపోయాక?

ఎన్నెన్ని సినిమాలు.. టీనేజర్స్‌ని హీరోలుగా పెట్టి.. వాటిల్లో హీరోలు ఎలా ఉన్నారు? ఒక్కడికైనా నాండీ అందం ఉందా! సరిగ్గా 'పెళ్ళి' అని పలకలేనివాడి చేత ప్రేమపెళ్ళి కథలు. ఒక్కడి కంఠంలోనూ గాంభీర్యం లేదు. వత్తులు పలకవు.

కంఠం సరే.. కండలు మాత్రం! ఒళ్ళు విరుచుకుని నడవడం తప్ప ఏముంది..? నాండీని చూసి ప్రతి నిర్మాతా పెదవి విరిచేవాడే. అసలు ఒక స్క్రీన్ టెస్ట్, ఒక డాన్స్, ఒక ఫైట్.. చూసి కదా చెప్పాలి.. అంతా అన్యాయం. తన చేతుల్లో లేదు కానీ, ఆ హీరోగారి మనవడిచేత ఒకేసారి తొమ్మిది సినిమాలు చేయించినట్లు.. పద్దెనిమిది సినిమాలు మొదలుపెట్టించేది, పద్దెనిమిదో ఏట.

ఇంత ఐశ్వర్యం ఉండి ఏం లాభం..?

నేలని కొడ్తూ జిమ్‌కి నడిచింది రాణీ.

ఈల వేస్తూ వెయిట్స్ ఎత్తుతున్న నాండీ కనిపించాడు. పెద్ద ఘనకార్యం

## చతుర ప్రవేశిక

### అక్టోబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. శ్రీనాథ్, విక్కీల బాస్?
జ.
2. బిందూ ఏ పత్రికలో పనిచేసింది?
జ.
3. సురేశ్, శాంతలకు కూతుళ్లెందరు?
జ.
4. రాణీ ఈశ్వరీ దేవి అసలుపేరు?
జ.
5. నాండీ తండ్రిపేరు?
జ.
6. సునీత భర్త పేరు?
జ.
7. 'నాలుకెట్టు' నవలా రచయిత?
జ.
8. పారడైజ్‌లాస్ట్ కృతి కర్త?
జ.
9. కల్యాణ రామయ్యరు ప్రదర్శించిన నాటకం?
జ.
10. నేరాలు అధికంగా జరిగే దేశం?

---

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (  )

చిరునామా: ------------------

--------------------------

--------------------------

పిన్‌కోడ్:  ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 18

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

# రికార్డుల వేట!

చతుర ప్రపంచం

అమెరికాలో ఓహియో రాష్ట్రంలో టాల్‌మాడ్జ్ ఊరికి చెందిన లెస్‌గ్రాబర్ జూన్ 24, 2000న మేకుల పడక మీద పడుకున్నాడు. తనపైన 756 కిలోల బరువు గల మరో మేకుల దుప్పటిని పది క్షణాలు కప్పుకుని ఓ అపూర్వమైన ఫీట్ ప్రదర్శించాడు. అతని మీద ఆ బరువుని క్రేన్ సహాయంతో పెట్టారు. ఈ మొత్తం కార్యక్రమం స్థానిక, జాతీయ టీవీ ఛానెళ్లలో ప్రసారమైంది.

★ ఇంగ్లాండ్‌కు చెందిన జాన్ ఇవాన్ లండన్ స్టూడియోస్‌లో మే 24, 1999న ఓ ఫీట్ చేసాడు. నూటా అరవై కిలోల బరువు



గల మినీకార్‌ను తన తల మీద ఉంచుకుని ముప్ఫై మూడు సెకండ్లు మోసాడు.

★ జర్మనీకి చెందిన ఉమ్ఫ్‌గేంగ్ క్లోవ్ మేన్ సముద్ర గర్భంలో సీసంతో చేసిన సైకిల్‌ను యాభైరెండు నిమిషాల్లో 4.1 కిలోమీటర్ల దూరం తొక్కి రికార్డు స్థాపించాడు.

★ రష్యాకు చెందిన ఒమర్ గిహెఫ్లైవ్ దంతాలతో 1100 టన్నుల ఆయిల్ టాంకర్‌ను 36.3 అడుగుల దూరం అవలీలగా లాగాడు.

★ త్సాంగ్ అనే చైనా యువకుడు రెండు చేతులతో ఒకేసారి 1100 కిలోల బరువు గల రెండు రోడ్డు ఇంజన్లను ఆరడుగుల దూరం లాగాడు. ఇతను శాకాహారి కావడం విశేషం.

ఈ అరుదైన రికార్డులను స్థాపించిన వీరందరి సగటు వయసు ముప్ఫై ఎనిమిదేళ్లే. ఇలాంటి రికార్డులు సాధించాలంటే జీవితపు పూర్వార్థంలోనే సాధ్యమవుతుందేమో!

---

చేస్తున్నట్లు ఈల ఒకటి అనుకుంది.

నాండీ బాడీ బాగా ఉందే.. కండలేకదా లేంది..

అప్పుడే వస్తున్న డయటీషియన్‌ని పక్కకి పిలిచింది. నాండీ వినకుండా నెమ్మదిగా అడిగింది.

"మజిల్స్, సిక్స్‌ప్యాక్ రావడానికి ఇంకేం దారి లేదా? కొంతమంది హీరోలు, ఒక సినిమాలో విపరీతంగా కండలు పెంచీ, ఒక సినిమాలో చిక్కి శల్యమయి కనిపిస్తారు. అదెలా..? "

రాణీ ప్రశ్నకి అటూ ఇటూ చూశాడు డిట్టీ. అది నాండీ పెట్టిన ముద్దుపేరు. ఏదైనా తినడానికి కూడా డిట్టీ కొట్టడం అని అంటుంటాడు.

డిట్టీకి అనంత్‌ని చూస్తే భయం. అతను కనిపించినప్పుడల్లా తినే సేట్లు చూస్తాడు. స్టెరాయిడ్స్ అవీ వాడితే ఊరుకోనని వార్నింగ్ ఇచ్చాడు. మమ్మీకి చెప్తే మనిషే గల్లంతని భయపెట్టాడు. మరేం ఫరవాలేదు.. ఇప్పుడు దేశంలో లేడుకదా?

"వాళ్ళు స్టెరాయిడ్స్ తీసుకుంటారు మేడం. అవి తీసుకుంటే కండలు పెరుగుతాయి. మానేస్తే తగ్గుతాయి" గుసగుసగా అన్నాడు.

"మరి అవెందుకు ఇవ్వట్లేదు? " కోపంగా అడిగింది రాణీ.

"అంటే.. ఒక్కోసారి సైడ్ ఎఫెక్ట్స్ ఉంటాయని అంటారు. తొందరలోనే ముసలిగా అయిపోతారనీ, కాన్సర్ వచ్చే ఛాన్సెస్ ఉంటాయనీ.."

"అవి వచ్చే పెర్సెంటేజ్ ఎంత? "

"ఎంత మేమ్.. టెన్ పెర్సంట్ ఉండొచ్చు"

"అంటే వందమంది తీసుకుంటే పది మందికి వచ్చే అవకాశం ఉందన్నమాట" రాణీ ఆలోచిస్తూ అంది.

అవునన్నట్లు తలూపాడు డిట్టీ. మొహంలో సంతోషం కొట్టొచ్చినట్లు కనిపి

స్తోంది. ఒక్కో ట్రీట్‌మెంట్ సైకిల్‌కీ యాభైవేల నించి లక్ష వరకూ గుంజచ్చు.

అన్ని ప్రొఫెషన్స్‌లోనూ మంచీ చెడు ఉన్నట్లే న్యూట్రిషన్‌లో కూడా ఉంది. ప్రజల ఉత్సాహాన్నీ, అమాయకత్వాన్నీ, డబ్బుకింద మార్చుకునే విలన్లు కోటికొక్క రైనా అన్నిచోట్లా ఉంటారు.

ఇప్పుడు, ఇక్కడ.. అలాంటి విలనే ఈ డిట్టీ.

"అయితే నెక్స్ట్ వీక్ స్టార్ట్ చెయ్యండి"

"ఓకే మేమ్! యాజ్ యు విష్"

డాక్టర్ల పర్యవేక్షణలో జరగాల్సిన ట్రీట్‌మెంట్‌ను చెయ్యడానికి సిద్ధపడ్డాడు డిట్టీ.

ఇదేమీ తెలియని నాండీ, స్విమ్మింగ్ పూల్‌లోకి దూకాడు ఈల వేసుకుంటూ.

★ ★ ★

అనంత్ వచ్చి నెల రోజులయింది. మర్నాడు అత్తాపూర్‌లో ఉన్న ఇంట్లోకి వెళ్ళడానికి సన్నాహాలు చేస్తున్నాడు.

'వేరే ఎందుకు.. ఇక్కడే ఉండండి' అని రాణీ ఒక్కమాట అనలేదు. బిందుకిప్పుడు ఆరోనెల. గ్రాండ్ ఛైల్డ్ వస్తోందన్న సంతోషం కూడా కనిపించలేదు. బిందుని చూడగానే ఒకసారి కళ్ళెగరేసింది, అంతే.

ఆరోజు తాజ్‌కృష్ణాలో అందర్నీ లంచ్‌కి పిలిచాడు శ్రీనాథ్.

అనంత్, బిందు ప్రాజెక్ట్ పూర్తిచేసి వచ్చినందుకు.. అటువంటివి ఇంకో రెండు వచ్చినందుకు.

తాజ్‌కృష్ణా అంటే అనంత్‌కి ప్రత్యేక అభిమానం.

పార్టీ బాగా జరిగింది. ముఖ్యంగా రాణీ చాలా హేపీగా ఉంది. అందరితో గొప్పా, బీదా అన్న తేడాలేకుండా కలిసిపోయింది. వచ్చినవాళ్ళు ఏపీయస్ ఉద్యోగులు, వారి కుటుంబాలు మాత్రమే.

అందరూ సంతోషించారు.. అనంత్ లాగ, నాండీలాగా రాణీ కూడా సరదాగా ఉందని. పార్టీ అయిపోయే సమయానికి అనుకోకుండా రాజావారూ వచ్చేశారు.

అసలు సంగతేంటంటే.. నాండీ ఒక నెలలోనే చాలా మారాడు. ఛాతీ వెడల్పయింది. బైసెప్స్, ట్రైసెప్స్ కండలు కూడా బాగా కనిపిస్తున్నాయి. హార్మోన్స్ మొదలుపెట్టి నెల కూడా కాలేదు.

నాండీకే ఆశ్చర్యంగా ఉంది. బీకాంప్లెక్స్ ఇంజక్షన్లకి ఇంత ఎఫెక్టా అని.

అనంత్, బిందు కూడా మార్పు గమనించారు. పద్దెనిమిది నిండాయి కదా అందుకనే లావవుతున్నాడని అనుకున్నాడు అనంత్. తాతగారికి అప్పటి కాలం కనుక పాతికేళ్ళ తర్వాత వచ్చింది ఒళ్ళు.. ఇప్పుడు స్పీడ్ కాలంకదా!

పార్టీ అయ్యాక, ఇంటికొచ్చి అందరూ విశ్రాంతి తీసుకున్నాక, టీకి స్విమ్మింగ్ పూల్ దగ్గిర కలుద్దామన్నారు రాజావారు.

అనంత్ స్విమ్మింగ్‌పూల్ చుట్టూ రౌండ్ వేస్తున్నాడు, బిందు చెయ్యి పట్టుకుని.

"అంత భారంగా లేదు అనంత్.. వద్దు" అంటే కూడా వినట్లేదు. బిందు సిగ్గుపడుతూ తలదించి నడుస్తోంది. అంతలో గడ్డిలో ఒకమందు సీసా కనిపించింది. చిన్న ఇంజక్షన్ బాటిల్.

శుభ్రంగా ఉన్న నేలమీద, చెత్త బాటిల్. చెత్తబుట్టలో విసిరేద్దామని వంగోబోయింది.

"ఏయ్! ఎందుకు వంగుతున్నావ్?" కోప్పడి బిందు చూపించిన సీసాని తీశాడు అనంత్.

కుతూహలం కొద్దీ, దానిమీద రాసున్న పేర్లు చదివాడు. కాంబినేషన్ ఆఫ్ హార్మోన్స్. కొద్దిగా బీకాంప్లెక్స్ కూడా ఉంది. అదే పెద్దగా రాసుంది. అనంత్ కళ్ళు ఎర్ర బడ్డాయి.

ఇదెందుకొచ్చింది ఇక్కడికి?

అప్పుడే వస్తున్న నాండి చూసి అరి

చాడు, "అది డిట్టీ నాకు ఇస్తున్నాడన్నా! బీకాంప్లెక్స్. ఇక్కడ పడేశాడా? గార్బేజ్ వరకూ వెళ్ళడానికి బద్ధకం."

"ఎప్పట్నుంచీ..?" కోపంతో ఎర్రబడ్డ అనంత్ మొహం చూసి జంకాడు నాండీ.

"త్రీ వీక్స్ నుంచీ.. అప్పట్నుంచే నేను వెయిట్ బాగా.."

"పేర్లు చూడకుండా ఏ మెడిసిన్ తీసుకోవద్దని చెప్పా కదా! చూడు, హార్మోన్స్ ఇస్తున్నాడు. అవసరమా అవి?"

నాండీ మొహం తెల్లగా పాలిపోయింది.

"నిజంగా నాకు తెలీదన్నా.."

అప్పుడే రాణీ, రాజావారు వచ్చారు. నౌకర్లు, రకరకాల పళ్ళ ముక్కలు కోసి,

కొత్తగాలి... 

**ఐకమత్యానికి**
**అద్భుతమైన నిదర్శనం**
**ఇంద్రధనుస్సు**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

రంగురంగులుగా అలంకరించి బల్లమీద సర్దారు. ఒకపాట్‌లో టీ.. ట్రేలో కప్పులు.

కోపాన్ని నిగ్రహించుకుంటూ వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు అనంత్. బిందు, ఏం గొడవవుతుందో అని భయపడ్తూ, అనంత్ పక్కనున్న కుర్చీలో కూర్చుంది.

రాజా అడుగుతున్న ప్రశ్నలకి ముక్తసరిగా సమాధానం చెప్తున్నాడు అనంత్. అందరూ టీ తాగడం అయింది.

"ఇప్పుడే వస్తా.." అని బిందు బాత్రూం వేపుకి వెళ్ళింది. అక్కడ, లోపల కుర్చీలు కూడా ఉన్నాయి. అక్కడ కూర్చుంది గుండె దడదడలాడుతుండగా.

నాండీ తల్లి కేసి నిర్వికారంగా చూస్తూ పండుముక్క నోట్లో పెట్టుకున్నాడు.

"ఇదేంటి.. ఈ పళ్ళు ఇంత టేస్ట్‌లెస్‌గా ఉన్నాయి. రంగు తప్ప ఒక్కదానికీ నాచురల్ టేస్ట్ లేదు." రాజా విసుక్కున్నారు.

మామిడి, బొప్పాయి, కివి, అరటి.. అన్ని ముక్కలూ అదే తంతు.

"అంతా ఆర్టిఫిషియల్ రైపెనింగ్ డేడీ. కాయలు ముదిరే వరకూ ఉంచకుండా కచ్చాగా కోసి, ముగ్గేస్తే అలాగే ఉంటాయి. తమ్ముడి బాడీలాగ" అనంత్‌కి కారణం దొరికింది, తండ్రికి ఇంట్లో జరుగుతున్న విషయాలు చెప్పడానికి.

రాణీ భయంగా చూసింది. పెదవులు, చేతులు వణుకుతున్నాయి. వీడికి ఎలా తెలిసింది? ఇప్పుడు రాజాకి తెలిస్తే ఏమయినా ఉందా! గన్ తెచ్చినా తెస్తారు. మొత్తం శరీరమంతా వణకడం మొదలుపెట్టింది.

"ఏమంటున్నావు అనంత్.. తమ్ముడు.. ఏంటి నాండీ! వాట్ ఈజ్ హాపెనింగ్?"

నాండీలో అదే నిర్లిప్తత.

"మీకు తెల్సు కదా నాన్నగారూ! అమ్మ కోరిక.."

"అదే నాండీని హీరో చెయ్యాలనీ.. నన్ను కూడా పిక్చర్ తియ్యమంటూ ఉంటుంది.."

"మనం తీసినా ఇంత మాడ్‌నెస్ ఉండేది కాదేమో! మనం లైట్‌గా తీసుకున్నాం.." నాండీ చిన్నప్పట్నుంచీ జరుగుతున్నదంతా నెమ్మదిగా రాజాకి అనంత్ చెప్పాడు, తల్లిని కించపరచకుండా.. అది ఒక మానసిక దౌర్బల్యంలాగ చెప్తూ.

"తమ్ముడు ఎన్నిసార్లో రాత్రిళ్ళు నిద్ర లేకుండా ఏడవడం తెలుసు నాన్నగారూ! ఏమీ చెయ్యలేకపోయాం. మీరు చూస్తే ఎప్పుడూ టూర్లు. అమ్మని ఎదిరించే సంస్కారం మాకు తాతగారు నేర్పలేదు.

అక్కడికీ నేను ఒకట్రెండు సార్లు చెప్పి చూశాను. లాభం లేకపోయింది."

రాణీ తల వంచుకుంది. కళ్ళలోంచి నీళ్ళు జలజలా రాలాయి.

"అసలు నాండీకి ఇష్టమో లేదో కనుక్కో లేదు. తను చెప్పింది చెయ్యాలనే పంతం అంతే. అవన్నీ ఒక ఎత్తు.. నాండీకి అల వాటయిపోయి, అమ్మని తృప్తి పరుస్తూనే తనకి కావలసింది సాధించుకున్నాడు.

కానీ ఈ మధ్యన నాండీ మూడు వారా లలోనే బాగా లావయ్యాడు. వెయిట్ బాగా పెరిగాడు. టీన్స్ అయిపోతున్నాయి కదా.. అందుకేనేమో అనుకున్నాను.. ఇప్పుడే తెలిసింది.. అమ్మ హార్మోన్ ట్రీట్ మెంట్ ఇప్పిస్తోందని"

"వ్వాట్..? " రాజా ఎంత గట్టిగా అరి చారంటే బాత్రూం దగ్గరున్న బిందు పరిగె త్తుకుని వచ్చింది, తను పరుగెత్తకూడదన్న విషయం మర్చిపోయి.

"ఆర్ యు మాడ్.. హార్మోన్స్ అనవస రంగా ఇస్తే బాడీ ధర్మం మారిపోతుందని తెలుసా! ఇదంతా నాకు ఇదివరకే ఎందుకు చెప్పలేదు? " నాండీని, అనంత్‌నీ కూడా ఛెడామడా తిట్టేశాడాయన.

ఎప్పుడూ రాజా వారికి అంత కోపం రావడం చూడని రాణీ ఏడుస్తూ కాళ్ళమీద పడిపోయింది.

రాణీని లేపి కుర్చీలో కూర్చోపెట్టి అన్నాడు అనంత్, "అమ్మా! ప్రకృతిని తన పనిని చేసుకోనివ్వాలి మనం. పద్ధెనిమిదే ళ్ళకి పాతికేళ్ళ బాడీ ఉండదు. అందులో శరీరతత్వం, వంశ పారంపర్యం.. ఎన్నో కారణాలు ఉంటాయి. మనం అక్కర్లేనివీ, కావల్సినవీ గుప్పించి క్విక్ క్విక్ అను కుంటే మాయదారి మందు పెట్టి తొందర పడి పండించిన పండులాగే ఉంటుంది.

ఇప్పటికైనా తమ్ముడ్ని వాడిష్టం వచ్చి నట్లు ఉండడానికి ఒప్పుకోండి. లేకపోతే నేను గెస్ చేసినట్లు, వాడు పద్దెనిమిది నిండే వరకూ చూస్తున్నాడు. రేపోమాపో వేరే ఇంటికి మారిపోతాడు"

నాండీ మొహంలో ఏ భావమూ లేదు. అలాగే శిలలా కూర్చున్నాడు.

రాణీ మొహంలో పశ్చాత్తాపం. చిన్న కొడుకు దగ్గరికి వెళ్ళి అంది, "సారీ నాన్నా! ఇంకెప్పుడూ నిన్ను విసిగించను. ఇల్లు వదిలీ వెళ్ళద్దు. నిన్ను వదిలి ఉండలేను"

★ ★ ★

ఉపసంహారం: అనంత్, బిందూ.. వాళ్ళ ఇంటికి వెళ్ళడానికి కారు ఎక్కబోతున్నారు.

అత్తాపూర్ వెళ్ళి రెండు నెలలయింది.

బిందు చేతులు పట్టుకుని అంది రాణీ, "ఈ అమ్మపై కోపం వద్దమ్మా! కొంచెం సమయమివ్వండి. పాప పుట్టాక నేనే స్వయంగా వచ్చి ఇక్కడికి తీసుకొచ్చేస్తా"

బిందుమొహం ఆనందంతో వెలిగింది.

మూడునెలల తర్వాత.. అనంత్ కొడుకు రాజా చిన్నఈశ్వర్‌వర్మ బారసాల.

రాజావారి ప్యాలెస్ అంతా దీపాలతో అలంకరించారు. నాండీ మెరుపులా పరు గెడుతూ అందర్నీ కూర్చో పెడుతున్నాడు.

రాణీ గేటు దగ్గర నిలబడి వస్తున్న వాళ్ళని ఆదరంగా లోపలికి ఆహ్వాని స్తోంది. అవధానిగారూ, మాణిక్యం మన వడ్ని చూసి మురిసి పోతున్నారు.

ఇంతలో శ్రీనాథ్ ఇన్నోవా వ్యాన్ వచ్చి ఆగింది. అందరూ దిగాక పళ్ళబుట్టలు పాలేరు చేత పట్టించుకుని లోపలికి వచ్చాడు బాలయ్య. పట్టు పైజామా, లాల్చీ వేసుకుని, నుదుట నామంతో.

"రాజావారూ! ఇవన్నీ మన తోటలోవే నండీ, నేనే స్వయంగా ముగ్గించాను. ఎంత తియ్యగా ఉంటాయో చూడండి" అ న్నాడు.

బాలయ్య అమాయక మాటలకి, రాజా, రాణీలతో సహా అందరూ నవ్వేశారు. Ⓒ

# మలయాళ సాహితీ మణిదీపం

ఎం.టి. వాసుదేవన్ నాయర్

**స్వాతంత్ర్యానంతరం కేరళ సమాజం ఎదుర్కొన్న క్లిష్ట పరిస్థితులకు ప్రతిరూపాలుగాఎం.టి. వాసుదేవన్ నాయర్ తన కథలు, నవలలు, సినిమా ఇతివృత్తాలను అనితర సాధ్యమైన శిల్ప వైదుష్యంతో తీర్చిదిద్దాడు. అలాగే సినీ దర్శకత్వాన్ని చేపట్టి ప్రేక్షకుల నుంచి ఆదరాభిమానాలు పొందాడు. 1975-94 మధ్య ఆయన వెలువరించిన రచనలు భారతీయ భాషల్లో సర్వోత్కృష్టమైనవిగా పరిగణన పొందాయి. 'ఎం.టి' గా సాహితీలోకానికి ఆరాధ్యుడైన ఆయన, జీవితానికి, సాహిత్యానికి మధ్య సన్నిహిత సంబంధం ఉండాలంటాడు. అసమాన ప్రతిభాపాటవాలు గల అగ్రశ్రేణి మలయాళ సాహితీవేత్త అయిన నాయర్‌కు 1995లో జ్ఞానపీఠ పురస్కారం లభించింది.**

**వా**సుదేవన్ నాయర్ 1933 జూలై 15న కేరళలోని పాలక్కాడ్ జిల్లా, పొన్నాని తాలుకా, కడల్లూర్ గ్రామంలో జన్మించారు. తండ్రి నారాయణ నాయర్ పేదరైతు. బస్సు సౌకర్యంగాని, రైలుమార్గంగాని లేని కుగ్రామం వారిది. చిన్ననాటనే వాసుదేవన్‌నాయర్ ప్రతిభను తండ్రి గుర్తించాడు. కుమారుణ్ని పొలం పనుల్లో పెట్టకుండా, ఎన్ని కష్టాలొచ్చినా చదువు చెప్పించాలని ఆయన నిర్ణయించుకున్నాడు. ఆ రోజుల్లో ఈ నిర్ణయం సంచలనం సృష్టించింది. తండ్రి అభీష్టం మేరకు వాసుదేవన్ మైళ్లకొద్దీ దూరం నడిచివెళ్ళి శ్రద్ధతో చదువుకున్నాడు. అక్కిథమ్ అనే కవినుంచి వాసుదేవన్‌కు సాహితీపరంగా విశేష ప్రోత్సాహం లభించింది. కుమనశూర్‌లో హైస్కూలు విద్య పూర్తిచేసి, పాలక్కాడ్‌లోని విక్టోరియా కళాశాలలో చేరి ఉన్నతవిద్య సాగించాడు. ఆ దశలోనే రచయితగా ఖ్యాతిగాంచాడు. బీఎస్సీ డిగ్రీ పొందిన తరువాత ఉపాధ్యాయవృత్తిని చేపట్టాడు. 1956లో 'మాతృభూమి' పత్రిక సంపాదకవర్గంలో చేరారు. తర్వాత 'మాతృభూమి' వారపత్రికకు సంపాదక బాధ్యతలు స్వీకరించాడు. ఆ పత్రికకు వాసుదేవనాయర్ ద్వారా అసామాన్య ప్రచారం లభించింది.

ఎం.టి. చాలా చిన్నతనంలోనే సాహిత్యంపట్ల ఆకర్షితుడయ్యాడు. అన్నలు తెచ్చిన కవితలు, కథలు విస్తారంగా చదివేవాడు. వల్లత్తోల్, ఆశాన్, ఉళ్లూర్, శంకరకురుప్, బాలామణి అమ్మ ప్రభృతుల రచనలు కంఠస్థం చేసేవారు. విద్యార్థిగా వున్నప్పుడు 'పెద్దయ్యాక ఏమవ్వాలని అనుకుంటున్నావు?' అని అడిగితే తడుముకోకుండా రచయితనవుతానని బదులిచ్చేవారు. వాస్తవానికి బాల్యంలోనే ఆయన రచనావ్యాసంగాన్ని ప్రారంభించారు. కథలు, కవితలు, వ్యాసాలు, ఏకాంకి

కలు రాసి పత్రికలకు పంపేవారు. విద్యార్థిగా వున్నప్పుడు 'మాతృభూమి' పత్రిక నిర్వహించిన అంతర్జాతీయ కథల పోటీలో ఎం.టి. రచించిన 'వళరత్తు మృగడగళ్' కథకు పురస్కారం లభించింది. మలయాళ సాహితీరంగంలో నిశితమైన నూతన స్వరం వినిపించింది. 'రక్తమ్ పూరణట మణాతరికళ్' కథాసంపుటి ఆయన విద్యార్థిగా ఉన్నప్పుడు 1952లో వెలువరించిన తొలిగ్రంథం. స్పష్టమైన అవగాహనతో ఆయన రచనలు సాగించారు. ప్రధానంగా మానవుడి స్థితిగతుల్ని ఆయన వస్తువులుగా స్వీకరించారు. చాలా కథలకు తన గ్రామాన్ని కథాక్షేత్రంగా చేసుకున్నారు. మనిషి బలహీనతల్ని సానుభూతితో అర్థం చేసుకోవడం ఆయనలోని ప్రత్యేకత. శక్తిమంతమైన కథాంశాలు ఎంచుకోవడంతో పాటు ఆయన తన కాలానికి అవసరమైన భావజాలంతో తనదైన శైలితో, సంవిధానంతో కథలు వెలయించారు. బెయిలుమ్ నిలయుమ్, వేదనాయుదె పూక్కళ్, ఒలవుమ్ తీరవుమ్, బంధనమ్, పతనమ్, కలివీదు, వరిక్కుషి, తిరంజెదుత్ కథాకల, అభయమ్ తెణిట్ విందుమ్, వానప్రస్థమ్, నీలతామర, నింతె ఓర్మయుక్కు మొదలైన 18 కథా సంపుటాలు మలయాళ కథా సాహిత్యాన్ని సంపద్విలసితం చేశాయి.

ఎం.టి. తొలి నవల 'నాలుకెట్టు' కేరళ సమాజంలో మాతృస్వామ్య వ్యవస్థకు అద్దం పడుతుంది. ఆ వ్యవస్థ ఎలా పతనమవుతోందో ప్రతిభాన్వితంగా చిత్రించారు. కరువు కాటకాలు, అనావృష్టి, కలరా వంటి వ్యాధులు, తుపాను బీభత్సం వంటివి ప్రజల్ని ఎలా కష్టాలపాలు చేశాయో చూపారు. అంతేకాదు మారుతున్న పరిస్థితుల్లో పగ, ప్రతీకారం, ద్వేషాలు వంటి అవాంఛనీయ ధోరణులు మధ్యతరగతి యువతను ఎలా కలవరపరుస్తున్నాయో ఆయా పాత్రల ద్వారా నిరూపించారు. పూర్వీకుల ఇల్లు దీనికి కేంద్రంగా వుంటుంది.

రెండో నవల 'అసురవిత్తు' దీనికి తరువాయి భాగం అని చెప్పవచ్చు. మొదటి నవలలో అప్పుణ్ణి పాత్ర పూర్వీకులు కట్టించిన ఇంటిని కూల్చే దిశగా వ్యవహరిస్తే, రెండో నవలలో గోవిందు కుట్టి అనేపాత్ర తండ్రి, కుటుంబ సభ్యులను ఒక్కొక్కరినీ విడదీసి కుటుంబ వ్యవస్థనే కకావికలం చేస్తుంది.

'మంజు' నవలలో ఎం.టి. సమాజంలోని కొత్త కోణాలను ఆవిష్కరిస్తూ, నూతన ఆలోచనా ధారకు స్వీకారం చుట్టారు. 'కాలమ్' నవల మనుషుల్లోని ద్వంద్వ ప్రవృత్తికీ, వికృతవైఖరికీ అద్దం పడుతుంది. ఆదర్శచ్యుతిని రచయిత దుయ్యబట్టారు. 'రంటాభూషమ్' నవలకు మహాభారతం ఆధారం. దీనిలో నాయకుడు భీముడు. సకల సద్గుణశోభితుడైన భీమునికి తగిన ప్రాధాన్యం చేకూరలేదని రచయిత భావించారు. విలాపయాత్ర, వారణాసి, అరబీ పొన్ను వంటి ఇతర నవలలు సహితం జనాదరణ పొందాయి. ఆయన రచించిన నవలలు ఎనిమిది. 'గోపురనటయిల్' అనే నాటకం; 'మనుష్యార్ నిఫాలుకమ్, అలకుట్ట అల్ తనియె అనే రెండు యాత్రా చరిత్రలు, ఇంకా మూడు విమర్శన గ్రంథాలు, రెండు వ్యాస సంపుటాలు, రెండు బాలసాహిత్య గ్రంథాలు వెలువరించారు.

మలయాళ చలనచిత్ర రంగంలో కూడా ఆయన ఉన్నతస్థానం అలంకరించారు. స్క్రీన్‌ప్లే రచయితగా, దర్శకుడిగా విశేష ఖ్యాతిగాంచారు. నిర్మాల్యమ్, ఒరు వడక్కన్ వీరగాథ వంటి చిత్రాలు ఆయనకు జాతీయ, అంతర్జాతీయ మన్ననలు చేకూర్చాయి. సదయమ్, సుకృతమ్, పరిణయమ్, ఆరణ్యకమ్, ఒరు చిరుపుంజిరి వంటి 31 చిత్రాలకు స్క్రీన్‌ప్లే రాశారు. మోహిని ఆట్టం, కడవు, బంధనమ్ వంటి ఎనిమిది చిత్రాలను, డాక్యుమెంటరీలను అందించారు.




ఆయన సతీమణి కరీమండలమ్ సరస్వతి సుప్రసిద్ధ నృత్య కళాకారిణి.

'నా రంగానికీ, నా కాలానికీ నూతన బీజాలు అవసరమని నా అంతరాత్మ ప్రబోధిస్తోంది' అని నవ్య ప్రగతిని ఆయన ఆకాంక్షిస్తారు.

ఆయన కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం, వలయార్ పురస్కారం అందుకున్నారు. ఆయన చలన చిత్రాలకు రాష్ట్రపతి పురస్కారం, జాతీయ పురస్కారం లభించాయి.

మలయాళ సాహిత్యాన్ని, చలనచిత్ర రంగాన్ని సుసంపన్నం చేస్తున్న ఉత్తమ కృషీవలుడు ఎం.టి. వాసుదేవన్ నాయర్.

– గోవిందరాజు రామకృష్ణారావు

# హలో.. అమెరికా 7

# నేరాల్లోనూ అగ్రగామే!

**గణాంకాలను బట్టి చూస్తే చాలా అంశాల్లో అమెరికానే ప్రపంచంలో మొదటి స్థానాన్ని పొందుతుంది. తలసరి ఆదాయం, ఖర్చు, మాంసం వాడకం.. ఇలా నేరాల విషయంలో కూడా అమెరికానే నంబర్ ఒన్ దేశంగా నిలుస్తోంది! లండన్ కింగ్స్ కాలేజీలోని 'ఇంటర్నేషనల్ సెంటర్ ఫర్ ప్రిజన్ స్టడీస్' విభాగం చేసిన సర్వే ద్వారా ఈ సంగతి వెల్లడయింది.**

అమెరికన్ జైళ్లల్లో 20.3 లక్షల మంది శిక్షని అనుభవిస్తున్నారు! ఇది ప్రపంచంలోని మిగిలిన అన్ని దేశాలకన్నా అధికం. అమెరికాకన్నా నాలుగు రెట్లు ఎక్కువ జనాభాగల చైనాలోని జైళ్లల్లో 10.6 లక్షల మందే శిక్షని అనుభవిస్తున్నారు. ఈ పోలికవల్ల అమెరికన్లలో గల నేరప్రవృత్తిని అర్థం చేసుకోవచ్చు.

ముఖ్యంగా నగరప్రాంతాల్లోని పేదలవాడల్లో నివసించేవారిలో నేరస్థులు అధికంగా ఉన్నారు. హత్యానేరాల్లో అరెస్టయినవారిలో ఆ ప్రాంతాలకి సంబంధించినవారే అధికం. అమెరికన్ నేర పరిశోధక సంస్థ ఫెడరల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్, ఏటా నేరాలకు సంబంధించిన గణాంకాలని ప్రచురిస్తూంటుంది. దాని ప్రకారం అమెరికా మొత్తానికి డల్లాస్‌లో అత్యధికంగా నేరాలు జరుగుతూంటాయి. 1960 నుంచి అమెరికాలో నేరాల సంఖ్య ఏటా పెరుగుతూ వస్తోంది. 1993లో అమెరికాలో 'త్రీ స్ట్రయిక్స్ లా' అనే కొత్త చట్టం వచ్చాక నేరాల సంఖ్య గణనీయంగా తగ్గింది. ఈ చట్టం ప్రకారం రెండుసార్లు జైలుశిక్ష పడ్డవారికి, మూడోసారి తప్పనిసరిగా యావజ్జీవ కారాగార శిక్షే పడాలి. అమెరికన్ క్రైం రేటు ప్రతి లక్షమందికి సగటున 3,977 నేరాలు.

అమెరికాలో నేరాలకి అత్యధికంగా పాల్పడేది నల్లజాతివారు, మెక్సికన్లు. మొదటినుంచీ వర్ణవివక్షతో అణగదొక్కబడ్డ నల్లజాతివారిలో బీదవారే అధికం. వారంతా పేదలవాడల్లో నివసిస్తారు. వారిలో చాలామంది ఉన్నత విద్యనభ్యసించరు, పనిచేయరు. ప్రభుత్వం ఇచ్చే నిరుద్యోగ భృతితో జీవించేవారే అధికం. డ్రగ్స్‌కు బానిసలైనవారిలో వీరి సంఖ్యే అధికం. మగ్గింగ్‌లాంటి నేరాలను చేసేది అధికంగా నల్లజాతివారే. అమెరికా రాజధాని వాషింగ్టన్ డీసీలో నల్లజాతి వాడలోకి ఎవరైనా ఒంటరిగా వెళ్తే ఇంతే సంగతులు. ఇకవారి మృతదేహమే లభ్యమవుతుంది. ఇలాంటివాడలు నల్లజాతివారు అధికంగా ఉండే ఇల్లినాయిస్, న్యూజెర్సీ, టెక్సాస్, లూజియానా, ఆర్కన్సాస్ మొదలైన రాష్ట్రాలలోని పెద్ద పట్టణాల్లో ఉన్నాయి. స్థానికులే అక్కడికి వెళ్ళడానికి భయపడతారంటే వారిలోని నేర, హింసా ప్రవృత్తులని




గేట్లని నిర్మించి, ఓ కోడ్‌ని నొక్కితేనే గేటు తెరచుకునే ఏర్పాటు అక్కడ ఉంది. ఈ కోడ్‌ని అందులో నివసించేవారికే ఇస్తారు. వాటిని గేటెడ్ సముదాయాలుగా వ్యవహరిస్తారు.

అమెరికాలో కేవలం ధనం కోసం బీదవారు నేరాలు చేయడమే కాక, మానసిక జబ్బులతో సరదాకి బలాత్కారాలు, దొంగతనాలు చేసేవారు కూడా అధికం. నచ్చిన అమ్మాయిని వెంటాడి వేధించే (స్టాకింగ్) నేరాలు అమెరికాలో ఎక్కువ. 2008 బ్యూరో ఆఫ్ జస్టిస్ విడుదల చేసిన గణాంకాల ప్రకారం జాతి, మతాల కారణంగా చేసే దాడులు అధికం. 2008లో బలాత్కార నేరాల్లో అరెస్టయిన వారిలో 65.2 శాతం శ్వేతజాతీయులే. ఆసియావాసులు ఒక్కశాతంలోపే అరెస్ట్ అయ్యారు. ముస్లిమ్‌లతో పోలిస్తే యూదుల మీద జాత్యహంకార దాడులు అమెరికాలో ఎక్కువగా జరుగుతున్నాయి

డ్రగ్ స్మగ్లింగ్ వల్ల అమెరికాలో నేరాలు వ్యవస్థీకృతంగా జరుగుతున్నాయి. నేరాలు, హత్యలనే వృత్తిగా చేసుకుని జీవించేవారు డ్రగ్ స్మగ్లర్ల దగ్గర లక్షల సంఖ్యలో ఉన్నారు.

నేరాల వల్ల బాధితులయ్యే వారిలో ఎక్కువ మంది పాతికేళ్ళ లోపు శ్వేతజాత్యేతర బీద మహిళలే. సెక్స్, ఆదాయం, వయసులని బట్టి బాధితులని నేరస్థులు టార్గెట్ చేయడం జరుగుతోంది. ఆర్థిక అసమానతలు ఎనభై నుంచి ఇరవై శాతంగా ఉన్న మనదేశంలో అంత పెద్ద ఎత్తున నేరాలు జరగడం లేదు. ఈ గణాంకాలన్నీ పరిశీలిస్తే, ప్రపంచంలోని మరే దేశంకన్నా అమెరికాలోనే నేరాలు అధికంగా జరుగుతున్నాయని తేటతెల్లమవుతోంది.

అర్థం చేసుకోవచ్చు. ఈ విషయం తెలీక కొందరు తెలుగు విద్యార్థులు అద్దె చవక అని అలాంటి వాడల్లో నివసించి హత్యకు గురైన ఉదంతాలు కూడా ఉన్నాయి.

రెండు ప్రపంచ యుద్ధాల్లోను, కొరియా, వియత్నాం యుద్ధాల్లోనూ మరణించిన అమెరికన్ సైనికుల కన్నా సాటి అమెరికన్లచేత స్వదేశంలో హత్యకి గురైన వారి సంఖ్యే అధికం అని అమెరికా గణాంకాలు బహిర్గతం చేస్తున్నాయి. ఒక్క 2007లోనే పోలీసులకి కోటీ పదిలక్షల నేరాలమీద ఫిర్యాదులు అందాయి. ఇది 1964తో పోలిస్తే మూడొందల యాభై శాతం అధికం!

2008 లెక్కల ప్రకారం నేరస్థుల్లో 77.2 శాతం మంది తెల్లవారు లేదా మెక్సికన్లు (ఇది కలిపి ఇవ్వబడింది), 20.3 శాతం మంది నల్లవారు. మిగిలిన రెండున్నర శాతం ఇతర జాతులకి చెందినవారు. పొరుగున ఉన్న బీదదేశం మెక్సికో నుంచి సరిహద్దు కంచెదాటి అమెరికాలో జీవించడానికి వచ్చేవారు అధికం. ఎలాంటి అధికారిక పత్రాలు లేకుండా ఇళ్ళ నిర్మాణంలాంటి రంగాల్లో కూలీపని చేసి జీవించే మెక్సికన్లు నేరాల్లో సిద్ధహస్తులు. అవకాశం వస్తే చాలు వారు నేరం చేయడానికి వెనుకాడరు.

నేరప్రవృత్తి అమెరికాలో అధికమైనందుకే ప్రతీ ఇంటికి బర్గ్లర్ అలారంలు తప్పనిసరి. అపార్ట్‌మెంట్ల సముదాయంలోకి కొత్తవాళ్లు రాకుండా

– డి. పద్మజ

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**జి. రాధారుక్మిణి**

301, శ్రీకృష్ణచంద్ర రెసిడెన్సీ,
వివేకానందపురం,
సైనిక్‌పురి,
సికింద్రాబాద్-94

వీరికి రూ. 150/- త్వరలోనే అందుతాయి.

## చతురంగం -6 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 కై | లా | 2 సం | | 3 ఘ | ర్ష | 4 ణ | | 5 తా | 6 వృ |
| క | | 7 తా | డ | 8 నం | | ధా | 9 ఆ | 10 ర | ము |
| | 11 ఆ | నం | దం | | 12 కు | ర | చ | | క్షు |
| 13 స | త్రం | | 14 న | 15 డ | త | | 16 ర | 17 ణ | ము |
| న | | 18 పా | | 19 మే | కు | | 20 ణ | వీ | |
| 21 ప | 22 ర | ప | 23 తి | | 24 త | 25 ర | ము | | 26 భే |
| | 27 చీ | రా | ల | | | క్త | | 28 త | డ |
| 29 భు | | 30 జు | లు | 31 ము | | 32 చ | తు | రం | గం |
| 33 జం | 34 గ | | | 35 ర | 36 రా | రి | | 37 గం | డం |
| 38 గం | యో | ప్ర | | 39 క | వి | త్ర | యం | | రుం |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. కూనపరెడ్డి సత్యనారాయణ, ఆమందూరు, చిత్తూరు జిల్లా 2. కె. మధుసూదనరావు, నాగారం, నిజామాబాద్ 3. వాణి నేమాని, విశాఖ 4. కణుగుల వెంకటరావు, శ్రీకాకుళం 5. కె.వి. దుర్గా మోహనరావు, వనస్థలిపురం 6. వి.వి. సత్యనారాయణ శెట్టి, బైరాగిపట్టెడ, తిరుపతి 7. నియాజ్ అలి, హైదర్‌గూడ 8. సి.జి.యస్. రావు, హైదరాబాద్ 9. కోనె నాగవెంకట ఆంజనేయులు, విశాఖ 10. యు. యు. యు, ఎమ్మిగనూరు 11. జి. సత్య, అలకాపురి, హైదరాబాద్ 12. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి 13. ఎ. అరుణ, మల్కాజిగిరి 14. ద్వైతా విజయకృష్ణ, హైదరాబాద్ 15. దేసూళ నిర్మలాదేవి, ఎర్రగడ్డ 16. టి.వి.డి.ఎన్. సీతారామారావు, విజయవాడ 17. చాట్ల గంగమణి, కామారెడ్డి 18. ఎ. సామ్రాజ్యలక్ష్మి, హైదరాబాద్ 19. డా. జి. విమలారంగారావు, చెన్నై 20. పి.బి. సీతాదేవి, నరసాపురం 21. వెంకటసత్యవతి, విశాఖ 22. చుండూరు అప్పలనరసింహం, బెంగళూరు 23. మేడూరి సత్యనారాయణ, తిరువూరు 24. పి. సీతామహాలక్ష్మి, స్విమ్స్ తిరుపతి 25. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి 26. గేదెల రామారావు, ఏలూరు 27. వి. సీతానరసింహారావు, విజయవాడ 28. ఎస్. నాగరాజు, విజయవాడ 29. జి. సూర్యనారాయణ, బందలాయిచెరువు, కృష్ణాజిల్లా 30. ఎ. దినేష్ బాబు, తిరుపతి 31. నండూరి నాగేశ్వరరావు, బేగంపేట 32. కె. స్వరలయ, చీరాల 33. ఎం. వసంత, బోరబండ 34. కె.ఎస్. ఆచార్యులు, విజయనగరం 35. ఇంద్రగంటి నరసింహమూర్తి, కాకినాడ 36. ఎం. జ్యోతి కృష్ణ, హైదరాబాద్ 37. ఎం. రామచంద్రరావు, హిల్‌కాలనీ, నల్గొండ జిల్లా 38. ఎం. సబిత, తణుకు 39. బి. వినయ్ గాంధి, అనకాపల్లి 40. వి.ఆర్. మోహన్‌రావు, అప్పన్నపాలెం, విశాఖ 41. ఎం. వసంతలక్ష్మి, విశాఖ 42. జంధ్యాల లక్ష్మి, ఈస్ట్ ఆనందబాగ్ 43. బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్ 44. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, విశాఖ 45. ఆలూరి సావిత్రి, చెన్నై 46. వ్యాకరణం ఈశ్వరి ప్రసాద్, హైదరాబాద్ 47. మేడిశెట్టి సురేంద్ర, ఒంగోలు 48. డి.వి. కామేశ్వరి, విశాఖ 49. పి. వంశీ కిషోర్, హన్మకొండ 50. గొడవర్తి సూర్యమిత్ర, జమ్మలమడుగు 51. ఎస్. వకుళాదేవి, వి. వెంకటాయపాలెం, ఖమ్మం జిల్లా 52. ఎం. కృష్ణ హరిత, విజయవాడ 53. కె. రామచంద్రరావు, కూకట్‌పల్లి 54. ఎస్. పద్మావతి, విజయవాడ 55. కె.వి. సుధాకర్‌రెడ్డి, కోట 56. శ్రీపెరంబుదూరు నారాయణరావు, హైదరాబాద్ 57. కాట్రగడ్డ భాస్కరరావు, సికింద్రాబాద్ 58. వెలగలేటి అనూరాధ, దిల్‌సుఖ్‌నగర్ 59. దేవులపల్లి లలిత, ధరణిపురం, కృష్ణాజిల్లా 60. జె.వి.వి. సత్యనారాయణ మూర్తి, బీజాపూరు 61. పి. ఫణి, భీమవరం

# చతురంగం - 7 ఆధారాలు

## అడ్డం

1. వరూధిని మనసుపడ్డవాడు (4)
3. గాడిదే కాస్త గంభీరంగా (3)
6. భార్య (2)
7. నాగార్జున, అనుష్క, ప్రియమణిల ఇటీవలి సినిమా గజిబిజి (3)
9. అడవి నెమలి (5)
11. అంతులేని, శ్రీశ్రీ స్వీయచరిత్రకు ఇదే పేరు (3)
12. దేవతాంశలో మొదటి సగం తిరగబడింది (2)
13. అవమానం.. ముక్క.. హాని (2)
15. శ్రీకృష్ణుని ముద్దుల భార్య పేరులో చివరి రెండక్షరాలు (2)
17. సత్కార్యాలకు ఉదారంగా ఇచ్చేది గజిబిజి (3)
19. నిలువు 14 సరిగ్గా (3)
21. అనసూయాదేవి భర్త.. ఓ మహాముని (2)
22. రాముడు వధించిన రాక్షసి పేరు గజిబిజి (3)
24. వీరుడు (3)
26. దేవాలయమే (3)
27. దారేపోయే వాడికి తోక తెగింది (3)
28. రావడం...పోకకు వ్యతిరేకం (2)
30. అగడ్త (3)
32. విరాటరాజు కొలువులో భీముడి పేరు(4)
34. తెల్లవారుజామున వినిపించే పక్షి అలారం (4)
36. తిరగబడిన భర్త (2)
37. జంతువులు మీద పడితే చేసే పని (4)
38. బురద (2)

## నిలువు

1. తెలుగు సంవత్సరాలలో మొదటిది (3)
2. కాకతీయ వీరనారి (5)
3. ఇది లేకుండా మనం బతకలేం (2)
4. యుద్ధం (3)
5. జుత్తు (2)
6. మొదలుపెట్టడమే మరోలా (3)
8. మన పూజనీయ ఇతిహాసమే.. గజిబిజి (3)
10. అక్కినేని తొమ్మిది పాత్రలు పోషించిన సినిమా (4)
14. గుళ్లో మోగించేది గజిబిజి (3)
16. మన్మథుడు (3)
18. మునుల చేతిలో ఉండే రుద్రాక్షల హారం గజిబిజి (3)
20. ఇదొక కార్ల కంపెనీ, ఎటునుంచి చదివినా అదే (3)
21. దేవేంద్రుని ముఖ్యపట్టణం.. గుంటూరు జిల్లాలోని ఓ ఊరు (5)
23. మచ్చ. చంద్రునిలో ఉండేది (3)
25. సరైన శబ్దాల్ని ఇలా అంటారు కిందినుంచి (2)
27. చెన్నైలోని ఓ ఏరియా పేరు గజిబిజి (4)
29. కొయ్య.. తిరగేస్తే పిల్లలు అక్షరాలు దిద్దుకునేది (3)
31. పోటీల్లో గెలిచిన వారికిచ్చేది.. హారం మధ్యలో అలంకారంగా ఉండేది (3)
33. తలకిందులైన మిక్కిలి (2)
35. బావి (2)

**నిబంధనలు**

1. చతురంగాన్ని అదే పేజీలో పూర్తిచేసి పంపాలి. 2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. 3. గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. 4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. 5. ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు 6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 7

రూ.150/- బహుమతి

గడువు తేది: అక్టోబరు 18

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | 3 | | 4 | ■ | 5 |
| | ■ | | ■ | 6 ఆ | | ■ | 7 | 8 | |
| 9 | 10 | | | | ■ | 11 | | | ■ |
| ■ | 12 | | ■ | 13 | 14 | ■ | ■ | 15 | 16 |
| ■ | 17 | | 18 | ■ | 19 జై | | 20 | ■ | |
| 21 | | ■ | 22 త్రా | 23 | | ■ | 24 | 25 | |
| | ■ | 26 | | | ■ | 27 | | | ■ |
| 28 | 29 | ■ | ■ | 30 | | | ■ | ■ | 31 |
| 32 | | | 33 | ■ | ■ | 34 | | 35 | |
| 36 | | ■ | 37 | | | డం | ■ | 38 | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (     ) చిరునామా : ------------------------------

------------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 34



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 18


చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : vipula.chatura@eenadu.net


ఉత్తమ వ్యాఖ్య :

రాత్రి దొంగతనం భలే బాగానే ఉందిరా రంగన్నా!
తప్పించుకోవడంలోనే నీ తెలివి
తెల్లారేలా ఉందిరా దొంగన్నా!!

– యు. చిట్టిబాబు, న్యూపాల్వంచ





## కాప్షన్ మీదే -33

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

చచ్చిన తర్వాత స్వర్గానికి
వెళతానో లేదోగానీ
ఇప్పుడు మాత్రం
త్రిశంకు స్వర్గంలో ఉన్నా!!

– కొట్రగడ్డ అనుపమ, సికింద్రాబాద్

ఓ దేవుడా! ట్రయినింగ్‌లో ఇదే చివరి పరీక్ష
పాసయ్యేటట్లు చూడండి సామీ!

–బి. అప్పారావు, తుని, తూ.గో. జిల్లా

ఎరక్కపోయి వచ్చాను
ఇరుక్కు పోయాను

– కె. ఉమామహేశ్వరరావు, తెనాలి

ఆపరేషన్ సక్సెస్ ..
లగేజ్ ఎక్సెస్!

– పి. శ్రీనివాసరావు, రాజమండ్రి

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78